# అజంతా

కొండల్లో, కోనల్లో అల్లరిగా తిరుగుతూ, దట్టమైన అరణ్యాల్లో, పచ్చికబయళ్లలో, సుడులుపడి, వొంపులు తిరిగి ఒయ్యారాలు వొలకపోసే నదీబాల వాఘోరా ఎత్తయిన పర్వత సానువుల్ని దాటి, సువిశాలమైదానంలో అలలతో, హంసంగా నాట్యంచేస్తూవుంది. ఆ దృశ్యం కనులపండువుగా, ఇంపుగా, సొంపుగా, మనోహరంగా వుండి చూపరులకు హృదయోల్లాసం కలిగిస్తోంది.

అది భయంకర అటవీప్రదేశం. కనుచూపుమేరలో ఇళ్లుగాని, ఊళ్లుగానీ అగుపించటంలేదు. అంతులేని అరణ్యం. వాఘోరానదీతరంగాల ధ్వనులు మినహా మరోశబ్దం చెవులకు సోకటంలేదు. అరణ్యగర్భంలోంచి వాఘోరా బయటపడ్డదా అనిపిస్తోంది. అరణ్యాలకు అవతల ఎత్తయిన పర్వతసానువులు మంచులో కప్పబడినట్లు మసకమసగ్గా అగుపిస్తున్నాయి. ఆ భయంకర ఏకాంతం సైతం హృదయాన్ని రసప్లావితంచేస్తోంది.

బదరీనారాయణ నదివొడ్డున ఆగాడు. చేతికర్ర, భుజం మీదిమూట క్రిందబెట్టి, తనచుట్టూవున్న సౌందర్య శోభను

తిలకిస్తూ నిలబడ్డాడు. ప్రయాణపు బడలిక కొంచెం తగ్గినట్లుగా భావించాడు. గలగల ధ్వనులతో ప్రవహించే నది. అతన్ని ఆకర్షించింది. వెంటనే స్నానానికి ఉపక్రమించాడు.

ఇరవైఅయిదు సంవత్సరాలు నిండీనిండనివయస్సు అతనిది. వయస్సుకుతగ్గ శరీరం-బంగారురంగు శరీరం. నల్లనికళ్లు; చూచిన ఏ విషయాన్నయినా ఇట్టేఆకర్షించగలశక్తి ఆకళ్ళలో వున్నదా అనిపిస్తుంది. కోలమువంటిముక్కు, గుండ్రనినోరు మొత్తంమీద అతన్నొక స్వప్నసుందరుణ్నిగా చేశాయి. పొడవైన గిరజాలజుట్టు ముడివేసినా బిగవక, భుజాలమీద వ్రేళ్ళాడుతోంది.

కండలుతిరిగిన శరీరం కాకపోయినా, మృదువుగా, అందంగా పెరిగింది అతనిశరీరం. యవ్వనం కూర్చిన సొగసు, లాలిత్యం, లావణ్యం అతని దేహంలో ఉట్టిపడుతున్నాయి. సుకుమారలక్షణాలు అనేకం అతనిలో అణగివున్నాయనిపిస్తుంది.

బట్టలువిప్పి, ప్రక్కనేవున్న మూటవైపు విసిరేశాడు. ఒక్కసారిగా నదిలోదూకి, అంబులాగా లోతులోకి దూసుకుపోయాడు. నదీజలాలను అల్లకల్లోలంచేసి ఎంతోసేపు స్నానం చేశాడు.

కొంతసేపటికి ఒడ్డుకువచ్చి, వొళ్ళుతుడుచుకుని, కర్ర, సంచి తీసుకుని ప్రయాణానికి సిద్ధమయ్యాడు. ఉతికి, ఆరవేసుకున్న బట్టలు మూటలోంచి బయటకు తొంగిచూస్తున్నాయ్. కడుపులో ఆకలి దహించుకుపోతోంది. అక్కడే కూర్చుని, మూటలోంచి రొట్టెలు బయటకుతీశాడు. కడుపునిండా తిని, తియ్యని వాహినీజలాన్ని తాగాడు. అప్పటికి సాయంత్రం

అయింది. సాయంత్రపు సూర్యుడు కొండలమీద ఎర్రజండా స్థాపించాడు. అలసిపోయిన శరీరాన్ని ఇసుకతిన్నెలమీద వాల్చి అలాగే నిద్రపోయాడు నిశ్చింతగా నిర్భీతిగా బదరీ. ఆ ఇసుక తిన్నెలమీద, పచ్చగడ్డిపై పడుకున్న బదరీకి ప్రాపంచిక బాధలు, కష్టాలు అవుపించవు. ప్రయాణబడలికతో డస్సిపోయి నాడేమో! అతనికి తెలీకుండానే నిద్రపట్టింది. గాఢసుషుప్తిలో మునిగిపోయాడు.

కళ్ళు తెరచి చూచేసరికి మంచుతెరలను చీల్చుకొని సూర్యుడు రెండుబారలపొద్దెక్కినట్లు సూచిస్తున్నాడు. కాల కృత్యాలు తీర్చుకుని ప్రయాణానికి ఉపక్రమించాడు. అప్ర యత్నంగానే అతని కంఠంలోంచి సంగీతధ్వని పెల్లుబికింది. విందుగా, హాయిగా పాడుతున్నాడు. మధ్యాహ్నానికి అడవిచివ రకు చేరాడు. ఎండవేడిమి తీక్షణంగావుంది. కడుపులో ఎలు కలు పరుగెడుతున్నాయి. కాని, తినటానికి సంచిలో ఏమీలేవు. వున్న నాలుగురొట్టెలు నిన్నటిసాయంత్రమే అయిపోయాయి. అడవిలో తిరిగాడు. ఏవో పండ్లు కోసుకున్నాడు. అవి మంచిగా వున్నాయో లేదో తెలీదు. ఆకలి అధికంగా బాధించడంచేత సుష్టుగా తిని, కడుపునింపుకున్నాడు.

* * * *

ఆ నిర్జనారణ్యంలో దోవచేసుకుంటూ బయల్దేరాడు. ఎత్తుగా పెరిగిన పచ్చికబయళ్ళు, చెట్లకు పెనవేసుకున్న లతలు తీగలు అన్నీ అతనిప్రయాణానికి అవరోధాలే. తాను భయంకర ప్రమాదస్థితిలోవున్నట్లు అతనికి తెలియకపోలేదు. అడుగడు

గనా అతనికి అనిపిస్తూనేవుంది, ఏక్షణానో మృత్యువు ఏపొద లోంచో, ఏచెట్టుమీదనుంచో తనను కబళిస్తుందని. ఒక చెట్టు మొదట్లోంచి వచ్చి పెద్ద విషసర్పమొకటి ప్రక్కనేతిరుగుతున్న పక్షిని పట్టి, మింగేసింది. అరణ్యంలో ఎక్కడినుండో జంతువుల భీకరార్భాటాలు వినిపిస్తూవున్నై. తలెత్తి చూచాడు. ఎత్తయిన చెట్లు సూర్యుని వెలుతురును సైతం అరికట్టాయి. చీకటిగావున్న ప్రదేశం. దోవలేదు. భయంకర వికటాట్టహాసాలు. ఏమువిన్నా ఏముచూచినా, ప్రతిపొదలోను అతనికి మరణం తొంగిచూస్తు న్నట్లుంది. మెరుపులు, చివరకు పక్షులకూతలు కూడా అతన్ని భయవిహ్వలుణ్ని చేస్తున్నాయి. అలాగే ధైర్యంతో బిక్క చచ్చి ముందుకు నడుస్తున్నాడు. అంతంలేని ప్రయాణం.

అలా తాను ఎంతదూరం పోవాలో తెలీదు; ఎప్పటికి ఆ అరణ్యంలోంచి బయటబడగలడో తెలీదు. బాగా అలసి పోయాడు; ఒళ్ళు చెమటలుకారుస్తోంది. బలహీనంగావున్నాడు. అడుగులు పడటంలేదు. ప్రయాణం ఏమాత్రం సాగటంలేదు. శరీరం విశ్రాంతిని కోరుతోంది; ముందుకు పోవటానికి ఎదురు తిరుగుతోంది. నిస్సత్తువ, బాధ, భయం.

ఒక చెట్టుక్రింద ఎండుటాకుల్ని, తీసి, ముళ్లను కొంచెం శుభ్రంచేసుకున్నాడు. కొంచెంసేపు అలసిపోయిన శరీరానికి విశ్రాంతి చేకూర్చాలన్నతలంపు. హఠాత్తుగా భయంకరమైన అరుపు వినిపించింది. అదిరిపడి లేచాడు. శరీరం పులకించింది. నరాలు బిగుసుకున్నాయి. దాపులోంచి ఓ పులి పరుగెత్తింది. అతన్ని పసిగట్టలేదు. అదృష్టవంతుడు. అప్పు డనిపించింది– అక్కడపడి నిద్రపోవడం ప్రమాదకరమని. పైకి చూచాడు

చెట్టు గుబురుగా, దుమగుగా వుంది. చెట్టుపైకి ప్రాకి, విశా లంగావున్న పంగలో ఒదిగి నిద్రపోయాడు.

గాఢసుషుప్తిలోవున్న అతన్ని భయంకరారణ్యరోదనలు కదల్చలేకపోయాయి. తనమీదుగనే పాములు పారాడి, బుసలుకొట్టినవిషయం కూడా అతనికి తెలీదు. దాదాపు అర్థ మరణావస్థలో నిద్రపోయాడు.

తెల్లవారి పక్షులు అతనిమీద నిలబడి చేసే రెక్కల చప్పుడుకు కళ్ళుతెరచాడు. తాను ఆ పక్షులలో ఒకపక్షి, ఆ జంతువులలో ఒకజంతువు ననుకున్నాడు. తనని చూచి అవి భయపడవు. పరుగెత్తవు. తను వాటి కేం అపకారంచేశాడు. చేస్తాడని వాటి కేం ఎరుక? కాలు క్రిందికి జారిపోతోంది. అప్పుడు గమనించాడు తా నెక్కడవున్నదీ. చెట్టుపంగలో నిద్రపోయిన విషయం స్ఫురణకువచ్చింది. చెట్టుదిగి, ఒళ్ళువిరుచుకున్నాడు. నిద్రమత్తు వదిలింది. అలసట ఎగిరిపోయింది.

మళ్ళీ నడకసాగించాడు. చేతి కందిన కాయలు కోసు కున్నాడు. గుడ్డిగా నడచి వాఘీరాపొడ్డుకు చేరుకున్నాడు. స్నానంచేస్తున్నాడు. ఒకదుంగ తనవైపే తేలిరావటం గమనిం చాడు. దగ్గరకు వచ్చినకొద్దీ అది బుసలుకొట్ట నారంభించింది. అది కొయ్యదుంగ కాదు. జలజంతువు. తనజీవితంలో ఎప్పుడూ కనీవినీవుండని జంతువు. ఒక్కసారిగా ఒడ్డుకు పరుగెత్తాడు. మోకాలు ముల్లై పట్టుకొని పరుగులంకించుకున్నాడు.

అది దాదాపు సాయంత్రపుసమయం. అరణ్యాంచివర కొచ్చాడు. ఒక పర్వతశిఖరంమీద కూర్చొని, లోతైన లోయ లోకి దృష్టిసారించి చూస్తున్నాడు. సూర్యు డెక్కడో అట్టడు

గునపడి కన్పించటమే లేదు. వెలుగుమాత్రం యింకా లోకంలో మిగిలివుంది. తా నెక్కడ వున్నది తనకే తెలియడంలేదు. అవన్నీ కొత్తప్రదేశాలు. జీవితంలో ఎప్పుడూ ఎరుగని ప్రదేశాలు. నిర్జీవ, భయంకరసీమ లవి. అవి అతనికి ఆశ్చర్యం, జుగుప్స కల్గించాయి.

దూరాన కొండలు మంచులో, పొగలో మునిగితేలుతున్నట్లగుపిస్తున్నాయి. అవి ఎంత పొడవున్నాయో తెలీదు. ఎక్కడైనా ఒక చిన్నగుడిసె అవుపిస్తే బావుండును. ఆకలి దహించుకుపోతోంది. దాహం అవుతోంది కూడాను.

అలాగే బాధగా భారంగా దేహాన్ని ముందుకు లాగుతున్నాడు. చీకటిపడ్డది. పగిలినకొండలు ఎదురుగా ప్రయ్యాలైన గుండెల్లాగా అగుపిస్తున్నాయి. గుండెలు బరువుగా, భారంగా వున్నాయి. డొక్కలో నొప్పికూడా వస్తోంది. ఆకలితో మరణిస్తానేమోనన్న భయంకూడా అతన్ని చుట్టుముట్టింది.

గమ్యంలేక అగమ్యంగా ముందుకు నడవటంవల్ల ప్రయోజనం అవుపించలేదు. నేల కొంచెం శుభ్రంచేసుకుని, మూటను తలగడగా అమర్చుకుని నిద్రపోయాడు. స్వప్నజగత్తులోకి పయనించాడు.

ఉదయం తిరిగి స్వప్నజగత్తు వదలి, బాహ్యజగత్తులోకి వచ్చేడు. క్షుద్బాధచే తలక్రిందులవుతున్నాడు. చుట్టూ విషాదంగా కలయచూచాడు; నిస్పృహ, నిరాశ మిగిలాయి జీవితానికి. ఇంతగా ఆకలితో ఎన్నడూ బాధపడి ఎరుగడు. ఆకలి బాధ అతనికి కోపాన్నికలిగించింది. నలిపి, నమిలి మింగేస్తోంది. ఎంతో అందంగావున్న ప్రకృతి భయంకరరూపాల్లో సాక్షాత్క

రిస్తోంది. ఒక ఊరుగాని, పల్లెగాని కనుపిస్తుందనేఆశ నశించి పోయింది.

దూరంగా ఏదో ఆక్రందించినట్లైంది.

పర్వతశ్రేణిలో అర్ధచంద్రాకృతిలోవున్న రమణీయ దృశ్యం అతనికి అగుపించింది. దానికిరువైపులా వింతైన గుహాలు. ఆదిమవాసులు తమ నెలవులుగాచేసుకున్న గుహాలకు వీటికి పోలికలేదు. అందుకే ఆశ్చర్యంగా అవలోకించాడు. నాటక శాలలో ఆరోహణాక్రమంలోవున్న మెట్లవరుసలులా వున్న మెట్లు అతన్ని గతించిన నాగరికలోకాల్లోకి తీసుకువెళ్ళినై. ప్రాచీననాగరికత, సంస్కృతి ఆ గుహాల నిర్మాణంలో అతనికి అస్పష్టంగా ద్యోతకమయ్యాయి. దహించుకుపోయే ఆకలిని సౌందర్యతృష్ణ అణచివేసింది. ఇప్పుడతను ఆశ్చర్యసంభ్రమాలతో ఆకలినిసైతం మరచిపోయాడు. ఆ గుహాలనుగురించే యింకా యింకా తెలుసుకోవాలన్న కుతూహలం, అభిలాష అతనిలో కలిగాయి.

నిలువుగాగావున్న పర్వతసానువులనుండి క్రిందికి దిగాడు. అప్పుడు కాళ్ళు జారిపడయ్ కూడా. కాని, నిలదొక్కుకుని అవరోహణంచేశాడు. వొళ్ళంతా చెమటతో తడిసిపోయింది. శ్వాస మహాభారంగా వొస్తోంది.

అడుగులు త్వరత్వరగా పడుతున్నాయి. అలసట తీరిపోయింది. ఏదో ఆకాంక్ష, ఆవేదన, తొందరపాటు అతని అడుగుల్లో, చూపుల్లో అగుపిస్తున్నాయి. శరీరం స్వాధీనంలోకి వచ్చింది. ఆనందసంగీతరుచులు అతనిలో. ఆకలి ఒకరకమైన బాధ. అది శారీరకవాంఛ. తాత్కాలికంగా అది అతన్ని

బాధించలేదు. అతనిభావాలను ఆకలి అరికట్టలేకపోయింది ఆక్షణంలో.

వాఘోరా తిరిగి దర్శనమైంది. అక్కడ నది అంతలోతు గాలేదు. అక్కడక్కడ నదిలో కొండరాళ్ళు, మేటలు, లంకలు అగుపిస్తున్నాయి. ఆ కొండరాళ్ళను దాటుతూ, వాఘోరా సింహ సంగీతం ఆలపిస్తోందా అనిపిస్తోంది అక్కడ నదీతరంగాలు చేసే ధ్వనులకు. రాతిమీదనుండి రాతిమీదకు దూకుతూ మోకాలి లోతునీళ్ళలో నడుస్తూ నదిఅవతలిఒడ్డుకు చేరాడు. కర్ర, మూట అవతలపెట్టి, శుభ్రంగా స్నానంచేశాడు. అలసట తీరినట్లయింది.

గాలిగలగలల్లో పికనిస్వనాలు వినిపిస్తున్నాయి. చెట్ల మీద గంతులు వేస్తూ కోతులు ఆటలాడుకుంటున్నై. పిటన్నింటిని మించి తిరుగలి మోతలు, ఉలిచప్పుళ్ళు ఆగిఆగి, వింతవింత ధ్వనుల్లో వినిపిస్తున్నాయి.

నదీతటంనుండి గుహాలవరకు మలచబడ్డ మెట్లు శాఖలు బారులుగా వుండి అతన్ని ఆహ్వానిస్తున్నాయ్. ఒక్కొక్కటి గడచి, ఇనుమడించిన ఉత్సాహంతో పైకి పోతున్నాడు. పైన ఆగి, చుట్టూకలయచూచాడు. తీర్చిదిద్దిన గుహాలు, ద్వారాలు, గోడలు, శిల్పాలు అన్నీకొండరాళ్ళతో మలచబడి అందంగా, ఆకర్షణీయంగా వున్నాయి. ఈ దృశ్యాలు అతన్ని ఆశ్చర్య చకితుణ్ణి చేశాయి. ఆ శిల్పాలు తనను తన్మయస్థితికి తీసుకు పోతున్నట్లు అనుభూతిపొందాడు. సుఖ-శాంతులకు ఆ ప్రదేశం ఆలవాలమైనట్లు భావించాడు.

అతసికళ్లు ఆనందంతో మెరసినయ్. ఎవరిపనుల్లో వారు నిమగ్నులై, అనేకమంది అటుయిటు తిరగటం అతను గమనించాడు. వాళ్లుమాట్లాడడం విన్నాడు. అంతా స్వప్నసదృశంగా వుంది బదరీనారాయణునిదృష్టికి.

*                *                *                *

బదరీనారాయణ చూచిన అనేకప్రదేశాలకంటె అది చాలా వినూత్నంగా, ఆకర్షణీయంగా. రమణీయంగా వున్నది. తనచుట్టూ అనేకమంది మనుషులు, కళాకారులు, శ్రామికులు ఎవరిపనుల్లోవారు నిమగ్నులై, తదేకధ్యానంతో ఎవరిపనులు వారు చూసుకుంటున్నారు. ఓ కొత్తవ్యక్తి-అభ్యాగతి వచ్చిన విషయుంకూడా వారికిపట్టలేదు. ఇక్కడొకరు మరిద్దరువ్యక్తులతో తీవ్రంగా వాదిస్తున్నాడు. అక్కడొకరు తనపరికరాలకు పదునుపెట్టుకుంటున్నాడు. అనేకమంది ద్వారాలు మలచడంలోను, శిల్పాకృతులను తీర్చిదిద్దటంలోను నిమగ్నమైవున్నారు. కొందరు రంగులను పాత్రల్లో మిశ్రమంచేస్తున్నారు. మరికొందరు రాళ్లనునూరి, ఏవేవోకలిపి రంగులుగా నూరుతున్నారు. వింతవింత రంగులబట్టలను వివిధాకృతులలో ధరించిన వారందరు నారాయణదృష్టి నాకర్షించినవారే. కొందరు కాషాయాంబరధారులు; కొందరు రాచదుస్తులనుపోలిన దుస్తులు ధరించారు. కొందరు శరీరాన్ని దాచుకుంటే చాలునన్నట్లు ఒకే గుడ్డ వంటిచుట్టూ చుట్టుకున్నారు. కొందరు అర్ధనగ్నంగానే వున్నారు. కాని, చాలామంది తల, గడ్డం నున్నగా గొరిగించుకున్నవారే, కొందరు మాత్రం పొడుగాటిజుట్టు ముడిచి, నడినెత్తిని ముడివేసుకున్నారు. అలాంటివారు సన్నగా, బలిష్టంగా

వ్రరడి, కష్టాల్ని, బాధల్ని ఎదుర్కొన్నవారివలె అనిపిస్తున్నారు. ఇంచుమించు అందరూ జీవితంలో అలసిపోయి, ప్రేరణవల్ల ఒకచోట తారసిల్లారా అనిపిస్తుంది వారినిచూస్తే.

ఈ కర్మిష్టులంతా ఎవరై వుంటారా అనే ఆశ్చర్యం అతన్ని బాధించింది. విభిన్న సంస్కృతులకు చెందిన వ్యక్తులై వుంటారు. విభిన్న తెగలకు చెందిన మనుష్యులై వుంటారు. కాలగర్భంలో కలసిపోయిన నాగరికతతాలూకు వ్యక్తులైవుంటారు. అలాంటి వ్యక్తుల్ని అలాంటిసంస్కృతులనుగురించి ఎప్పుడో, ఎక్కడో విన్నజ్ఞాపకం అతనికి.

వాళ్ల మధ్యగా నడచివెళ్ళాడు. కాని, ఎవరూ అతనికేసి చూడలేదు. చూడాలని ప్రయత్నించనూలేదు. అసలు ఆ ఆగంతుకుణ్ని గురించి పట్టించుకున్న పాపానపోలేదు. ఒక మూలగా పదిహేడుసంవత్సరాల కుర్రవాడు ఏవో రంగుల్ని నూరటం గమనించాడు. బలంగా, ఆరోగ్యంగావున్న, ఆ యువకునిముఖం అతనిసౌందర్యాన్ని వ్యక్తంచేస్తోంది. అందంగా వున్న అతనిముఖం బదరీనారాయణ నాకర్షించింది. సన్నగా, పొడుగ్గా, కొసలు దేరినవ్రేళ్ళు ఆత్రుతతో రంగులు కలుపుతున్నాయి. అతను బరువైన ఉత్తరీయం పైన కప్పుకున్నాడు. పొడవైనజుట్టు శిఖగా ముడిచినా అందంగా అగుపిస్తోంది. తన పనిలో గాఢంగా నిమగ్నమైనట్టున్నాడు. కనీసం ఆగంతుకుని వైపు చూడనైనాలేదు.

బదరీనారాయణ అతనికి దగ్గరగా వెళ్ళాడు. తనవైపు చూస్తాడని ఆశించి నిలబడ్డాడు చాలాసేపు. కానీ కుర్రవాడు అతనిరాకను గమనించినట్టేలేదు.

బదరీనారాయణగొంతుకలోంచి ఒకధ్వని వెలువడింది.
ఆ శబ్దానికైనా అతను తలెత్తిచూడలేదు.

'క్షమించండి' అన్నాడు కొంచెం హెచ్చుస్థాయిలో, తనఉనికిని, రాకను అతనికి తెలియచెయ్యాలని.

యువకుడు నెమ్మదిగా తలెత్తి చూచాడు. అతని ముఖంలో ఏమీ మార్పులేదు ఒక చిరునవ్వు మినహా. అతను నవ్వినప్పుడు బయటపడ్డ తెల్లనిపలువరుసలే అర్థాన్నిచ్చాయో బదరీకి అవగాహనకాలేదు.

తేనెరంగులోవున్న ఆ కళ్లు, ఆ చూపులు యువతీ హృదయాన్ని స్ఫురింపజేశాయి.

"ఏమిటి?" అన్నా డతను సన్నని సంగీతంలాంటి ధ్వని చేస్తో.

"నేను దూర దేశస్తుణ్ని, కొత్తవాణ్ణి" అన్నాడు బదరీ.

"అని తెలుస్తోనేవుంది."

"నాకు ఆకలవుతోంది; దాహం వేస్తోంది. తినటానికి ఏదైనా కావాలి" అన్నాడు బదరీనారాయణ.

"ఆనందవిహార్ కు వెళ్ళు, అక్కడ ప్రభుఘోష్ అని వుంటాడు. ఆయన్ని అడుగు. నీకు ఏంకావాలన్నా యిస్తాడు."

"మంచిది...అన్నట్లు ఇది ఏ ప్రదేశం?...దీని పేరు?"

"అజంతా"

"విహారమా?"

"అవును, అలాంటిదే"

"ఎలాంటిది?"

అతను తిరిగి తనరంగులు కలుపుకోవటంలో నిమగ్నుడైనాడు.

బదరీనారాయణ ఒకక్షణం అలానే నిలబడ్డాడు. కాని, తను ఇంకా అక్కడ వుండటంలో అర్థంపర్థం అగుపించలేదు. అక్కణ్నుంచి కదలి, విహారంకోసం బయల్దేరాడు. ఏదో ఆలోచన తట్టింది. తిరిగి ఆ యువకునిదగ్గరకు వెళ్ళి, అతన్ని చేత్తో తట్టాడు.

"ఆఁ, ఏమిటి?"

"బొద్దులా?" అని అడిగాడు. ఏదో గొప్పవిషయం కనిపెట్టినంత సంతోషంఅయింది అతనికి.

ఆ యువకుడు మళ్లీ నవ్వాడు. ఆ నవ్వులో సంతృప్తి అగుపించింది నారాయణకు.

"ఆశ్చర్యంగా వుందా?" అంటూ అతను తిరిగి తన రంగులను మిశ్రమంచేయుటలో నిమగ్నుడైనాడు.

ఈసారి సంతృప్తిగా వెళ్ళాడు నారాయణ విహారంవైపు.

*    *    *    *

మరునాడు బదరీనారాయణ ముఖ్యాశ్రమణుడు వృద్ధుడు అయిన విజ్ఞానందుని దర్శించటంకోసం సారిపూత్రచైత్యం వెళ్ళాడు. ఆచార్య విజ్ఞానందులు బక్కపల్చగా, పచ్చని శరీరంతో, విజ్ఞానసముపార్జనంలో శుష్కించినట్టు అగుపించారు. శరీరాన్ని శుష్కింపచేయటం బౌద్ధాచారమేమో ననిపిస్తుంది. వారిని దర్శించినవారికి నున్నగా ముండనంచేయించుకున్న తల, ముడతలుపడి, వృద్ధాప్యాన్ని సూచించేముఖం, రక్తమాంసాలు వారిఅధీనంలో లేనట్టు అగుపిస్తోంది. ద్రవీభూతమైన

నల్లని లోతైనకళ్ళు, పల్చటినోరు వారివిజ్ఞానతృష్ణకు నిదర్శనాలు. పల్చటినారవస్త్రాలు ధరించారు. దాదాపు తురీయావస్థనుపొందిన ఆచార్యులు డెబ్బయ్యోపడిలో వుండి వయస్సుతో జ్ఞానాన్ని ముడిపెట్టారా అనిపిస్తుంది.

బదరీనారాయణ రావటంతోనే అతన్నిచూచి, ఆచార్యులు మందహాసంచేశారు. మంద్రంగా నవ్విన ఆయనలో శాంతిసౌఖ్యాలు పెనవేసుకున్నాయా అనిపించింది. బదరీనారాయణ హృదయపూర్వంకంగా నమస్కరించాడు. ఆచార్యులు ప్రత్యభివందనంచేశారు.

"నీకు శాంతి లభించుగాక! నీపేరేమిటి నాయనా?" ఆచార్య విజ్ఞానందులు ప్రశ్నించారు.

"బదరీనారాయణ"

"దూర దేశంనుండి వస్తున్నట్టున్నావు?"

"నర్మదానదీతీరంలోవున్న కుటీరావతంనుండిస్వామీ"

"ఎక్కడికైనా వెడుతూ అజంతా దర్శించావా?"

"లేదు. అనిశ్చయమైన ప్రయాణం నాది."

"ఎందువల్ల?"

"జీవితంతో అలసిపోయాను కనుక"

"విచారించవలసిన విషయమే. కాని, పనిఏమీ చేయలేదుగదా?"

బదరీనారాయణ సమాధానమివ్వటానికి తటపటాయించాడు. కళ్లు చెమర్చినయ్. బరువుగా సమాధానంచెప్పాడు—

"కాదు. నూత్నజీవితం వెదకటంకోసం గతజీవితాన్ని వదలివేశాను స్వామీ! నూత్నజీవితమార్గం కొండకోనల్లోనో,

పర్వతారణ్యాలలోనో లభిస్తుందని ఆశించి, ఇలా పర్వతాలలో అరణ్యాలలో వెదుక్కుంటూ తిరుగుతున్నాను. అనుకోకుండానే యిక్కడికి రాగలిగాను."

"ఇక్కడ నువ్వేంచేయగలవు?"

"చిత్రలేఖనం, శిల్పం నేర్చుకున్నాను"

"ఆ రెండూ కరతలామలకములా?"

"ఉజ్జయినిలో లక్ష్మీదత్తుగారిశిష్యరికంచేసి, పట్టిసి అభ్యసించాను స్వామీ!"

"చాలామంచిది. అయితే నీవు బౌద్ధుడివా?"

"కాదు స్వామీ!"

"బ్రాహ్మణుడివా?"

"అదీకాదు"

"మరి జైనమతస్థుడివా ఏం?"

"అసలేకాదు"

"అయితే నువ్వెవ్వరవు? మానవుడన్నాక ఏదో ఒక మతస్థుడై వుండాలిగదా!"

"అది అస్వాభవికమూ, విప్లవాత్మకమూను. నేను ఏ మతాన్ని నమ్మటంలేదు. దేన్నైతే నమ్ముతానో అదే నా మతం కావాలి. కాని, నేను ఏ మతసిద్ధాంతాన్నీ నమ్మటం లేదు అంతగా"

"నీది చాలా వింతస్వభావంలా వుంది. నిష్పక్షపాత వైఖరి మతవిషయకంగా బహు ప్రమాదం సుమా!"

"అదిగాదు స్వామీ! మతానికి కట్టుబడకుండా, నేను నమ్మినదాన్ని ఆచరించుటలో తప్పులేదని భావిస్తున్నాను.

నేనుచేసేపని మంచిదని నాకు తోచినప్పుడు దానికిఅండగా ఒక మతం, సిద్ధాంతాలు, రాద్ధాంతాలు వుండటం అనవసరంకాదా ఆచార్యా! స్వతంత్రించి మానవుడు ఏ కార్యమూ చేయ గూడదా ?"

ఆచార్య విజ్ఞానందులు తనముందు తనతోవాదిస్తున్న యువకుని అర్థంచేసుకున్నాడు. అతను తప్పుదారిని పోతున్నట్లు భావించాడు. మతంఅండలేని మానవుడు సంఘంలో, సభ్య ప్రపంచంలో వ్యక్తిగా పరిగణింపబడజాలడుగదా ! మతం ఒక్కటే మనిషిని జంతుజాలంనుండి ఔన్నత్యంలోకి తీసుకు పోగలిగింది. కుర్రవాడిలో జ్ఞానతృష్ణ వున్నది. తాను చెప్పే దేమిటో అతనికి తెలుసు. యుక్తాయుక్తవిచక్షణకూడా వున్నది. ఆచార్యులు నిండుగా మందహాసంచేసి,

"అయితే నీవు నావద్ద అభిలషించేదేమిటి నాయనా?"

"నన్ను యిక్కడ వుండనివ్వండి. మీలో ఒకడుగా నేనూ జీవిస్తాను. నా కిక్కడే నా జీవితశేషాన్ని గడపాలని వుంది. అనుజ్ఞ ప్రసాదించండి ఆచార్యా"

"నువ్వు అలాగే వుండవచ్చు. కాని, నిన్నొక్కవిష యం అడుగవలసివుంది"

"అడగండి ?"

"బుద్ధభగవానునిగురించి నువ్వు తెలుసుకోవాలి. నీ దైనందినకృత్యాలు అయిపోగానే, విశ్రాంతిసమయంలో బుద్ధ దేవునిగురించి తెలుసుకో ప్రయత్నించు."

"అది అవసరం అంటారా ?"

"కాదు కాని, ఇది బౌద్ధుల విశ్రాంతిమందిరం. బౌద్ధుడు కాని ఒకవ్యక్తిని మాలో వుండనివ్వటం ఆ భగవాన్‌కి అన్యాయంచేసినట్లవుతుంది"

"అది తప్పనిసరేనంటారా ఆచార్యా?"

"నీయిష్టంమీద ఆధారపడివుంది. బలవంతంలేదు"

"అలాగా స్వామీ! అయితే అంగీకారమే. కాని నేను వినేవిషయాలు, బోధలు అన్నీ నేను నమ్మలేకపోవచ్చు. అది నా అపరాధంగా భావించవద్దని ప్రార్థన."

"నీనమ్మకాలు నీవే నాయనా! బలవంతం ఏముంది?"

చిరునవ్వు యిద్దరిపెదాలమీద దరహాసంచేసింది. ఆచార్యులు నారాయణకి సెలవిచ్చారు. నారాయణ వినమ్రతతో వంగి, అభివాదంచేసి వెళ్ళిపోయాడు.

*  *  *  *

బదరీనారాయణ చిత్రశాల దర్శించాడు. వాఘురానది వొడ్డున చెట్లనీడల్లో ఉపదేశపాఠం జరుగుతూవుంది. యువకులు, వృద్ధులు అయిన కళావిద్యార్థులు వజ్రలేపనాన్ని గురించి ఉపన్యాసం అతిశ్రద్ధగా వింటూకూర్చున్నారు. రంగులు కలపటం, వర్ణచిత్రాలు చిత్రించటం, చిత్రాల్లో హావభావాలు ఎలా వొప్పించాలో విశదపర్చటం గురువుల కర్తవ్యం. సచేతనంగా భావనాయుక్తంగా చిత్తరువునురచించవలసినపద్ధతులను, సత్య, వైణిక, నగర, మిశ్ర మొదలైన చతుర్విధ చిత్రకళాభ్యాసాన్ని గురించి పాఠం జరుగుతోంది. విద్యార్థులు ఏకాంతంగా అతిశ్రద్ధగా నేర్చుకోవటం గమనించదగ్గవిషయం.

(3)

చిత్రకళాచార్యుడు వృద్ధుడు, స్ఫురద్రూపి. పూర్ణచంద్రునివలెవున్న ఆయనకు షష్టిపూర్తి జరిగిందనిపిస్తుంది. తెల్లగా మెరిసే తీక్ష్ణమైనకళ్లు, వెడల్పైననుదురు, కొనతేలినముక్కు, చిన్ననోరు–అన్ని తీరుతెన్నులు కలిసి, సుందరాకృతిగా తయారుచేసినయ్ ఆచార్యుల్ని. అతనే ఆచార్య పద్మదత్తుడు.

బదరీనారాయణ కళావిద్యార్థులతో కూర్చున్నాడు. ఆశ్చర్యంగా వాళ్ల వేపు చూచాడు. అందరూ వింతమనుషులు; వింత అభిరుచులుగలవారు; ఏదో సేచ్ఛకుని, ఏదో కష్టపడి పనిచేయాలనే సంకల్పంకలవారుగా అగుపించారు. అందరూ నున్నగా చేసుకున్నగడ్డాలవారేగాని, జుట్టుముడితో, ఏకాంబరాలతో, స్వచ్ఛంగా, నిర్మలంగా, ఎవరికివారే ఒకస్వప్న జగత్తులో సంచరిస్తున్నారా అనిపిస్తోంది. ఒకవైపున తను మొదటిసారిగా చూచిన యువకుడు అగుపించాడు. అతనితోనే తాను మొదట మాట్లాడింది. ఎంతో శ్రద్ధగా ఆచార్యులపాఠాన్ని వింటున్నాడు. ఎంతో దీక్ష అతనిఏకాగ్రతలో అగుపిస్తోంది. చాలా అందంగా, ఆకర్షవంతంగా వున్నాడు దూరానికి. తనుకూడ ఆచార్యులు చెబుతున్నది. ఆలకించాడు.

"కళకు జీవితతత్వానికి సమన్వయం అవసరం" ఆచార్యులు చెబుతున్నారు, "కళకు ప్రత్యేకమైన మనుగడలేదు. కళ జీవితాన్ని, జీవితరహస్యాన్ని తెలియజేయాలి. నీవు వేసే ప్రతిచిత్తరువు ఉద్రేకపూరితంగా వుండాలి. అప్పుడే నీలోని భావాలను నీ చిత్తరువులో అభివ్యక్తంచేయగలుగుతావు. తాత్వికచింతన నీలోవున్నప్పుడే, రసానందంలో మైమరచిఉత్తమ రచనచేయగలవు. అప్పుడే ఆ నీ రచనల్లో అద్వైతానందం

లభిస్తుంది. పరిపూర్ణత్వం ద్యోతకం అవుతుంది. చిత్రానికి పరిపూర్ణత్వం సిద్ధిస్తుంది.

పద్మదత్తుడు ఉద్రేకంగా చెప్పుకుపోతున్నాడు—"మనలో కళ అణగిమణగి వుంటుంది. దాన్ని సక్రమపద్ధతులలో వ్యక్తం చేసినప్పుడే ఉన్నతస్థానం పొందగలుగుతుంది. ఎక్కడో అణగి వున్నా, అప్రయత్నంగా ఉప్పొంగి, కార్యరూపంధరించి, సాఫల్యంపొందే అవకాశం ప్రతిహృదయానికి లభిస్తుంది. అందుకు కఠోరతపస్సు అవసరం. తపోసమాధిలో తన్మయస్థితిలోకి వెళ్ళి, కళాకారుడు తననుతాను మరచిపోయినప్పుడే ఆ సంపూర్ణత్వం సిద్ధిస్తుంది. తనకు, తనకళాఖండానికి పరిపూర్ణత్వం లభిస్తుంది. ఇది సాధించటం అంత తేలికకాకపోవచ్చు. కొందరికి నెలలు, కొందరికి సంవత్సరాలు పట్టవచ్చు. ఆ యోగతపస్సులో ఒకనాటికి ఆత్మసాక్షాత్కారంకలిగి, కళాసిద్ధి కలుగుతుంది. ధ్యానమగ్నతతి, అనంతంలోనుండి వినిపించిన మధురమయ సంగీతమారుతాలే కళాకారుణ్ని కొత్తలోకాల్లోకి తీసుకుపోతాయి. అక్కడే అతనికి రససిద్ధి కలుగుతుంది. ఆ రసమయ జగత్తే అతనికి వాస్తవము. స్వాప్నికము, సౌందర్యోపదేశికముగా సాక్షాత్కరిస్తుంది.

కళ మానవునికి, మానవత్వానికి పరిపుష్టి కలిగించాలి. ఉద్రేకం కలుగజేయాలి. అలాంటి ఉద్రేకం కలగాలంటే భౌతికబంధనాలనుండి నీవు దూరం కావాలి. ఆధ్యాత్మికచింతనలో పరిపుష్టిపొందాలి. స్థూలదృష్టికి గోచరమయ్యే ప్రతి వస్తువు సూచనప్రాయంగా కళలో జ్ఞానప్రబోధం చేయగలిగి

నదై వుండాలి. అదే కళాకారులు తమదీక్షలో సాధించవలసింది. దానిసాధనకే కృషిచేయవలసివుంటుంది.

ఆనాటిఅధ్యయనం పూర్తిఅయి, అందరూ సెలవులకు వెళ్ళిపోయినపుడు బదరీనారాయణ పద్మదత్తునిదగ్గరకు వెళ్ళి, ముకుళితహస్తాలతో నిలబడ్డాడు. అతను శాంతదృక్కులతో నారాయణునివంక చూచాడు. శాంతస్వభావ్రులకళ్ళలోకి లోతుగాచూచి, హృదయాలను అంచనావేయటం నారాయణ అలవాటు. శాంతజీవులంటే, శాంతిప్రియులంటే, శాంతికాముకులంటే అతనికి మక్కువెక్కువ.

"నీ పేరేమిటి? నీవు కొత్తవాడివే!"అని అడిగాడు పద్మదత్తుడు.

"కొత్తవాణ్ణే, నిన్ననే వచ్చాను. నన్ను బదరీనారాయణ అంటారు"

"నీవు నా పాఠం విన్నావుగదూ! చిత్రలేఖనం వచ్చునునుకుంటా"

"చిత్రలేఖనము, శిల్పంకూడా వచ్చు"

"అనుభవంవుందా?"

"కొద్దిగా ఉజ్జయినిలో అధ్యయనంచేశాను"

"అలాగా! అయితే మంచికట్టుదిట్టంగానే నేర్చుకున్నావన్నమాట. నీకు బాగానే వచ్చివుంటుంది. నా పాఠాలు వినవనసరంవుండదు నీకు"

"కాని, మీరు చక్కగా చెబుతున్నారు. ఇంకా నేర్చుకోవాలనివుంది"

"లక్ష్మీదత్తుకంటె అధికంగా నేనేమీ చెప్పలేను. చెప్ప గలనంటావా? అతన్ని మించిన గురువు లేడు"

"నేను లక్ష్మీదత్తువద్దనే నేర్చుకున్నానని మీ కెలా తెలుసు ?"

"గత ఇరవై సంవత్సరాలనుండి అతనే ఉజ్జయినీ కళా శాలలో ఉత్తమాచార్యుడు. చాల గొప్పవాడు. మంచి ప్రజ్ఞా వంతుడు కూడాను"

"మీరు లక్ష్మీదత్తును ఎరుగుదురా ?"

ఆచార్య పద్మదత్తువదనంపై దరహాసం వెలసింది. చిరు చెమటలుపోసి, గాలికి ఆవిరులైపోయినై. "ఎరిగివుండాలి, తప్పదు, నా తమ్ముడే గనుక"

బదరీనారాయణ తలవొంచుకున్నాడు. తలఎత్తి చూచి నప్పుడు అతనిలో లక్ష్మీదత్తుపోలికలు తొలుత అస్పష్టంగాను, తర్వాత సుస్పష్టంగాను అగుపించినయ్. ఇద్దరిభావాలు వేరు. బ్రతుకులు వేరు. వేర్వేరుధ్యేయాలతో జీవనయాత్ర సాగిస్తున్నా రనిపిస్తుంది. లక్ష్మీదత్తు సాధికారంగా, గర్వంగా చెప్పేవారు పాఠాలు. పద్మదత్తు చిరుగాలికెరటంలా అగుపిస్తున్నాడు. లక్ష్మీదత్తు మంచి దేహపుష్టికలిగినవ్యక్తి. పద్మదత్తుడు జ్ఞానపుష్టి కలిగిన మానవుడు. కాని, బదరీనారాయణకు పద్మదత్తుని సన్నిధిలో నైర్మల్యము, శాంతిసుఖాలు గోచరించినయ్. మానవత్వపు ఔన్నత్యశిఖరాలను ఆయనసేవలో అందుకో గలననుకున్నాడు. ఆయన పూర్ణకుంభం. అది సంతోషసాగరం.

"నీవు పనిచేసేముందుగా ఒకసారి మా బౌద్ధవిహారాలు చూడటం మంచిది. నాతో రా వెళదాం. నీకు తోడుగా

వుంటాను. విహారాలన్నీ తిరిగి సందర్శించటం నాకూ ఆనందంగా వుంటుంది. నీకు తెలియచెప్పినట్లూ అవుతుంది."

"అబ్బ! ఎంత సహృదయం వీరిది!" అనుకున్నాడు నారాయణ.

* * *

ఆచార్య పద్మదత్తు అతన్ని సంఘచైత్యంవద్దకు తీసుకు వెళ్ళాడు. అది గుర్రపుడెక్క ఆకారంలోవున్న మండపం. బాహ్యాలంకరణ విశిష్టంగా చేయబడ్డది. లోపల స్తంభాలు ఎంతో పనితనంతో మలచబడ్డవి. దీర్ఘచతురస్రాకారంగల పెద్ద హాలు శిల్పపుచెక్కడాలతో మూడుభాగాలుగా విభజించబడ్డది. స్తంభాలచివర ఆర్చీలు చెక్కబడ్డాయి. పైన కప్పు. హాలుచివరను ఎత్తయినమండపం. మండపంలో ఆసనంమీద బుద్ధవిగ్రహం నిండుగా, అందంగా, గంభీరంగా అగుపిస్తోంది.

స్తంభాలు, గోడలు, పైకప్పు అన్నీ చిత్ర, శిల్పకళా శోభితాలే. బదరీనారాయణ సంభ్రమాశ్చర్యాలతో తిలకించి దిగ్భ్రమ చెందాడు.

"ఇది మా ప్రార్థనామందిరం. ఇరుసంజలలో బౌద్ధులు, శ్రమణులు, యతులు అందరూ యిక్కడ సమావేశమై, ప్రార్థనగీతాలు ఆలపిస్తారు. అప్పుడప్పుడు ఆచార్య విజ్ఞానందులు తమసందేశసారాన్ని అందిస్తారు. విజ్ఞానందులు మహోన్నత వ్యక్తి. కొద్దిరోజుల్లో నీకూ తెలుస్తుందిలే ఆయనఔన్నత్యం గురించి"

ఆ తర్వాత అతన్ని అంగులిమాలవిహారానికి తీసుకు వెళ్ళాడు. అది భావపుష్టికి, కళాలంకృతికి పుట్టినిల్లు. వలయా

కారంలోవుండి పైకి పోనుపోను ఒకేబిందువుతో కలసిపోతున్న ట్లుండి, మూడుపద్మాలు ఒకదానితర్వాత ఒకటి అమర్చబడ్డవా అనిపిస్తుంది. అందు శిలాపద్మం శిల్పచాతుర్యాన్ని చాటి చెబుతూంది. స్తంభాలచివర పల్చటిపొర అగుపిస్తుంది. అక్కడి నుండి విహారంబయటికొస్తున్నట్లు శిల్పాకృతులు మలచబడి వున్నాయి.

ఆ హాలు నల్చదరంగావుండి పంధ్రెండు స్తంభాలమీద నిలబడ్డట్లుంటుంది. గాలి, వెలుతురు లోపలప్రవేశించటానికి పది రంధ్రాలు పైవైపున అమర్చబడ్డాయి. ప్రతిదానికి కుడిఎడమల మూడు, వెనుకముందు రెండు గాలికోసం కిరీటాలు అమర్చ బడ్డాయి; అందులోనూ బుద్ధప్రతిమ సౌందర్యభాసితంగావుంది. మిగిలినవన్నీ శిల్పకళాసమన్వితాలే.

గర్భాలయానికిరువైపుల ఎంతో శిల్పనైపుణిని పుణికి పుచ్చుకున్న స్తంభాలతో నిర్మితమైన ఆలయాలున్నాయి.

వారిద్దరూ ఆ కళాప్రపంచంనుండి వాస్తవప్రపంచంలోకి వచ్చారు. ప్రవేశద్వారందగ్గర నిలబడ్డారు. చుట్టూ అరణ్యాలు, కొండలు. గుహలక్రిందిభాగంలో గలగల ప్రవహించే వాఘిరా ధ్వనులు వినిపిస్తున్నయ్. దూరాన వాఘిరాగుప్తగుండాల మ్రోతలు అస్పష్టంగా విన్పిస్తున్నాయి.

* * * *

"అవునుగానీ, లక్ష్మదత్తు విశేషాలేవైనా చెప్పు" అన్నాడు పద్మదత్తు.

"ఆయన చాలా నీతిమంతుడు ఆచార్యా! ఒట్టి మొండి మనిషి. తరుచు భయపెడుతుంటాడు. పాపభీతి ఎక్కువ. పెద్ద

ఎప్పుడూ చెయ్యడు. శారీరకవాంఛలకు భయపడి, వివాహం చేసుకోవటమే మానివేశాడు. గొప్పచిత్రకారుడు. అద్భుతంగా చిత్రిస్తాడు.''

''అవును, వాడు చాలాగొప్పవాడు. చిన్నప్పటినుండి అంతే. ఎంతో జాగ్రత్తగలవాడని అందరూ అంటూండేవారు. మంచి శక్తిగలవాడు కూడా. ఏపనిచేసినా అద్భుతంగా చేస్తాడు''

ఉజ్జయినీ రాకుమారి వారిని వరించింది ఆచార్యా! కాని, ఆయన ఎంతో అసభ్యంగా ప్రవర్తించారని అంటారు. దానితో రాకుమార్తె పగపట్టింది. అదెలాంటిపగో నాకు తెలీదు. పగసాధించిందో లేదో కూడా తెలీదు. నే నక్కడ వున్నంతకాలం ఏమీజరుగలేదు అలాంటిది. అయితే, ఆయన అమ్మాయిల్ని చేస్చుకునేవారుకారు. వారి అష్టనియమాలు ఎంతో కఠినంగావుండేవి. కాని, పచ్చిబ్రాహ్మణుడు. బ్రాహ్మణ పక్షపాతం మెండు.

''అవునవును. తమ్ముడు బ్రాహ్మణపక్షపాతి. నేనో బౌద్ధుణ్ని. నాకు బౌద్ధపక్షపాతం ఎక్కువ. అందుకే నేనంటే వాడికి మంట.''

''మీరు మతంఎందువల్ల మార్చుకున్నారు ఆచార్యా?''

''నేను దాన్నిమార్చలేదు. అదే నన్నుమార్చింది. హఠాత్తుగా నాలో ఒకవిప్లవం చెలరేగింది. బౌద్ధమతం స్వీకరించి, యిక్కడికి వచ్చాను. అది ఒకరకమైన ఉద్రేకం. ఆనాటి నుంచే నిజమైనజీవితం జీవిస్తున్నాను. ఇక్కడ సుఖంగావుంది నాకు. ఏబాధలూ లేవు, ఏ వత్తిడీ లేదు. ఎవరితోను అంతగా అవసరం అగుపించదు.

"మీా ఈ మార్పు మీా కుటుంబంలో ఒక తుపానును లేపివుంటుందికదూ ఆచార్యా !"

"ఓ ! భయంకర ప్రళయాన్ని అది లేపింది. భయంకర ఘోష. నానమ్మకం ఒకరినమ్మకాలను మనమీాద బలవంతంగా రుద్దటం అన్యాయమని. ఎవరిఋష్టంమీాద వారు బ్రతగ్గలగాలి. నా ఆత్మ నాకు న్యాయాధికారి. ఇతరులు కాదు. తల్లి, తండ్రి, అన్న, తమ్ముడు, బంధువులు – వీరంతా మనకు చేయగలిగిం దేమిటి ? ఎవరితరణోపాయం వారే వెదుక్కోవాలి. ప్రపం చంలో నీ తరణోపాయంకొరకు నువ్వే దీక్షపూని కృషి చెయ్యాలి. అహోరాత్రులు అవసరమైతే నిద్రాహారాలు మానిఅయినా సరే."

అక్కడినుండి శిల్పశాలవేపు దారితీశారు. అదే విశ్వ కర్మగుహ. అక్కడ శిల్పాచార్యుడు నిర్మాణంమీాద ఉపన్య సిస్తున్నాడు. ఆచార్య పద్మదత్తులు చిత్రకళనుగురించి చెప్పే ఉపన్యాసాలధోరణిలోనే వున్నాయి అవికూడా. ఆ తర్వాత ఒకకొండదాటి రెండవవైపుకు వచ్చారు. అక్కడే వున్నది వాస్తుశాల. కొద్దిమంది విద్యార్థులే వున్నారు. భవన, నగర, చైత్యము ఇత్యాదుల నిర్మాణాన్నిగురించి నేర్చుకుంటున్నారు. ఆతర్వాత ఆయుర్వేదశాలప్రాంగణంలో ప్రవేశించారు.

అక్కడ ఉపదేశపాఠాలు జరగటంలేదు. బలిష్టుడు, ఆరోగ్యవంతుడు అయిన ఒకభిక్షువు వనమూలికలప్రభావాన్ని యతులకు తెలియజేస్తున్నాడు. కొందరు యతులు మూలికల రసాలు తీయటంలోను, చిన్న చిన్న మొక్కలను నూరటం లోను, కషాయాలు తయారుచేయుటలోను నిమగ్నులైవున్నారు.

మొత్తంమీద అది ఒక చిన్న విశ్వవిద్యాలయం అనిపిస్తోంది. చిన్న దే అయినా, అందంగా, ఆదర్శనంతంగా వుంది. అవన్నీ చూస్తున్నప్పుడు బదరీనారాయణహృదయం ఆశ్చర్యంతో సంతోషంతో పరవళ్లుతొక్కింది. విశ్వసౌభ్రాతృత్వసాధనకు అదొక్కటేమార్గం అనిపించింది. అంతకుమించినచోటు వేరొకటి-తాను తిరిగినంతలో అగుపించలేదు. ఈ జన్మ కిక యిక్కడే నుండి కదలకూడదనుకున్నాడు.

"వీరిలో ఒకణ్ణిగా సంతోషంగా చనిపోతాను. ఎన్నటికీ నేను దూరంకాను" అన్నాడు బదరీనారాయణ ఆచార్య పద్మదత్తుతో. "ఈప్రదేశం, ఈవాతావరణం నన్ను పులకితుణ్ని చేసింది." అనుకున్నాడు పదేపదే మనస్సులో.

* * * *

బదరీనారాయణ మొదట తనకు పరిచయమయిన యువకుణ్ని మరల కలుసుకున్నాడు. "నీవు ,చాలా మంచివాడివి. నాకు నువ్వంటే ఎంతోప్రేమ. .నన్ను నీస్నేహితుణ్నిగా అంగీరిస్తావా ?"అని అడిగాడు బదరీ.

"నా కేమీ అభ్యంతరంలేదు. అయినా యిక్కడ అందరం స్నేహితులమే. అందరిమధ్య స్నేహాలత లల్లుకుని వున్నాయి." "నిన్ను ఎలా పిలవాలో నాకర్థంకావటంలేదు." సందేహం వెలిబుచ్చాడు బదరీ.

"ప్రేమానంద్ నాపేరు. అలాగే పిలువు"

"నన్ను బదరీనారాయణ అంటారు. నువ్వు చాలకాలం నుండి ఇక్కడ వుంటున్నావనుకుంటాను?"

"అక్కడ ఎక్కువకాలంనుంచి కాదు. నాలుగుసంవత్సరాల నుంచే!"

"ఇంట్లోంచి పారిపోయి వచ్చావా?"

"లేదు. ఎందుకు పారిపోయిరావటం?"

"వీరందరూ ఎక్కడనుండి, ఏకారణంచేత వచ్చారో తెలుసా?"

ప్రేమానంద్ తటపటాయించాడు. కళ్లు విచిత్రంగా మెరిశాయి. అభినేతృత్వం అతనికళ్ళలో అప్పు డగుపించింది. చిలిపితనం ప్రస్ఫుటమైంది.

"తల్లి ఒడిలోంచివచ్చినవారే అందరూ!" అన్నాడు ప్రేమానంద్ సాలోచనగా.

అతని అమాయకతకు నవ్వుకున్నాడు బదరీనారాయణ. "ఎంత ఆశ్చర్యంగావుంది!" అన్నాడు

ప్రేమానంద్ నవ్వాడు. గొప్పగా, ఉజ్వలంగా నవ్వ గలిగినశక్తి అతనికుంది. అతనికళ్లు మెరసినయ్.

"ప్రతివాడు తల్లి ఒడిలోంచి రావలసిందేగదా" అన్నాడు ప్రేమానంద్ తన అమాయికప్రజ్ఞను ద్విగుణీకృతంచేస్తో.

బదరీ హృదయంవిప్పి చెప్పాడు. "నాగరికతకు, సభ్య సంస్కృతికి, సమాజానికి దూరంగా జీవిస్తున్న ఈ జనాన్ని ఈ నిర్జనస్థలంలో చూస్తుంటే నాకు ఆశ్చర్యంగావుంది."

"కానీ, నాగరికతాప్రపంచంలోని మనుష్యులకంటె మేము ఎక్కువ నాగరికత, సంస్కారం గలవాళ్ళం. దూరంగా ఏకాంతంగా వున్నా, మేము అప్పుడప్పుడు పల్లెలు, పట్టణాలు

దర్శిస్తాము. వాటితో మాకు ఎంతో అవసరం వుంటుంది.”
అన్నాడు ప్రేమానంద్.

“మీా రిక్కడ ఎల్లా బ్రతగ్గలరో నా కాశ్చర్యంగా వుంది” అన్నాడు.

“వాఘీరానదిలోంచి నీళ్ళు తెచ్చుకుంటాం. చుట్టు ప్రక్కలవూళ్ళనుండి ఆహారపదార్థాలు వస్తాయి. వాటితో కాలక్షేపంచేస్తాం.”

“ఎవరు పంపుతారు మీాకు?”

“మహారాజు. ఆయనే మా పోషకుడు. కాక, ఎందరో వ్యాపారస్తులు, ప్రయాణీకులు. దానబుద్ధిగలఎవరైనా సహాయం చేయటంద్వారా తరణోపాయం లభిస్తుందని ఆశిస్తారు.”

“అస లిక్క డెందుకుండాలి?”

“శుచిగా బ్రతకటంకోసం, ధ్యానంచేసుకోవటంకోసం, మనసా, వాచా, కర్మణా పవిత్రులం కావటంకోసం.”

“అలాంటిపవిత్రజీవితం అందరూ గడుపుతున్నారా?”

“గడపాలనేసంకల్పం మా అందరిదీని. కాని, ఒక్కొక్కసారి మానవసహజమైన బలహీనతలకు తలవొగ్గవలసివస్తోంది. మహాత్మునిలా ఎవరూ జీవించలేరు. అది ఒక్కభగవాన్ కేపీలుపడ్డది.”

“అయినప్పుడు ఈచిత్రరచన, శిల్పరచన ఎందుకు? ఈ వ్యాపకం అనవసరం గదా?”

“కేవలం కాలక్షేపంకోసం. మా ధ్యానం వాటిల్లో చిత్రితమవుతుంది. కళ నిర్మాణాత్మకధ్యానమనిగదా ఆచార్యుల భావన. ఆత్మచింతనలో కళకు ఒకభాగం వుంది. గోడలమీాద చిత్రించబడ్డ జాతకకథల్ని పరిశీలించావా?”

"జాతకకథలంటే ఏమిటోకూడా నాకు తెలియదు."

"అయితే నువ్వు బౌద్ధుడివికావన్నమాట. తెలియదని తప్పించుకోలేవు. తెలుసుకోటం ధర్మం.

"నువ్వు నేర్పగలవా?"

"నేనే ఎందుకు నేర్పాలి?

"నువ్వంటే నా కభిమానంగనక"

"నీ అభిమానానికి ధన్యవాదాలు. కానీ, ఎంతోమంది తెలివిగలవారు, నాకంటె ఎక్కువగా తెలిసినవారు వుండగా నన్ను చెప్పమనటం ధర్మంకాదు. ఆచార్య విజ్ఞానందుల్ని అడుగు, లేకపోతే దేవపాల్ అని ఓ మహాకవి వున్నాడు, ఆయన్నడుగు. వారంతా చాలా ఉత్తమంగా, ఉన్నతంగా బోధిస్తారు. అప్పుడే నీకు బోధిసత్వుని గంభీరముద్ర అర్థమవుతుంది."

"సరే; అయితే నువ్వువుండేది ఏ విహారంలో?"

"బౌద్ధవిహార్. నీవో?"

"ఇంకా ఎందులోను చేరలేదు. మీ విహారంలో వెయ్యమని, విజ్ఞానందుల నడుగుతా."

"నువ్వు నిజంగా న న్నభిమానిస్తున్నావా బదరీ?"

"అవును. ప్రాణంకంటె ఎక్కువగా"

"ఉన్నమాట ఉన్నట్లు చెబుతావ్. నీవంటే అందుకే నా కిష్టం. నాసలహా. విను ఆచార్య విజ్ఞానందులదగ్గరకు వెళ్ళకు. ప్రభుఘోష్ వున్నాడే, ఆయనదగ్గరకువెళ్లు. నీకోరిక నెరవేరుతుంది. సాధారణంగా యిక్కడ ఎవరూ అలా అడు

గరు. అయినా నువ్వు కొత్తవాడివి. ఆయన దయతలచ వచ్చు. అన్నట్లు నీ కేమైనా జ్యోతిషం వచ్చా ?”

“కొద్దిగా వచ్చు”

“అయితే అదృష్టవంతుడివే. ప్రభుఘోష్ జ్యోతిశ్శాస్త్రవేత్త. మహాపిచ్చి. ఎప్పుడూ గ్రహాలనుగురించి, నక్షత్రాలనుగురించి విసుగులేకుండా మాట్లాడుతుంటాడు. ఆయన జ్యోతిషప్రజ్ఞను కొనియాడావంటే నీకు ఏ సహాయింకావాలన్నా చేస్తాడు.”

“నీ సహాయానికి కృతజ్ఞుణ్ని. అమూల్యమైన సలహాయిచ్చావ్”అంటూ వెళ్ళిపోయాడు బదరీ.

* * * *

ఇక్కడ విశ్వసౌభ్రాత్రుత్వం వెల్లివిరుస్తోంది. అందరూ ఏకకుటుంబీకులవలె, అన్నదమ్ముల్లా మెలగటం విశ్వజనీనంగా, ఆదర్శప్రాయంగా వున్నది. నిత్యజీవితం ఒక మామూలు నడక. ఉదయంమొదలు సాయంత్రంవరకు ఉద్దీపకంగా జీవితం గడచిపోతుంది. సూర్యోదయాత్పూర్వమే నిద్రలేచి, వాఘేరాలో కాలకృత్యాదులు, స్నానాదులుఆచరించి, ప్రార్థనాలయమైన సంఘుచైత్యం చేసుకుంటారు. ప్రార్థనగీతాలతోను గానరఘురులతోను సంఘుచైత్యం పునీతమవుతుంది. హృదయానందాన్ని, నిర్మలశాంతిని కలిగించి, ఆ ప్రార్థనలు మానవుణ్ణి మహోన్నతునిచేస్తాయి. కలుషితజీవితాలకు శాంతిని ప్రసాదిస్తాయి. ప్రతిరోజు వారిప్రార్థనలు ముక్తకంఠంతో ఆలపించే శాంతివచనంతో ముగుస్తుంది. అదే బుద్ధం శరణం గచ్ఛామి; ధర్మం శరణం గచ్ఛామి; సంఘుం శరణం గచ్ఛామి.

తరువాత సుష్టుగా భోజనంచేసి, తమతమ శ్రేణులకు చెందిన ఉపన్యాసపాఠాలు వినటానికి వెళ్లుతారు. చిత్రకళలో ఉత్సాహమున్నవారు చిత్రశాలకు, శిల్పకళ నభ్యసించువారు శిల్పశాలకు, నిర్మాణశాఖకు చెందినవారు వాస్తుశాలకు, వైద్యమభ్యసించువారు ఆయుర్వేదశాలకు వెళ్లుతారు. ఈ పాఠశాలలన్నీ వాఘూరానదియొడ్డునో, లేక చెట్లనీడనో, కొండనీడల్లోనో జరుగుతాయి. ఆ లీలామానుషుని అదృశ్యరూపము నూహించుకొంటూ అనేకమంది ధ్యానమగ్నులవుతారు. కొందరు బుద్ధునిజీవితాన్ని గూర్చి, బోధనలగూర్చి తాత్త్విక వాగ్వివాదాలు జరుపుతారు. లేదా బౌద్ధసిద్ధాంతాలమీద వెలువడిన విమర్శలపై ప్రతివిమర్శలు చేస్తుంటారు.

కొందరప్పుడప్పుడు అరణ్యాలకు వెళ్ళి, పుష్పజాతులను సేకరించుకునివస్తుంటారు. వారు ఆకులలములను, చెట్లను, మొక్కలనుగూర్చి విచారించేవారు. కొందరు చుట్టుపట్లనున్న గ్రామాలకు వెళ్ళి, తత్వబోధచేస్తుండేవారు. కొందరు పట్టణాలకు వెళ్లేవారు. వెళ్ళినవారు తిరిగివచ్చేవారుకారు. కొందరు మాత్రమే వర్షాకాలంలో తిరిగివచ్చేవారు. అపరాహ్ణవేళకు అందరు తమపనుల్లో నిమగ్నమయ్యేవారు. శిల్పులు కొండరాళ్లను పరిశోధిస్తో, ఏవైనాలోపాలున్నాయేమో పరీక్షిస్తుండేవారు. చిత్రకారులు బుద్ధునిలీలలను చిత్రిస్తో, జాతకకథలను, విహరించే గంధర్వులను చిత్రించటంలో నిమగ్నులయ్యేవారు. శిల్పి తన ఉలి, సుత్తె ఎంతో నేర్పుగా ఉపయోగించి విగ్రహాలను తీర్చిదిద్దేవారు. అందరూ వారివారి పనుల్లో నిమగ్నులైనపుడు భౌతికప్రపంచాన్ని పూర్తిగా మరచిపోయేవారు. ఆకల

యినప్పుడు, అలసిపోయినప్పుడు మాత్రం ఆనందవిహారానికి వెళ్లి, భోజనం చేసేవారు. ఆకలిలేనివారు కాస్సేపు విశ్రాంతి తీసుకుని, తిరిగి పనిలో నిమగ్నులయ్యేవారు. ఉలిదెబ్బలకు, సుత్తిదెబ్బలకు కొండగుహాలలోనుండి వింతధ్వనులుత్పన్న మౌతూ, ఆనందాన్ని కలిగిస్తుండేవి.

ప్రతివ్యక్తికి తనపనితప్ప ఇతర బాధ్యతలు లేవు. ఎవరి ధ్యానంలోవారు నిమగ్నులై వుంటారు.

సాయంత్రానికి కర్మశాలపని ఆపివేసేవారు. ఎక్కడి పనులక్కడ ఆగిపొయ్యేవి. సన్యాసులు, యతులు విహారాల నుండి, చైత్యాలనుండి బయటకొచ్చేవారు. వాఘీరావొడ్డున విశ్రాంతికి వాహ్యాళి వెళ్ళేవారు. అలసిపోయిన శరీరాన్ని నదీ జలాల్లో శుభ్రం చేసుకుంటూ, కులాసాకబుర్లాడుకునేవారు. అప్పటి వారి ఆనందానికి హద్దుల్లేవు. ఒకరిసమక్షంలో ఒకరు తమ కష్టాలు మరచిపోయి, ఏదో కళాసృష్టిచేసి, జీవితాలు ధన్యంచేసుకున్నవారికుండేతృప్తి అగుపించేది వారికళ్లల్లో.

సాయంత్రం అందరూ ఆనందవిహారకు వెళ్ళి, పంక్తులుగా కూర్చుని, విందారగించేవారు. అక్కడే ఆనాటి పనులను గురించి తర్కించుకునేవారు. ఎవరెవరేపనులు చేసింది, వాటి లోపాలోపాలు ఉదారబుద్ధితో విమర్శించుకునేవారు. వారి వాదాల్లో స్వార్థం అగుపించదు. ఏఒకరిచిత్రంగానీ, శిల్పంగానీ కళాహీనమైనప్పుడు మిగిలినవారు దాన్ని సరిదిద్దేవారు. అజంతాకళాఖండాలు ఏ ఒక్కరికృషీ కాదు. వ్యక్తిగతంగా ఎవరూ గర్వపడరు. అది వారి సమిష్టికృషి. అందరూకలిసి ఉమ్మడిగా నిర్మించుకున్న మరో ప్రపంచం అది. ఆ ప్రపంచ

నిర్మాణంలో అందరూ భాగస్వాములే. అందరూ నిస్వార్థ జీవులే. అందులో ఎవరూ 'ఈ కళాఖండం నాది; ఇది నేను నిర్మించింది. ఇది నేను చిత్రించినచిత్రం' అని భావించరు. అలా భావించేతలంపే వారికిలేదు. అది విశ్వసోదరప్రేమ. అక్కడ తరతమభేదాలకు అవకాశం లేదు. అందుకే వారంతా సంపూర్ణ సంతుష్టులు.

రాత్రిభోజనానంతరం తిరిగి అందరూ సంఘుచైత్యం దర్శిస్తారు. తిరిగి ప్రార్థనాదికములు జరుపుతారు. ప్రార్థన గీతాలు, భక్తి ప్రబోధకగీతాలు పాడుకుంటారు. అలా నిత్యం ఉదయం, సాయంత్రం జరుగవలసిన దే. ఆ అరణ్యప్రాంతా ల్లోని నిశ్శబ్దవాయువుల్ని ఆ ప్రార్థనగీతాలు పునీతం చేస్తాయి. అదే అక్కడి సంధ్యాశోభ. గుంపులు గుంపులుగాచేరి కాల క్షేపంచేసేవారు. ఒక్కొక్కసారి ఆచార్య విజ్ఞానందులు వారికి జాతకకథలను, వాటి ప్రత్యేకతలునుగూర్చి బోధించేవారు. ఒక్కొక్కసారి ఆచార్యులు జీవితవిలువలనుగురించి, నిర్వాణాన్ని గురించి, బుద్ధునిగురించి సుబోధక శైలిలో, ఉపన్యాసధోర ణిలో, పీలుమార్గాన్ని చూపుతూ ఉపన్యసించేవారు. తర్వాత యతులందరూ తమతమగుహాలకుచేరి, భగవధ్యానంలో నిమ గ్నులయ్యేవారు.

ప్రొద్దుపోతున్నకొద్దీ గుహాలలో దీపాలు వెలుగుతగ్గేవి. కటికిరాళ్లమీదనే నిద్రపోయేవారు. పగలంతా శ్రమచేసి వుండటంవల్ల, సొమ్మసిలి నిద్రించేవారు. ప్రకృతియావత్తూ అలసిసొలసి నిద్రిస్తోందా అనిపిస్తుంది. కొండలు, అరణ్యాలు సైతం నిద్రించేవి. దూరాన అడవిజంతువులఅరవులు అప్పు

ఎప్పుడు వినిపించినా, అవీ నిశ్శబ్దంలో విలీనమైపోయేవి. ఆప్రాంతాలలోని ప్రతిజీవి-వన్యమృగాలు సైతం బౌద్ధప్రభావానికి తలవొగ్గినట్టు అనిపిస్తుంది. అది శాంతినిలయం. ప్రకృతిమాత ఒడిలో ప్రపంచమే నిద్రిస్తోందా అనిపించే ప్రశాంతి అప్పుడక్కడ.

కాలక్రమేణ బదరీనారాయణ, ప్రేమానందుడు ఆప్తమిత్రులైనారు. ఎన్నటికీ, ఎవరూ, దేనివల్లా విడదీయలేని బంధం యిద్దరిమధ్య అల్లుకుని, పెనవేసుకుపోయింది. ఎక్కడికి వెళ్ళినా, ఏపనిచేసినా యిద్దరూకలిసి చేసేవారు. ఒకరు ప్రాకారాదులపై చిత్రిస్తే, మరొకరు కప్పుల నలంకరించేవారు. ఇద్దరూ కలసి కొండదిగివెళ్ళి, ఎర్రమట్టిని తీసుకొచ్చేవారు. రంగురంగు రాళ్ళు, కంకర తెచ్చి, నూరి, ఆ చూర్ణం వివిధలేపనాలతో మిశ్రమంచేసి, రంగులుతయారుచేసేవారు. అప్పుడప్పుడు ఇద్దరూ కలిసి దగ్గరవూళ్ళకెళ్ళి, కుంకుమ, పసుపు యిత్యాదులు సమకూర్చుకువచ్చేవారు. రాత్రి నిద్రపోయేముందు కళ, మతం యిత్యాదివిషయాలనుగురించి చర్చించి, ఆ ఆలోచనలతోనే నిద్రపోయేవారు.

ప్రేమానంద్ ఒకసారి బదరీని అడిగాడు లాలనగా – "ఎప్పుడైనా ఏదైనా సంభవిస్తే, నీవిక్కణ్ణుంచి వెళ్ళిపోతావా?" అని.

"ఎక్కడికి పోతాను?"

"ప్రపంచం ఎంతో విశాలమైంది. ఎల్లకాలం యిక్కడే వుండాలనేనియమం ఏముంది? పరిస్థితులు ప్రతికూలంకావచ్చు. అయినా, ఇలాంటికళాతీర్థాలు యింకెన్నో వున్నాయి మన

దేశంలో. ఖజురాహో, కొనార్క్, భాగ్, ఎల్లోరా వున్నాయిగా. దక్షిణాపథంలోని మధురకూడా ఓ కళాక్షేత్రం అంటారు. అక్కడ వివిధకళలకు నిలయమని వినికిడి.”

“నే వెళ్ళాలనేనా నీఉద్దేశ్యం?”

“కాదు. ఎప్పుడైనా అలాంటిపరిస్థితి ఏర్పడితేసంగతి. ఏర్పడకూడదనే నా వాంఛ”

“అలాంటిపరిస్థితులు లేర్పడుతాయనుకోను. ఎక్కడా నా కానందం లభించదు. ఈ ఒక్క అజంతా నా రక్తంలో రక్తంగా కలిసిపోయింది. ఇక్కడనుంచి పోయి, మరోచోట బ్రతకలేను. ఈ కొండ, ఈ అరణ్యాలు, ఈ జలజలప్రవహించే నదీ–ఇవన్నీ లేకపోతే నాకు జీవితమేలేదు. ఇవిలేనిజీవితం జీవించటంకన్న మరణమే మేలు. నాజీవితంకన్న మిన్నగా ఈ పరిసరాలను ప్రేమిస్తున్నాను. అంతగా మరణమాసన్నమైతే, రానీ, ఇక్కడే కళ్ళుమూస్తాను. ఇక్కడే వుండి, ఎందుకు చనిపోగూడదు? కాశీకివెళ్ళి గంగలోమునిగి చనిపోవటంకన్న యిక్కడే ఈ కళాక్షేత్రంలో నిర్యాణంచెందటం నాకు సంతృప్తి. ఇక్కడ తరించటం సుఖదాయకం.”

ప్రేమానంద్‌కి నవ్వొచ్చింది. “మృత్యువు, నిర్యాణం అని చాలా పెద్దమాటలు ఉపయోగిస్తున్నావ్. నిర్యాణం అంటే నీకు భయంలేదా బదరీ? నీకు నిర్యాణంఅంటే ఏం తెలుసు? నువ్వెప్పుడూ ఆచార్య విజ్ఞానసంధునిపాఠాలు వినటానికి రావు. వచ్చినా వినవు. ఏదో పరధ్యానంగా వుంటావు, ఎటో చూస్తుంటావ్; ఏదో ఆలోచిస్తుంటావ్. ఎందుకల్లా

మనస్సును పరిపరివిధాల ఆలోచించనిస్తావ్? అసలు నువ్వు దేన్నిగురించి అలా ఆలోచించటం?"

"ఈ మతాలు నన్ను పిచ్చివాణ్ణిగా చేస్తున్నాయి ప్రేమానంద్. బ్రాహ్మణం, బౌద్ధం, జైనం – ఈ మతాలన్నీ ఎందుకు? అస లిన్నిమతా లెందుకుండాలి? మానవజాతి ఒక్కటేఅయినప్పుడు ఇన్నిమతాల అవసరం ఏమిటి? సిద్ధాంతాలు వల్లించే ఆచార్యులు ప్రేమ, సత్యం యివే ముఖ్యమని చెపుతారుగదా. అలాంటప్పుడు ఒకరు మరొకరిజీవనపంథాకు అడ్డుతగిలి, వాళ్ళమనసుల్ని మార్చి ఎందుకు బాధపెట్టాలి? వారినమ్మకాలతో వారి నెందుకుబ్రదుకనీయరు? ఇవన్నీ నాకు అర్థంకానిసమస్యలు ప్రేమ్! వీటినిగురించే బుర్రబద్దలయ్యేట్లు ఆలోచిస్తుంటాను."

"నువ్వు చాలా బాధపడుతున్నట్లున్నావ్ బదరీ. నీ గతజీవితంలో ఎంతో బాధపడ్డావనిపిస్తుంది. అంతమాత్రాన నిరాశ దేనికి? ఏ ఆచార్యుడు మతాన్ని ప్రబోధించడు. వాళ్ళు ఎప్పుడూ సత్యాన్నిగురించే చెబుతారు. దాని ఆధారంతో ప్రజలే మతాలను సృష్టించుకుంటారు."

"నీ మతాన్ని గురించి ఒక్కసారి ఆలోచించుకో. దాన్ని ఏపేరుతో పిలిచినా నాకేం అభ్యంతరంలేదు. అది ఆశయాలపుట్ట. నిబంధనలతో నిండివుంది. అందుచే వ్యక్తి అసహాయుడు, అస్వతంత్రుడు అవుతున్నాడు. ఎందువల్లనంటే సిద్ధాంతాలకు వ్యతిరేకంగా ప్రవర్తించటం దోషం, పాపం అవుతుంది గనుక. అసలు సృష్టిలో మంచి, చెడ్డ అనే భేదం ఏమిటి? కార్యకారణాలుతప్ప మంచిచెడ్డలవిచక్షణ అనవసరం

నిర్వాణాన్ని అపేక్షించటం, దానికోసం పడే ఈ తంటాలు అన్నీ అర్థరహితాలు. ఈ నిర్వాణచింతన పనీపాటాలేని సోమరిపోతుల కలుషహృదయాలనే బాధిస్తుంది. జీవితంనుండి ఎవరు విశ్రమించదలుస్తారు? నాకుమాత్రం నేను కాదు."

"నిర్వాణమనేది స్వాప్నికావస్థ కాదు బదరీ! శాశ్వత విశ్రాంతి పొందటం అసామాన్యమూ కాదు. ఆత్మస్థులు. స్వార్థం విడనాడగలగటమే పరమాశయం. నిర్వాణం అనేది శాంతి సాధనం. కష్టభూయిష్ఠమైన జీవితానికి విశ్రాంతినివ్వటమే నిర్వాణమంటే. అది కేవలం భావన-సర్వసంపన్నమైనభావన. ఉన్నతము, ఉదాత్తము అయిన చింతన. నీ ఆలోచనలే నీ కర్మలకు నాంది. నిర్మాణాత్మకమైన కృషిచేయటమే నీ ఆలోచనాపరంపరలకు పుష్టినివ్వటం అవుతుంది. ఉదాహరణకు, మనం చిత్రించిన చిత్రాలే చూడు; మనశిల్పాలనే తిలకించు. మనం అవన్నీ ఎందుకు తయారుచేశాం? అది మనలో నిబిడీకృతమైన తృష్ణ. ఆ కళాతృష్ణ మనం సుందర చిత్ర, శిల్పాలను రచించటానికి ప్రోద్బలంచేసింది. నిర్వాణమంటే వేరుగాదు. మనకు కలిగిన ఆ భావనను, మనలోని ఆ తృష్ణనే నిర్వాణమంటాం. అదే మన తృప్తి. అదే మన బంధవిముక్తి."

ప్రేమానంద్ వాగ్ధోరణికి, జ్ఞానశక్తికి బదరీ ముగ్ధుడైపోయాడు. ఒక్కొక్కసారి విరగబడి నవ్వేవాడు. "నీవు చాలా లోతుగా ఆలోచిస్తావ్ ప్రేమ్. చాలా సునిశితంగా మాట్లాడగలవు. అదీ నీ వయస్సునేర్పిన చాతుర్యం."

"అవును, నీ కిప్పుడు నవ్వుగానేవుంటుంది బదరీ. ఒక నాటికి నువ్వూ నాలాగే మారుతావు. బుద్ధునిప్రబోధాలు

నీహృదయాన్ని రంజింపచేసినప్పుడు నువ్వు నావంటివాడవే అన్నానా; ఏమీ తొందరపడకు."

ఆశయాలు వేరుకావు. ఇద్దరి ఆశలు వేరుకావు. అయితే, యిద్దరూ స్నేహితులు. స్నేహవాత్సల్యం యిద్దరినీ తీవ్రవాదోపవాదాలకు పురికొల్పేది. అంతమాత్రాన వారు కోల్పోయేదేమీలేదు, స్నేహ, వాత్సల్యాలు యినుమడించటం మినహా? గిలకోళ్ళు కూస్తున్నయ్. మిణుగురుపురుగుల వెలుగు కన్పిస్తోంది. ఇద్దరూ నిద్రకుపక్రమించారు. బదరీ సంతోషంలో మున్కలు వేస్తూ నిద్రపోయాడు.

* * *

బదరీనారాయణ అలసిపోయి, చిత్రరచనచేయ లేనప్పుడు, మనస్సు ఆలోచించటానికి ఎదురుతిరిగినప్పుడు వాఘీరా నొడ్డున ఏకాంతంగా కూర్చుని విచారించేవాడు. జీవితానికి సంతృప్తి అనేది కలుగుతోంది కాని, పూర్తిగా సంతోషం కలగటంలేదు. అప్పుడప్పుడు తనలో రేగే ఈ తుఫానుకు కారణం తెలుసుకోలేకుండావున్నాడు. ఏదో ఆవేదన, బాధ, చిరాకు వెన్నాడుతున్నై.

ప్రేమానంద్ కాక మరికొందరి స్నేహంకూడా లభించింది కాలక్రమేణా. వారిని తరచు కలియకపోయినా, కలుసుకున్నప్పుడుమాత్రం ఆత్మీయంగా హృదయమిచ్చి మాట్లాడేవాడు. ఈ కొత్తస్నేహితులలో గోపీకుమార్ అనే వైద్యభిక్షువు, దేవపాల్ అనే కవి, నాగోజీఅనే శిల్పి, జ్యోతిష్కుడైన ప్రభుఘోష్ ముఖ్యులు. అది ఒక విచిత్రమిత్రమండలి. చిత్రాతిచిత్రమైన విభిన్నరుచులుగలవ్యక్తులు వాళ్ళు. వారిసాహచర్యం

వల్ల, వారి అనుభవాలనుగురించి తెలుసుకోవటంవల్ల జీవితపు లోతుల్ని యింకా ఎక్కువగా అర్థంచేసుకోగలుగుతున్నాడు బదరీ.

అందరిలోకి గోపీకుమార్ అంటే బదరీకి ఎక్కువ యిష్టం. అవకాశం లభించినప్పుడు యిద్దరూకలిసి కొండకోనలకు, అరణ్యగర్భాల్లోకి మూలికలకోసం వెడుతూండేవారు. గోపీ పొడుగ్గా, బలంగా వుంటాడు. నలభై ఏళ్ళుండవచ్చు. గిరజాలజుట్టు. మెలికలు తిరిగి, వుంగరాలుచుట్టుకున్న జుట్టు భుజం మీద పడి, ముద్దొస్తూంటుంది. ఎప్పుడూ మిగతవారిలాగా ముడివేయడు. రంగుదుస్తులు వేసుకోడు. జింకచర్మమో, పులిచర్మమో కట్టుకుని, వేటగానిలా అవుపిస్తాడు. కలలుకనే అతనికళ్ళు, విశాలవక్షం, దట్టంగావున్న ముదురుమీసం, అక్కడక్కడ అగుపించే పలితకేశాలు అతనిసౌందర్యపోషకత్వానికి ఋజువులు. అయినా, అతను మంచి నిష్ఠాపరుడు. ఆచార్య శ్రేణిలోనివాడు. ఆయుర్వేదశాల అతనిఆధీనంలోనేవుంటుంది. ఆ శాఖవిద్యార్థులకు అతను గురువు.

ఒకరోజు అపరాహ్ణసమయంలో బదరీ ఏమీ తోచక అటుయిటు పచారుచేస్తున్నాడు. గోపీ వెనకగా వచ్చి అన్నాడు "ఏంచేస్తున్నా విక్కడ ?"

"ఏంలేదు. వూరికే పచారుచేస్తున్నాను. ఏం, ఎక్కడికైనా వెళుతున్నారా ?"

"అజంతాగ్రామం వెళ్దామని అనుకుంటున్నాను. వెళ్లవలసినపనికూడా వుంది. కొన్ని నూనెలు కావాలి. ఏం, నువ్వూ వస్తావా ?

బదరీ బయల్దేరాడు. వాకిలిదాటి యిద్దరూ గ్రామంకేసి నడకసాగించారు.

"దేన్ని గురించి ఆలోచిస్తున్నావ్?" అనడిగాడు గోపీ.

"ఏంలేదు. అయోమయంగావుంది మనస్సు. ఏమీ ఆలోచనపాలుపోవటంలేదు. ఎంతో ప్రయత్నిస్తానుకాని, ఒక్కసారి ఆలోచనలతో బుర్ర బద్దలవుతుంది. చిరాకుపుట్టుకొస్తుంది. చివరకు వెధవతనంగా తయారవుతాను" అన్నాడు,

"ఎప్పుడైనా ఏదైనా నేరంచేశావా?"

"లేదు గోపీ. ఎప్పుడైనా చేసివుంటే, నాకు నేనే చేసుకుని వుంటాను. నా ఆత్మకు నేనే ద్రోహంచేశాను. అదే నే చేసిననేరం"

"ఏంనేరం అది?"

"చిత్రించవలసినప్పుడు ఆడవాళ్ళ వెంటపడటం"

గోపీకుమార్‌కు నవ్వొచ్చింది. నిండుగా నవ్వాడు. నవ్వి అన్నాడు.

"నీకూ ప్రభుఘోష్‌కీ తేడాలేదు. అతనూ అంతే. ఆడవాళ్ళకళ్ళల్లో నక్షత్రాలమెరుపు చూస్తుంటాడు. ఆకాశంలోని నక్షత్రాలవెలుగుకన్న వాళ్ళకళ్ళల్లో అగుపించే నక్షత్రాల కాంతి ఎక్కువ ప్రకాశవంతంగా అగుపిస్తుంది అతనికి. తనను తానే మర్చిపోయేంతటి పిచ్చివాడవుతాడు అప్పుడప్పుడు. నువ్వుకూడా అంతేనా?"

"అంతే. కనుకనే నే నిప్పుడు యిక్కడున్నాను"

"నిజంగా నువ్వేం చేశావు చెప్పు?"

"ఏం, వినాలని అంత కుతూహలంగా వుందా?"

"చెప్పు. చెప్పు – ఎందుకుండటం. ఎవరికైనా అభిలాషే అలాంటివిషయాలంటే" అన్నాడు గోపీ.

బదరీ చెప్పనారంభించాడు "మా నాన్న మంచి వైద్యుడు. బాగా పేరుప్రతిష్టలు సంపాదించాడు. దాంతో డబ్బుకూడా సంపాదించాడు. ఆయనకు నేను ఏకైకపుత్రుణ్ని. నాకు ఊహ తెలిసినప్పటినుండి ఆయనకూ నాకూ పడేదికాదు. ఆయనయిష్టాలకు వ్యతిరేకంగా ప్రవర్తించేవాణ్ణి. ఆయన్ని ఎప్పుడూ ఎదిరించేవాణ్ణి. అయినా ఆయన నన్ను ప్రేమగా, గారాబంగానే చూచేవారు. ఎటుదిరిగీ ఆశయాలే భేదించేవి."

"ఎలా ?" అన్నాడు గోపీ.

"ఆయన నే నొక భిషక్ రత్నం కావాలని ఆశించారు. తనలాగే కీర్తి, డబ్బు ఆర్జించగలనని వూహించారు. ఆయనే నాకు సుశ్రుతం, చరకం బోధించారు. కాని, నాకు చిరాకు పుట్టింది. నే నొక గొప్పచిత్రకారుణ్ని కావాలనుకున్నాను. శిల్పిని కావాలనుకున్నాను. నా అభిప్రాయం నాన్నతో చెప్పాను. కాని, ఆయనపట్టుదలే ఆయనది. కొడుకుల్ని తీర్చిదిద్దేది తలిదండ్రులట. వీరిభవిష్యత్తు వారిచేతుల్లోనే వుందట. అని చెప్పి తనఅడుగుజాడల్లో నడవవలసిందిగా ఆజ్ఞాపించారు. నే చెప్పాను, ఈ మందుమాకులుతయారుచేయటం నాడి పరీక్షించటం నావల్లకాదని. అంతకన్న మరణం మేలన్నాను.

'కాకుంటే కాలక్షేపంకోసం చిత్రరచనచెయ్యి; కాని, దాన్నినమ్ముకొని బ్రతుకు తెరువు ఆసించవద్దు. అందులో గొప్పేమీ లేదు. నీలో ఎంతో ప్రజ్ఞవుండాలి. లేకుంటేనీముఖం ఎవరూ చూడరు' అన్నాడు.

'నాకా ప్రజ్ఞవుంది. ఏదైనా మంచి కళాశాలకు వెళ్ళి, యింకా నేర్చుకుని, నా కళకు వన్నెలుదిద్దుకుంటా' నన్నాను.

"నాకేం అర్థంకాకుండావుంది నీకు చిత్రకళంటే వెర్రిలావుంది. వైద్యంలో లేనిగొప్పతనం కళలో ఏముంది?" అన్నారు.

నే నన్నాను—

"మీకు శరీరంఅంటే ఎముకలు, రక్తమాంసాదులే. మీ ఈ శరీరం రోగభూయిష్ఠమైంది ఆ రోగాలనుండి తాత్కాలికంగా జీవిని విముక్తున్ని చేసి, మరికొంతకాలం జీవించేలాచేస్తారు. కాని, నాకు అలాకాదు. దేహం ఒక దేవాలయం. అందులో ఆత్మ జ్యోతివంటిది. కళలో ఆ భావం ఏర్పడుతుంది. ఆ అనంతానందమే భగవంతునిదర్శించటానికి దోహదంచేస్తుంది. అదే మతం అంటారు. కళానుభూతి దేహం, ఆత్మ రెంటినీ పునీతం చేస్తుంది. వ్యాధిగ్రస్థమైనమనస్సుకు సేవచేస్తుంది. అది ఒక దివ్యానుభూతిని ప్రసాదిస్తుంది. నేను చిత్రరచనచేస్తున్నప్పుడల్లా ఆత్మజ్యోతిని దర్శిస్తాను. ఏదో ఆనందలోకాల్లో విహరిస్తున్నట్లు సంతోషంకలుగుతుంది." అన్నాను.

"నీ సిద్ధాంతం నాకు నచ్చలేదు" అన్నాడు. "నీ కంత కళాభిమానం వుంటే, వెళ్ళి నీయిష్టంవచ్చినచోట వుండు. అలాగే నేర్చుకో. అప్పుడు నువ్వు నాకొడుకువి కాదు. అలా నిన్ను పిలవనుకూడాను" అన్నారు నాన్న.

"తల్లి ఎంతబ్రతిమలాడినా వినకుండా వచ్చేశాను. యిల్లువదలి, అలా యింటినుండి పారిపోతానని ఎన్నడూ అనుకోలేదు. కలలోగూడా అనుకోలేదు. అక్కడ సర్వభోగాలు

వున్నాయి. ప్రేమ, ఆనందం వున్నాయి. అయితే మనిషి ఒక ఆశయంకోసం వీటన్నిటినీ త్యజించాలనీ నాకు తెలుసు. తన మార్గాన ఎన్ని అవరోధాలుఏర్పడ్డా సుగమం చేసుకోవాలి. ఆశయసాఫల్యం పొందాలి. అందుకే ఉజ్జయినికి బయల్దేరాను."

"అయితే, నీవు ఉజ్జయినీవిశ్వవిద్యాలయంలో చదివావన్నమాట ?" అని అడిగాడు గోపి.

"అవును. కొద్దిగా డబ్బుతీసుకుని పారిపోయాను. అది సరిపోతుందనుకున్నాను. నాకు విద్యాలయంలో ప్రవేశం లభించింది. అయిదుసంవత్సరా లున్నాను. అక్కడ నేర్చుకోవలసిందంతా నేర్చుకున్నాను. ఎంత ప్రతిభావంతుణ్ణయానంటే, ప్రభువు తన అంతఃపురాల్లో చిత్రరచనకోసం నన్ను ఆహ్వానించేటంతవాణ్ణయాను. విద్యాలయాధికారులు అందుకు సమ్మతించారు. అయితే ఏం, అనుకున్నట్లు ఏదీ జరగదుగదా!"

"ఏంజరిగిందేమిటి ?"

"అంతఃపురంయావత్తు సౌందర్యరాసులమయం. మొదట ఆశ్చర్యంతో చూశాను. తర్వాత వారి సాహచర్యంలో ఆనందం అనుభవించాను. తర్వాత అలవాటైపోయింది. ఆ అలవాటు ఎలాపరిణమించిదంటే, స్త్రీ కనిపించకపోతే బ్రతకలేనేమో అనిపించేస్థితికి వచ్చాను. వాళ్లే నాకు త్రాగుడు, జూదం అలవాటుచేశారు. వాళ్ళు నాతోతిరిగేవారు. నా కళను గౌరవించేవారు, ఆదరించేవారు. కానీ, నాజీవితం నైతికంగా పతనమైంది. దురలవాట్లకు లోనైనాను. జీవితమాధుర్యాన్ని తనివితీర ఆస్వాదించాను. నా జీవితమధుపాత్ర నిండి, పొంగ

పార్లిపోయింది. పగిలి ముక్కముక్కలైంది. అందుకే ఒకరోజున హఠాత్తుగా మాయమైనాను"

"ఎక్కడికి వెళ్ళావు?"

"తెలీదు ఎక్కడకు వెళ్ళానో. ఎక్కడికీ వెళ్ళలేదు. తిరిగాను. తిరుగుతూన్నాను. తిరగని చోటు లేదు. చెయ్యనిపని లేదు. అక్కడో మట్టిబొమ్మ, ఇక్కడో రాతిబొమ్మ, చిన్న చిన్న దేవాలయాలకు మంటపాలు నిర్మించాను. కాని, శాశ్వతమైన అసంతృప్తి నన్ను వెన్నాడింది. నైచ్యమైనజీవితానికి తిలోదకాలిచ్చానే కాని, పూర్తిగా మరచిపోలేకపోయాను. గతంలో లాగానే బ్రతికాను. అయితే యిప్పుడు కాను. ఇప్పుడో ఏకో ధ్యానమగ్నుణ్ణి. ఇదైనా ఎక్కువే నాకు. ఒకరోజున అనిపించింది – అరణ్యాలలోకి వెళ్ళి, జీవిత శేషాన్ని ఏకాంతంగా గడపాలని. అయితే, నేను సన్యాసిని కాదలచలేదు. కేవలం జీవితాన్ని మార్చుకోదలచాను. ప్రపంచంలో ఏకాంతంగా బ్రతకదలచాను కొంతకాలం. తర్వాత తిరిగి నాగరికతత్వానికిసలండేనగరాలకు పెద్దపట్టణాలకు వెళ్ళి కళాసేవకు జీవితం అంకితం చేయాలని తలచాను. అక్కడక్కడ తిరిగాను. తిరుగని ప్రదేశం లేదేమోనన్నానుగా..."

"ఎవరినైనా బలవంతం చేశావా?" అనడిగాడు గోప్తి.

"లేదు. సౌందర్యవతులైన యువతులు వారంతటవారే వచ్చి, అర్థించేవారు. కాదనలేకపోయేవాణ్ణి. అది వాళ్ళ కామతృష్ణ."

"ఎవర్నీ ఎప్పుడూ బలవంతం జేసి, సుఖించకు బదర్! అది మహాఘోరం."

బదరీ సుందహాసంచేశాడు.

"ఇప్పుడు వాళ్ళతో నాకు సంబంధంలేదుగా. ఎవరి జోక్యమూ లేదుకూడాను. అలాంటిస్థితి ఏర్పడదు. ఆ పాపం నుండీ దూరమయ్యాను. ఇప్పుడు ప్రశాంతంగా, ఉద్రేకాలకు దూరంగా బ్రతికనేర్చుకున్నాను."

"అలా అనకు. నీ పరధ్యానమే చెబుతోంది నీలో యింకా స్త్రీవాంఛ తగ్గలేదని. ఆడదానిఅవసరం నువ్వు కోరుకున్నావు. నాకు తెలుసు, కాదనకు. ఒకస్త్రీని మనసారా ప్రేమించినపుడే జీవితానికి పూర్ణత్వంవుంటుంది. ఎప్పుడైనా ప్రేమించావా?"

"చెప్పానుగదూ అనేకమందిని ప్రేమించానని"

"అది ప్రేమకాదు పిచ్చివాడా! కామం. అనేకమందిని కామించావుగానీ, ప్రేమించలేదు. ఎప్పుడూ ప్రేమించగలిగేది ఒక్కర్నే, మరచిపోకు. అదే ప్రేమరహస్యం."

"ఆ లెక్కలో ఎవరినీ ప్రేమించలేదు."

గ్రామం చేరేంతవరకు ఎవరూ పలకలేదు. శాంతంగా, గంభీరంగా నిమిషాలు, క్షణాలు దొర్లిపోయినవి.

ఒక అంగడిలో కొబ్బరినూనె తీసుకుని యిద్దరూ బయల్దేరారు మరొకత్రోవను. తిరిగివచ్చేదోవలో ప్రేమానంద్ అగుపించాడు.

"ఎక్కడికెళ్ళావ్ బదరీ? నీకోసం చాలసేపు వెదికాను. ఎక్కడా కనిపించందే!" ప్రేమానంద్ ప్రశ్నించాడు.

"నూనెకోసం వెళ్ళాం. నువ్వెక్కడికి వెళుతున్నావ్ ఇప్పుడు?"

"కొన్ని పండ్లు కావాలి. మీరూ వస్తారా ?"

గోపీకుమార్ అభ్యంతరం చెప్పాడు "లేదు. నీవు వెళ్ళు, నాకు చాలాపనుంది విహారంవద్దు"

వాళ్ళిద్దరిని వదలి, గోపీకుమార్ వెళ్ళిపోయాడు. బదరీ, ప్రేమనంద్ ఇద్దరూ లోయ వేపు బయల్దేరారు.

"ఆ కాయలు ఎక్కడ దొరుకుతాయని నీఉద్దేశం?"

"నాకు తెలుసు ఎక్కడుండేదీ. కావలసినప్పుడల్లా అక్కడికే వెళ్ళి తెస్తుంటాను. అందులో ఇది కాలంకూడాను. సమృద్ధిగా లభిస్తాయి,"

"అలాగే అనుకుందాం దొరికేవరకు!"

ప్రేమానంద్ బదరీవైపు ఆపేక్షగా చూచాడు.

"చాలాహుషారుగా వున్నావ్. గోపీకుమార్ ఏదైనా గమ్మత్తయిన కథ చెప్పాడాయేం ?"

"లేదు. ఏం, గోపీ కథలుచెబుతాడా ?"

"తరుచు చెబుతూంటాడు. అతి నంతోషముండిగా, భేష జంగా అవుపిస్తాడు కానీ. మంచిసరసుడే. చతురుడుకూడా. నువ్వు అతనితో ఏమిటి చెబుతున్నావ్ ?"

"నాగురించే ఇక్కడికి రాకముందు నే నెలా బ్రతికింది ఏంచేసింది, ఎలాంటికష్టాలుపడ్డదీను. విచారించవద్దని ఓదార్చాడు."

"నేనూఅదే అడుగదలచాను. బదరీ! నువ్వు ఎవరినైనా ప్రేమించావా ? అంటే ఓ యువతిని, ఎవరికీ నీప్రేమ సర్పించ లేదూ ! నీకు చాలామంది తెలిసేవుంటారు. అందులో ఎవర్ని ప్రేమించలేదా ?"

"లేదు. ఎలా ప్రేమించగలను? నాదగ్గరకొచ్చిన వారంతా భోగవిలాసినులు, సభారంజనిలు. సుఖాలు అనుభవించటానికి వొచ్చారే కాని, ప్రేమకోసంరాలేదు. అయినా ఏ స్త్రీ నిజమైనప్రేమకు అర్హురాలు నిజానికి?"

"నీకు ఆడవాళ్ళంటే ఎందుకంతమంట? ప్రేమించలేదు గనుక అలా అంటున్నావ్. ప్రేమిస్తే నీకూ తెలిసివచ్చేది."

"ఈ విషయాలు దయచేసి ఆపు. నీ పండ్లసంగతేదో ఆలోచించుకో. ప్రేమవ్యవహారాలు మన కెందుకు? నీ వెప్పుడైనా ప్రేమించావా?"

హఠాత్తుగా బదరీఅడిగిన ఈ ప్రశ్నకు ప్రేమ్ తబ్బిబ్బయినాడు.

"లేదుకానీ, ఆడవాళ్లనుగురించి నీకు తెలిసినదానికంటే నాకెక్కువే తెలుసు. వారిని బాగాఅర్థంచేసుకున్నాను"

"నువ్వెప్పుడూ యిలాగే మాట్లాడుతావ్. ఏమీ తెలియని పసివాడివిలా వుంటావు. ఏకోసిద్ధాంతాలు చెప్తావ్. నీఅభిప్రాయాలే గమ్మత్తుగావుంటాయి. నిన్నుచూస్తే నవ్వొస్తుంది."

ప్రేమానంద్ నిండుగా నవ్వాడు. ఆ కళ్లలోనినవ్వు బదరీలో ప్రతిధ్వనించింది.

*　　*　　*　　*

ఆ లోయకంతా ఆ ఒక్కయిల్లుమాత్రమే శోభాయమానం. ఒకవైపు తెల్లనినీళ్లతో గలగలపారేనది. రెండోవైపు ఎత్తయిన అడవులు. మధ్య పచ్చికమైదానం. ఆ యింటిచుట్టూ ఎత్తులేని ప్రహరీగోడ. ఇంట్లోంచి ఏ కిటికీలోనుంచికాని, ద్వారంలోనుంచిగానీ బయటివారిని గోడపైగా చూడవచ్చు.

ఇంటి చుట్టూ సుందరమైనతోట - మామిడిచెట్లు, దానిమ్మ, సంపెంగ, సపోటా, ఇత్యాదులు, కూరపాదులు. అరటిపనసలు, నారింజ, బత్తాయి - ఇంకా అనేక ఫలజాతులు.

కాలిబాట కిరుపైపులా పూలజాతులున్నాయి. సపోటాలు విరగకాసినయ్ చూచేవారికి నోరూరించేటట్లున్నయ్. కాయలబరువుకు కొమ్మలు నేలకానినయ్. నిండుచూలాలు లాగా వున్నది సపోటాచెట్టు.

"ఇక్కడివాళ్లు నీకు తెలుసా ప్రేమ్?"

"ఆఁ"

"దొంగతనంగా కోస్తావా?"

"ఊహుఁ"

"అయితే పండ్లెలావస్తయ్?" "కోద్దాం"

"యజమాని ఏమంటాడో?"

"ఏమీ అనరు"

"నమ్మకమేకదూ?"

ఇద్దరూ మొండిగోడ దూకి, చెట్టుదగ్గర కొచ్చారు. చెట్టెక్కి మొలలోంచిచిన్నకత్తితీసి కాయలుకోయటం ప్రారంభించాడు. అకస్మాత్తుగా కేకవినిపించింది. ప్రేమానంద్ భయకంపితస్వరంలో అరుస్తున్నాడు.

బదరీ అమాంతం చెట్టుపైనుంచి దూకి, ప్రేమ్‌దగ్గరకు వచ్చాడు. నల్లత్రాచు కోరలువిప్పి, బుసలుకొడుతోంది. మీదిమీదికి వొస్తోంది. చాలాదగ్గరకు వచ్చింది. ప్రేమ్ అక్కడి నుండి భయంతో కదల్లేదు. బదరీ బలవంతంగా అవతలకు నెట్టాడు. త్రాచు బదరీమీది కురికింది. చెట్టుకు కోకను మొలి

వేసి, బదరీ తప్పుకున్నాడు. త్రాచు పౌరుషంతో బుసలు కొట్టిం చింది. బదరీ పాము మెడ పట్టుకొని, గిరగిరా తిప్పి నేలకేసి కొట్టాడు. ఓ కొండరాయి తీసుకుని తల చితగ్గొట్టాడు. విజయంతో తలఎత్తాడు. ప్రేమానంద్ ఓ వయస్సుమళ్ళిన స్త్రీకౌగిట్లో చెమటలు గ్రక్కుతున్నాడు. భయంవొదల్లేదు.

ఆమె పొడుగ్గా, అందంగా వుంది. జుట్టు నెరుస్తోంది. ముఖంమీద యింకా ముడుతలు అగుపించటంలేదు. కను రెమలనీడల్లో కళ్ళు నల్లగా వున్నయ్. ఆమె ఎంతో బాధామయజీవితం గడపినదనిపిస్తుంది. బదరీ ధైర్యసాహసాలు చూచి. ఆమె నిట్టూర్చింది.

"చచ్చిందా ?" అని అడిగిం దామె.

"ఆ"

బదరీ ప్రేమానంద్ దగ్గరకెళ్లి అన్నాడు 'రా వెడదాం. యింకేం భయంలేదు"

ప్రేమ్ యింకా ఆమెను అతుక్కుపోతున్నాడు. బదరీకి అతని ప్రవర్తన చూచి సిగ్గేసింది. మొట్టి పిరికివాడు, అను కున్నాడు.

"మీ తోటలో ఈ గందరగోళంజరిగినందుకు ఏమీ అనుకోకండి" మమల్ని క్షమించండి. అన్నాడు బదరీ. అంటూ ప్రేమానందుని బలవంతాన లాగాడు "రా. ఏమి టలా ఆడ దానిలా ఏడుస్తావ్ ! యింతమాత్రానికే. పౌరుషం లేదూ ?" అన్నాడు.

ఆ వయస్కురాలు ఆశ్చర్యపడ్డది. "ఇతను అబ్బాయి కాడు, అమ్మాయి నా కూతురే. ఎంతధైర్యంగా లాగావు."

బనరీనరాలు మంచుకప్పబడ్డవి. రక్తం ఘనీభవించింది. ప్రేమానంద్ – స్త్రీయా! అదిరిపోయాడు. అంతరాంతరాల్లో ఆగ్రహం చెలరేగింది. సన్నసన్నగా రాజుకుంటోంది. అతని వికృతానయనపుష్టికి కారణం తెలిసింది. ఎప్పుడూ ఉత్తరీయం ధరించటం యిందుకన్నమాట! అతనిగొంతులో తేనెసోనలు నిజమైనవే. అతనిముఖంలో స్త్రీత్వం అందుకే ఉట్టిపడేది. కోపం ప్రజ్వరిల్లింది. "నువ్వు...నువ్వు...ఆడ..." అంటూనే వెళ్ళిపోయాడు ఏదో బాధతో, అలసిపోయినట్టు.

* * * *

అప్పటికి సాయంత్రం అయిందేమో, కర్మశాలమూసి వేయబడ్డవి. స్నానానంతరం ప్రతిభిక్షువు తనగుహకు వెళ్ళాడు. గుహలనుండి ఒక్కొక్కడే ఆనందవిహార్ వేపు చీమలబారుల్లా బయల్దేరారు. బారులుతీరి యతులు, భిక్షువులు, భోజనాలకు కూర్చున్నారు. ఎవరిగ్లాసులు, పళ్ళాలు వారు తెచ్చుకోవలసిందే. ఆనందవిహార్ ఒక రాతిగుహ. అందులో ప్రభుఘోష్ భోజనాలఏర్పాట్లుచేస్తున్నాడు. పొట్టివాడేగాని, ప్రభుఘోష్ స్ఫురద్రూపి. నిశితంగా చూడగలడు. చూపులతోనే మనుష్ళుల్ని, మనసుల్ని ఆకట్టుకోగలడు. అతనిగొంతుకలోనుండి వెలువడే స్వరం స్త్రీకంఠస్వరంలా మృదువుగా, మధురంగా, ఉత్తమస్థాయిలో ఉంటుంది. అతను జ్యోతిశ్శాస్త్రంలో నిపుణుడు. రోజులో ఎక్కువభాగం గ్రహఫలాన్ని, నక్షత్రసంచారాన్ని పరిశీలించటంలో వినియోగిస్తాడు. ఏ గ్రహబలం ఎలాంటిదో అతనికి బాగా తెలుసు. ఇదిగాక, విహారాలమీద, భోజనశాలలోను సర్వాధికారాలు అతనివే. భిక్షువులను ఏఏ విహారా

లను కేటాయించాలో అతనికే తెలుసు. ఎవరికీ ఏవిధమైన కష్టాలు రాకుండా చూచేబాధ్యత అతనిది. తగినసదుపాయాలు అందరికి ఏర్పరచేబాధ్యత అతనిది. రాష్ట్రంలోని అందరు వణిక్ప్రముఖులతోను అతనికి పరిచయంవుంది. కావలసిన పదార్థాలు సేకరించటంలోను, దానధర్మాలు స్వీకరించటంలోను సమర్థుడు. మంచిమంచికాయగూరలు తెప్పిస్తాడు. గ్రామీణులు ఎప్పటికప్పుడు పాలు, పెరుగు, నెయ్యి, కూరలు, యితర పదార్థాలు తెచ్చేట్లుచేస్తాడు. అతనిలో లౌకికం ఎక్కువ.

ఒక పెద్దగిన్నెలో తెచ్చి, ఒకభిక్షువు అన్నంవడ్డిస్తున్నాడు. మరొకభిక్షువు కూరలువడ్డిస్తున్నాడు. ప్రక్కనే మరొకరు మంచినీరు సరఫరాచేస్తున్నారు. భోజనాలకు కూర్చొన్నవారు నవ్వుతో, సంభాషిస్తూ పరిహాసాలాడుకుంటున్నారు.

ఇదేమీపట్టనట్లు బదరీ ఓమూల చేరాడు. అన్యాసక్తమనస్సుతోనే ఏదో నములుతున్నాడు. ఆకలిలేదు. అయినా ఏదో తినేస్తున్నాడు. మనస్సక్కడలేదుగనుక రుచి తెలియదు. విహారనియమాలననుసరించి ప్రతివారు భోజనసమయానికి హాజరుకావలసిందే. వండినపదార్థాలు తినవలసిందే. ఏదో కూరకలుపుకుని, నాలుగుముద్దలు మింగాడు బలవంతాన. తల వంచుకుని ఏదో ఆలోచిస్తున్నాడు.

నాగోజీ దగ్గరగావచ్చి, అభివందనంచేసేవరకు కళ్ళెత్తి చూడలేదు. నాగోజీ ఆట్టే పొడవరికాదు. కానీ, అతనిది కండరాలుతిరిగినశరీరం. పెద్దకళ్ళు, వెడల్పైననోరు అతనివి. స్వీయాభిప్రాయాలను జంకుగొంకులేకుండా వెలిబుచ్చుతాడు. తన్ను తాను సమర్థించుకోవటంలో, తన అభిప్రాయాలను ఇతరులు

పన్నోలాచేయటంలో నిపుణుడు, దక్షుడు. అయితే అన్నిటికి మించిన సహృదయత్వం అతనిలో వుంది. పెద్దగా అరచినా, కేకలువేసినా కపటంలేనివాడు నాగోజీ.

"ఓహో బదరీ! ఈవేళ నువ్వేంచేశావు?" అంటూ పక్కనే కూర్చున్నాడు.

"ఏంచేయలేదు. నువ్వో?"

"మొగ్గలచైత్యంలో ఓ బొమ్మ చెక్కుతున్నాను. ఓ ఏనుగు. నువ్వు నమ్ముతావో లేదో కాని, అద్భుతమైనపనితనం అనుకో అది. అంత పెద్దఏనుగును చెక్కడం అంటే మాటలా! ఎవరివల్లైనా అయ్యేపనా, అది? నేనుగనుక చేయగలుగుతున్నాగాని. ఒక్క తొండంమినహా అంతా పూర్తయింది. కాని, ఆ తొండమే నా ప్రాణంతీస్తోంది. ఎంతకీ కుదరకుండా వుంది. ఎలా చెక్కాలో అర్థంకావటంలేదు"

"అయితే పూర్తిచేయకుండానే వొదిలిపెట్టావన్న మాట?"

"అవును. విసుగుపుట్టింది. కాని, ఏంచేసేది? అది పూర్తి చేయాలి. అసంపూర్తిగా వదలకూడదుగా. వేరే రాతిపలక మీద ప్రయత్నించాను పగలల్లా. కానీ, ప్రయోజనంలేక పోయింది. వొంపులురావటంలేదు. చివరకు చెట్టుమొదల్లాగా తయారవుతోంది. ఏంచెయ్యాలా అని?"

"నీకు ఆ ప్రాంతాల్లో ఎవరైనా కనుపించారా?"

"ప్రేమానంద్ అవుపించాడు. వాఘీరావొడ్డున కూర్చుని వున్నాడు. అతనితో చెప్పాను. మాదిరిచిత్రం గీసి చూపించాడు. అయినా, నావల్ల పూర్తికావటంలేదు."

"ప్రేమానంద్ నమూనా యిస్తే, అలాగే ఎందుకు పూర్తిచేయగూడదు? పద్ధతి తెలిసిందిగదా"

"అతను నేలమీదగనుక గీశాడు. నేనో రాతిని చెక్కాలి. కుంచెతో వేయటం సులభమే. ఉలితోపని అంత తేలికగాదు. వొంపులు, నునుపురావటం కష్టం."

"అయితే రేపువచ్చి నే చూస్తాలే. సరేనా?"

"రేపుకాదు. ఇప్పుడే వెడదాం. పగలంతా మహా బాధపడ్డాను. అంతు తేలనిదే నిద్రపట్టదు రాత్రికి."

నాగోజీ భోజనం పూర్తిచేసి బయల్దేరాడు. బదరీ అతన్ని అడిగాడు "ప్రేమానంద్ ఏదివాడ్డున ఏంచేస్తున్నాడు?"

"అక్కడకూర్చుని ఏడుస్తున్నాడు. ఏమిటిసంగతి? ఎందుకేడుస్తున్నావని అడిగాను. సమాధానం చెప్పకుండానే ఏడుస్తున్నాడు. నాకే బాధనిపించి, వచ్చేశాను. ఏం జరిగివుంటుందో నీవు వూహించగలవా?"

బదరీకి భుజాలుతడవుకున్నట్లయింది. నాగోజీ ఇరుకునపడ్డాడు.

"రేపు తప్పకుండా వచ్చి, నీపని చూస్తాను. ఏమీ విచారించకు. ఎప్పుడూ బాధపడుతూనే వుంటావు. బాధలు మరచిపోయి, నిశ్చింతగావుండటం నేర్చుకోరాదూ?"

నాగోజీ బాధగా నిట్టూర్చాడు "బాధపడగూడదనే అనుకుంటాను? కాని, ఎలాసాధ్యం. బాధలేనిది నా జీవితమే లేదు. నీకూ తెలుసుగా"

బదరీనారాయణ తలూపాడు. నాగోజీ వెళ్ళిపోయాడు. బదరీ మిగత భిక్షువులవేపు చూచాడు. అందరూ భోజనం

ముగించేస్థితిలో వున్నారు. అలాగే నెమ్మదిగా తినటంసాగించాడు. అక్కడే కూర్చుండిపోయాడు ఆలోచిస్తూ. 'పాపం నాగోజీ! అనుకున్నాడు.' అతన్నిగురించే విచారించాడు. అమాయకులే జీవితంలో ప్రతి చిన్నవిషయాన్నిగూర్చి విచారిస్తారు అనుకున్నాడు సాలోచనగా.

*　　　*　　　*　　　*

నాగోజీ సామాన్య శిల్పికుటుంబంలో జన్మించాడు. అతనితండ్రి గొప్పపేరుపడ్డ శిల్పాచార్యుడు కాదు. కాని, చిన్న చిన్నబొమ్మలు, రాతివిగ్రహాలు చేసి, జీవనంచేస్తుండేవాడు. వయసొచ్చినకొలదీ నాగోజీకూడా మట్టితో బొమ్మలుచేయటం నేర్చుకున్నాడు. కుటుంబవృత్తిగనుక, కొందరలోనే రాతి చెక్కడాలు, విగ్రహాలుమలచడం నేర్చుకోగలిగాడు. తండ్రి వలెనే నాగోజీకూడా రాణకెక్కలేదు. పుట్టింది దరిద్రకుటుంబంలో కనుక, జీవితంలో పొదుపుగా కాలక్షేపంచేయటంవల్ల వృద్ధాప్యంవచ్చేసరికి నాగోజీతండ్రి కొద్దిపాటిఆస్తి సంపాదించుకోగలిగాడు. అదే ముసలితనంలో అతనికి ఆధారం అయింది.

నాగోజీకి తల్లిలేదు. అతనిచిన్నతనంలోనే మరణించింది. తల్లిపోయినా, నాగోజీని తండ్రే అల్లారుముద్దుగా పెంచాడు. తనకు తెలిసినవిద్యలు నేర్పాడు. మట్టితోబొమ్మలుచేయటం, రాళ్లు చెక్కడం, విగ్రహాలు నిర్మించటం యిత్యాదులు. పనిలో మెలకువ, జాగ్రత్త, నైపుణ్యం అన్నీ తండ్రిదగ్గరే నేర్చుకున్నాడు నాగోజీ.

అయితే, యింకా నేర్చుకోవలసింది ఎంతో వుండగానే తండ్రి కాలధర్మంచెందాడు. దానితో రెక్కలువిరిగినపక్షిలా

అయిపోయాడు. ఈ లెక్కల్లేనిపట్టీని మేనమామలు తీసుకు వెళ్ళి, సాకారు. యుక్తవయస్సువచ్చి, తనకాళ్ళమీద తాను నిలబడగలననేధైర్యంవచ్చేవరకు అక్కడే వున్నాడు. అప్పుడు మేనమామను అడిగాడు - తనఆస్తిని తనకిప్పించవలసిందిగా. తనబ్రతుకు తాను బ్రతిగ్గలనని వేడుకున్నాడు.

నాగోజీప్రార్థన నెవరూ ఆలకించలేదు. మేనమామలు తెల్లమొఖంవేసి, రిక్తహస్తాలు చూపించారు. ఆస్తి దమ్మిడీ విలువైనదికూడా దక్కలేదు. ఉన్న కొద్దిఆస్తీ, నాగోజీ చదువులకు అయిపోయిందనీ, తామే దరిద్రులమైనామనీ చెప్పారు. నిజంగానే వాళ్లు దరిద్రులైనారు. నాగోజీకి ఏవిధంగానూ సహాయంచేయలేనిస్థితి ఏర్పడ్డది.

నాగోజీ ఎంతగానో విచారించాడు. అతనివిచారానికి సానుభూతిచూపగలవారెవరూ లేరు. వెనక అండలేకుండా, చేతిలో డబ్బులేకుండా జీవితయాత్రసాగించటం ఎలా? ప్రపంచంలో బ్రతకటం దుర్భరం, దుస్సాధ్యం అనిపించింది. మేనమామలతో పేచీపడ్డాడు.

"మీరు నన్ను, నాఆస్థిని దోచుకున్నారు. అంతా తినేశారు. నా తండ్రి రక్తంపోడ్చి, నాకోసం సంపాదించి మిగిల్చినదంతా గుటకాయస్వాహాచేసి, పైగా నాకోసమే ఖర్చుచేశామంటున్నారు. ముమ్మాటికీ నన్ను దోచుకు తిన్నారు" అన్నాడు.

మామలకు కోపంవచ్చింది. కోపంలో నోటికివచ్చినట్లల్లా తిట్టారు. తిట్టి, ఇంట్లోంచి వెళ్ళగొట్టారు.

ఎక్కడికి వెళ్ళాలో అతనికి తోచలేదు. ఒక ఆలోచన లేదు, ధ్యేయంలేదు. మార్గం కనుపించదు. వెలుగులోంచి చీకట్లోకి వచ్చినట్లయింది అతనిస్థితి. ఆరాత్రి ఓ పాడుబడ్డ దేవాలయంలో నిద్రపోయాడు. మరునాడు తనస్థితిని తలచుకుంటే మరణం భయంకరరూపంలో ప్రత్యక్షమైంది. ఆకలి, అసంతృప్తి, నిరాశ ప్రస్ఫుటమౌతున్నాయి.

మరునాడు నిజానికి అతనూహించుకున్నంత భయంకరంగా లేదు. అతని తండ్రితో పరిచయమున్న ఒక వృద్ధుడు అతన్నిగుర్తించి, ఆహ్వానించాడు. ఒక శివునివిగ్రహం తయారుచేసియివ్వవలసిందిగా కోరాడు. అది నాగోజీకి ఆనందం కల్గించింది.

నాగోజీకి కూడు, నీడ లభించినై. వస్తులుండవలసిన అవసరం లేకపోయింది. రాత్రింబవళ్ళు ఆ విగ్రహం చెక్కడంలో నిమగ్నుడైనాడు. శివాలయంలో లింగప్రతిష్ఠకుబదులు విగ్రహప్రతిష్ఠ జరిపించాలని అతని అభిలాష. నాగోజీ కష్టించి కృషి చేస్తున్నాడు. ఎంతో జాగ్రత్తగా వొంపులు చెక్కుతున్నాడు విగ్రహంలో లోపంరాలేదు. రేఖలు భావోద్దీపితంగా గంభీరంగా కుదిరాయి. కాళ్ళు బలంగా, లావుగావున్నాయి. శిరస్సు గంభీరంగావుంది. గంగాభవాని శిఖలోంచితొంగిచూస్తోంది. శివునికి నాలుగు చేతులు సృష్టించాడు. ఒక్కొక్కచేతిలో ఒక్కొక్క వస్తువు. ఒకచేతిలో డమరుకం, ఒకచేతిలో పద్మం; ఒకచేతిలో త్రిశూలం; ఒకచేతిలో శంఖం అమర్చాడు. పద్మం, శంఖం, త్రిశూలం బాగానే కుదిరినయ్. కాని, డమరుకం ఆకారవిహీనమయింది. అతను వూహించినవిధంగా మలచలేకపోయాడు.

అది తనవల్ల కాదేమోనని భయపడ్డాడు. అనేకరకాల రాళ్ళతో ప్రయత్నించాడు. ఎంతో బాధపడ్డాడు; విచారించాడు. శివునిచేతిలో ఒకముద్ర పెట్టినట్లున్నదే కాని, డమరుకంలా లేదని. ఇంక ప్రయత్నించి లాభంలేదని, నిరాశతో వూరుకున్నాడు. నాగోజీని ఆపనికి నియమించినవృద్ధుడు విగ్రహాన్ని చూచి సంతృప్తిచెందాడు. కాని, అది అసంపూర్తి విగ్రహం; అసంపూర్తివిగ్రహాన్ని ఆలయంలో ప్రతిష్ఠించటానికి వీల్లేదు. అందుకనే ఆ వృద్ధుడు ఎంతో నిరాశ వెలిబుచ్చాడు.

నాగోజీసైతం తన అసమర్థతకు ఎంతగానో చింతించాడు. అక్కణ్ణించి నిరాశతో బయల్దేరాడు. మళ్ళీ కూడు. నీడల సమస్య ఎదురైంది. ఏడురోజులపాటు ఉపవాసాలుచేశాడు. ఆహారపానీయాలు లేవు. బాధ మనస్సును తినివేస్తోంది. ఎంతో దౌర్భాగ్యంగా తయారయ్యాడు. దిక్కూమొక్కూ లేనిజీవితం అయింది. దొరికింద దొరికినట్లు తింటూ, అనేకచోట్ల తిరిగాడు. తిరిగి మామూలు మనిషిని కాగలనన్న నమ్మకం నశించింది అతనిలో.

నాగోజీ అదృష్టమా అన్నట్లు ఓ వృద్ధశిల్పిపరిచయం లభించింది. అతను మహాజిత్తులమారి. మోసకారితనం అతని కళ్ళల్లోనే అగుపిస్తుంది. హృదయం ఎంతో మంచిది. కనుకనే దయతో నాగోజీని తనచేతిక్రిందకు తీసుకున్నాడు. అక్కడ నాగోజీ తన బాధలు మరచిపోయాడు. తిరిగి కష్టపడి పనిచేయాలన్న ఉత్సాహం కలిగింది. అయితే, అతనికృషికి శైలబాల అడ్డువస్తోంది. శైలబాల వృద్ధశిల్పిగారాబుపట్టి.

శైలబాలసౌందర్యవతి. షోడశకళానికుంజం. రాజహంసలా నడుస్తుంది. పక్షిలా యిటు అటు ఎగురుతుంది. కుసుమసుకుమారం ఆమెలో వుంది. అందరుయువతులవలెనే ఆమెకు తన సౌందార్యాన్ని చూచుకొని గర్వం.

అక్కడియువజనులు ఆమె అడుగులకుమడుగులొత్తేవారు. ఆమెచరణదాసులుకావాలని ఉబలాటపడుతూండేవారు. ఆమెనడచినప్రదేశాల్లో నడుస్తో, తమజన్మ తరించిందని భావించేవారు. కాని, ఆమె ప్రేమానురాగాన్ని ఎవరూ పొందలేక పోతున్నారు.

నాగోజీకి శైలబాలంటే ప్రేమ, అభిమానం లేవు. పైపెచ్చు అసహ్యంకూడాను. శైలబాల ఇది పసిగట్టకపోలేదు. మొదట్లో అందరుయువకులవలెనే నాగోజీ తన సౌందర్యాన్ని చూచి, ముగ్ధుడైపోతాడని భావించింది. తనవెంటపడతాడనుకుంది. కాని, అలాంటిదేమీ జరుగకపోయేసరికి అభిమానం దెబ్బతిన్నది. ఆమెతో అత నెందు కంత విముఖుడుగావుంటు న్నాడో ఆమెకుఅర్థంకాలేదు. ఈ అయోమయస్థితిలోనే అత నంటే అనురాగంఏర్పడినది. అనురాగం ప్రేమగా పరిణమించటానికి అట్టేకాలం పట్టలేదు. లోకవిరుద్ధంగా శైలబాల స్వయంగా నాగోజీనిరెచ్చగొట్టడం ప్రారంభించింది. అతనికోసం పరుగులెత్తేది.

నాగోజీ తిరిగి విచారంలో మున్కలువేస్తున్నాడు. ఆడ వాళ్లంటేఅసహ్యించుకున్నాడు. వారికి దూరంకావాలని ప్రయత్నించాడు సాధ్యమయినంతవరకు. కాని, శైలబాల అతనికి అన్నివిధాల ప్రతిబంధకమయి కూర్చుంది. నిర్మలమైన అతని

జీవిత కాసారంలో రాయి వేసి, కల్లోలపరచినట్లయింది. ఆమెను ఎలా వదిలించుకోవాలో ఆలోచిస్తున్నాడు. అతని ప్రతిపనిలోను శైల జోక్యం కలిగించుకొంటోంది. స్వాస్థ్యం, శాంతి లేకుండా పోయినయ్ బ్రతుక్కి. ఆవిణ్ణి వొదిలించుకోవాలనే ప్రయత్నించాడు. దూరంగా పొమ్మని కసిరాడు; నెట్టివేశాడుకూడా. కాని, అతను ఎంత దూరంచేయాలని యత్నిస్తుంటే శైల అంత దగ్గరగా జరుగుతోంది. నీడలా వెన్నాడడం ప్రారంభించింది. ఆమెను గురించినభయంతోనే బ్రతుకుతున్నాడు నాగోజీ.

వృద్ధశిల్పితో మొరపెట్టుకున్నాడు,

"నీకూతురికి తొందరగా పెళ్ళిచేసెయ్యి"

"ఎవరు చేసుకుంటారు?" అన్నాడు వృద్ధుడు

"ఎందరో యువకులున్నారు. శైలకోసం తిరిగేవాళ్ళు ఎందరోవున్నారు. అందులో ఎవరైనా చేసుకోవటానికి సిద్ధపడతారు."

"నువ్వే చేసుకోరాదూ!" అని అడిగాడు వృద్ధుడు.

"నేనా! మీకేమైనా పిచ్చెక్కిందా? నాకు ఆడవాళ్ళంటే రోత. అయినా, నీ శైలఅంటే నాకిష్టంలేదు."

"శైలకు నువ్వంటే ఎంతోయిష్టం. మీరు పెళ్ళాడితే ఆదర్శదంపతులవుతారు. అదే నేనూ ఆలోచిస్తున్నాను. ఇంకో పదిరోజుల్లో లగ్నంకూడా వుంది. నువ్వు సరేనంటే మిగతా విషయాలు నే చూసుకుంటాను."

కోపంతో నాగోజీకళ్ళు ఎర్రబడ్డాయి. నే నెవర్నీ చేసుకోను. అసలు పెళ్ళేచేసుకోను"

వృద్ధుడు రోషంతో మండిపడ్డాడు. తనదగ్గరవుంటూ, తనచేతికూడు తింటూ, తనకూతుర్నే చేసుకోనంటున్నందుకు కోపంవచ్చింది. "పదిరోజుల్లో లగ్నంవుంది. ఆ లగ్నానికి నువ్వే చేసుకుంటావ్. ఎలాచేసుకోవో నే చూస్తాగా!"

నాగోజీకి ఆ మాటలు శాపంలా తోచాయి. పనిచేయలేకపోతున్నాడు. అన్నంసహించదు. ఆలోచనపోదు. శైల అతన్ని అనునయించటానికి ప్రయత్నించింది. ఆమెవచ్చినప్పుడల్లా అతను రెచ్చిపోతున్నాడు. తా నో బందీఅయినట్లూ, తనకు మరణశిక్షలభించనున్నట్లూ బాధపడసాగాడు.

శైలబాల ఈ విముఖతను భరించలేకపోయింది. తన సౌందర్యం వట్టిపోయినట్లు బాధపడ్డది. విలువ, గౌరవం పొందలేనిసౌందర్యం తనది. నిరాశతో కుమిలిపోసాగింది. ఇంతకాలం నుండి తాను యువకుల్ని నిందించింది. ఈనాడు ఓ వృద్ధజీవిచే నిందింపబడుతోంది. అయినా, అతన్ని తాను ప్రేమిస్తోంది. అతనినిరసన తనను మరీ అతని వేపు ఆకర్షిస్తోంది. అతనితో బంధిస్తోంది. అతనిరూపమే తనమనోఫలకంపై చెరపరానిదిగా చిత్రించబడింది. ఒకరోజురాత్రి పట్టరానివిరహం కలిగింది. నాగోజీలేకుండా తను బ్రతుకలేననిపించింది. అతనిగదికి వెళ్ళింది. తనబట్టలు, వస్తువులు మూటగట్టుకుని, అతనితో అన్నది– 'నాగోజీ, నీతో నన్ను తీసుకువెళ్ళు; నువ్వు లేనిది నేను బ్రతకలేను, పద, ఎక్కడికైనా పోదాం. ఎట్లాగో బ్రతుకుదాం"

నాగోజీ సిగ్గుతో, లజ్జతో కంపించిపోయాడు. ఇంట్లోంచి పారిపోయ్యాడు, తిరిగిచూడకుండా.

ఆతర్వాత స్త్రీలంటే ప్రళయకంపనం అతనికి. ఒక దేవాలయంలో నిద్రిస్తున్నప్పుడు. తనురచించే దేవదాసీలే నిజరూపాల్లో అతన్ని వెంటాడారు. ఆ దేవాలయం అసంపూర్ణంగానే వదలి, పారిపోయాడు. తర్వాత మరోవూరు చేరుకున్నాడు. అక్కడ ఉత్సవాలకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. కృష్ణవిగ్రహం తయారుచేసే అవకాశం లభించింది నాగోజీకి. అతను చెక్కుతున్న కృష్ణవిగ్రహాన్ని దర్శించేందుకు అనేక మంది స్త్రీలు వచ్చారు. అతని అద్భుతశిల్పప్రావీణ్యతకు ముగ్ధులై, వారంతాగోపికలైఅతనివెంటబడటం ప్రారంభించారు. భయంతో విగ్రహాన్నివదలి, పారిపొయ్యాడు నాగోజీ మళ్ళీ.

చివరకు పర్వతాలలోకి పోయి, తలదాచుకోవాలని నిశ్చయించుకున్నాడు. తన కొద్దిజీవితంలో అనేక బాధలు పడ్డాడు. యమయాతనలనుభవించాడు. పర్వతాలలో తనకు శాంతిలభిస్తుందని ఆశించాడు. అలాంటినమ్మకం ఎందుకు కలిగిందో అతనికే తెలీదు. అప్పుడే ఒకయతితో పరిచయం లభించింది. అతను అజంతాకు ప్రయాణమై వెడుతున్నాడు. తనూ అతనితోకలిసి వెళ్ళాడు. అక్కడే శాంతిలభించింది. జీవితం సుఖంగా జరుగుతోంది. సుఖంగా బ్రహ్మచారిజీవితం గడుపుతున్నా డక్కడ. తాను నిర్మించేశిల్పాలు పరిణతిచెందనప్పుడే మిత్రుల్ని, ఆచార్యుల్ని బాధపెట్టేవాడు. అతనిసంగతి అందరకూ తెలుసు. అందుకే సానుభూతితో అతనికష్టాలను ఆలోచించేవారు.

* * * *

బదరీనారాయణకు తనవేపే వొస్తున్న అడుగులసవ్వడి వినపడలేదు. ఆ ధ్వని మరీదగ్గరఅయినప్పుడు వెనుతిరిగి చూచాడు. ఆ వచ్చింది ప్రేమానంద్ !

"ఎందుకొచ్చావ్ మళ్ళా" గొణుక్కున్నట్లుగా అడిగాడు. అలా అడుగుతూంటే ఆతనిగొంతుక తడారింది. ధ్వని మందగించింది. ఏదో ఆవేదన, ఆలోచన అతనిలో.

"రావాలిగనుక వొచ్చాను. నే నిక్కడిదాన్నేగా. అందరికీ తెలుసు నాసంగతి. నీవొక్కడికే తెలియనిది. మొదటే నీతో చెప్పివుండవలసింది. కాని, చెప్పలేదు. చెప్పలేదని, రహస్యంగావుంచానని కోపంకదూ నామీద ? అవునా ?" బదరీకళ్లలోకి అదోలా చూచింది. తొణకలేదు. పైగా ఆశ్చర్యంకలిగింది కూడాను.

"అయితే నీపేరేమిటి ?"

"ప్రేమకుమారి"

"నీసంగతి తెలిసే, నిన్ని విహారంలో చేర్చుకున్నా రన్నమాట !"

"అవును. నాకు చిత్రలేఖనంఅంటే యిష్టం. ఆ విషయం ఒకసారి ఆచార్య విజ్ఞానందులతో చెప్పాను. కాని, వారు వొప్పుకోలేదు. ఎందుకో తెలుసా ? నేను పురుషుణ్ణి కానని. తర్వాత పురుషదుస్తులు వేసుకుని వచ్చాను. అప్పుడు ఒప్పుకున్నారు. వారికి తెలియలేదు, నేను వేషంమార్చి, మోసంచేస్తున్నానని. అలా రహస్యంగానే వుంచుదామను కున్నాను. కాని, అందరికీ తెలిసిపోయింది. ఎలా తెలిసిందో

నాకే తెలీదు, అయితేనేం, ఎవరూ నన్ను స్త్రీగా చూడరు. తమలాగా నేనూ ఓ పురుషుణ్ణనే వాళ్ళ భావన"

ఆమెమాటలకు బదరీ నిశ్చేష్టుడైనాడు. పేలవంగా అగుపించాడు. అతనికి ఆమెమాటల్లో విశ్వాసం, నమ్మకం కలుగనే లేదు. ముభావంగా అన్నాడు

"మనం యింకమీదట స్నేహితులంకాదు. ఒకర్నొకరు మర్చిపోవాల్సుంటుంది."

"బదరీ ఎందు కంత నిరుత్సాహపడతావ్ ? నీ నిరుత్సాహంచూస్తుంటే నాకూ నిరుత్సాహంకలుగుతోందిసుమా ! లోగడ ఎలావున్నామో, ఇకముందుకూడా అలాగే వుందాం. నేను ఆడపిల్లననేవిషయం మర్చిపో. అప్పుడు ఎప్పటిలా స్నేహంగావుండగలం."

"లాభంలేదు. ఇకమీదట మనం ఒకరినొకరం కలుసుకోనవసరంలేదు. దూరంగా వుండిపోదాం. అసలు ఒకరినొకరం ఎరుగనట్లే వుండిపోదాం. అదే మంచిదనిపిస్తోంది. మనం మళ్ళీ మళ్ళీ కలుసుకుంటుంటే నా కేదో వికారంగా వుంటుంది."

"ఎందుకో వికారం ? నేను ఆడుదాన్ని కావటంవల్ల నేనా లేక మొదటే నీకీ విషయం చెప్పక, గుప్తంగావుంచాననేకోపంవల్లనా ? ఏం, స్త్రీ స్నేహపాత్రురాలు కాదా ? పురుషులేనా స్నేహానికితగినవారు ?"

"ఏమో, నాకు తెలియదు. స్త్రీఅంటేనే నాకు ద్వేషం. వాళ్ళకుదూరంగావుండాలనే యింతదూరం శ్రమపడి పారిపోయివచ్చింది. ఇలాంటి ఏకాంతప్రదేశంలో స్త్రీనివాసానికి

అయోగ్యమైనప్రదేశంలో వాళ్లనుమరచిపోగలననేధైర్యంతో వున్నాను" "నేను ఫలానాఅని తెలియకపోతే ఆ బాధలేదుగా; వుండేదికాదుగా. ఇప్పుడు ఆ భావంతోనే వుండు, మునుచుకు పోయిందేమీలేదు."

"అది వేరేవిషయం. తెలియనప్పుడు మసలటం వేరు, తెలిసి ప్రవర్తించటం వేరు. ఇలా జరుగుతుందని కలలోగూడ ఊహించలేదు నిజానికి. బుద్ధునిరూపం నీలో వూహించు కున్నాను. గౌతముడుగావున్నపుడు బుద్ధదేవుడు నీఅంతసౌంద ర్యంగా, నీలాగా వుండేవారని వూహించుకున్నాను. ఇప్పు డాభావం తునాతునకలైపోయింది. దానిస్థానే భయంకరరూపం అగుపిస్తోంది. నా శాంతి ధ్వంసమయింది."

"ఏం, నన్ను నీలాగా ఓ పురుషునిగా భావించుకోలేవా? ప్రయత్నిస్తే అసాధ్యంకాదుగదా!"

"లాభంలేదు. నాదోవను నన్నొదిలెయ్. నీతో సంపర్కం భరించలేను. ఆ సహనంకూడ లేదు నాలో."

"ఇక్కడవుండే ప్రతివ్యక్తి నన్ను అలానే భావించు కుంటున్నాడుగద. నీ కెందుకు అసాధ్యం అవుతుందో అర్థం కాకుండావుంది"

"అందరిలాంటివాణ్ని నేను కానుగనుక!"

ప్రేమ లేచి నిలబడ్డది. బదరీ నెమ్మదిగా నములు తున్నాడు. చాలా కోపంగావున్నాడు కూడా. కనీసం తలెత్తి అయినా ప్రేమవైపు చూడలేదు. ఆమె వెళ్ళిపోయింది. ఆమె మనస్సులో భావాలు ఏవో, ఎలాంటివో తెలీదు. బదరీమనస్సు ఎలా భంగపడుతోందో వూహించుకోవచ్చు సులభంగా.

బదరీ భోజనంముగించి, గిన్నెకడిగి యథాస్థానంలో వుంచాడు. బయటకు నెమ్మదిగా నడిచాడు. ఒక్కొక్కరే ప్రార్థనకోసం సంఘుచైత్యం వేపు పోవటం గమనించాడు. అప్పటికే ప్రార్థనగీతాలు ప్రతిధ్వనిస్తున్నాయ్. పళ్ళతో పెదాలు నొక్కుకున్నాడు. లోపలనుండి పొంగివచ్చే ఆవేదనను పళ్ల మధ్య బంధించాడా అనిపిస్తుంది. తనలో పవిత్రత సడలి పోయింది. ఏదో మలినం తిరిగి తననుసోకింది. ఒక్కసారి భుజాలు కుంచించుకున్నాయి. వళ్ళు పులకరించింది.

కొండదిగి, వాఘీరావొడ్డుకు నడిచాడు వొంటరిగా. నది దాటి, మధ్యాహ్నం వెళ్ళినబాటంటే పోతున్నాడు. తనపదధ్వని తప్ప మరేధ్వనీ వినిపించటంలేదు. తన భయంకర నిశ్వాసాలే తనను భయపెడుతున్నాయి. పొదలు. గుట్టలు దాటుతూ, ఓ మైలుదూరం నడిచాడు. పచ్చనితోట, పచ్చికబయలు. చీకట్లో అంతా నల్లగా అవుపిస్తోంది. తోటలో ఒకయిల్లు. అది బాటసారులు తలదాచుకునే ధర్మసత్రంలాగుంది. అయితే, ఏబాటసారీ ఆ దారిని రాడు. అది మానవసంచారంలేనిప్రదేశం. వూరికిదూరంగా, మనుష్యనివాసానికిదూరంగా వున్న ఒకే ఒక్కయిల్లు. వుండటానికి చూడటానికి ముచ్చటగా వుంది. ఓ చక్కని అందమైన అతిథిభవనం. అది ఓ రహదారిబంగళా. లోపల దీపాలు వెలుగుతున్నాయి. కిటికీలగుండా వెలుగు కిరణాలు బయట చీకట్లను భయపెడుతున్నయ్. అవి జ్ఞానచంద్రికలా, కాంతిపుంజాలా అనిపిస్తోంది.

బదరీ గోడదాటి, తోటకడ్డంగా దోవతీశాడు. తిన్నగా వాకిట్లోకి వెళ్లి తలుపుతట్టాడు గట్టిగా.

తలుపు తెరువబడింది. ఆ తీసినవ్యక్తి ఎవరో బదరీకి తెలియదు. అతన్నెప్పుడూ చూడలేదు. పొడుగ్గా, బలంగా వున్నాడు. వెడల్పైననుదురు, విశాలమైనవక్షస్థలం, అందంగా వున్నాడు. అతనిచూపులో జాలి, కారుణ్యం తొణికసలాడుతున్నాయి. కోరమీసాలు, పొడవైనగడ్డం అతన్నొక వీరుడని పిస్తున్నాయి. జుట్టు బుజాలపైకి జారింది. తెల్లగావున్నజుట్టు అతనివయఃపరిపాకానికి నిదర్శనం.

"ఏంకావాలి?" అని అడిగాడు గృహస్థు అతిథిసత్కార భావం పుట్టిపడేగొంతుకతో.

"ఇంటివారిని కలుసుకోవాలి. మధ్యాన్నం ఆమెగారిని చూచాను."

"ఓ! అలాగే. విన్నాను విన్నాను. లోపలికి రండి!"

బదరీ లోపలకు నడిచాడు. ఒకసోఫాలో కూర్చున్నాడు. మధ్యాహ్నం తానుచూచినఆమె- ఆ వయసుమళ్ళిన స్త్రీ వొచ్చింది. లేచి నమస్కారంచేశాడు.

"ఏమైనా జరిగిందా నాయనా?" అని అడిగింది ఆమె.

ఏంసమాధానంచెప్పాలో తోచక గోళ్ళుగిల్లుకుంటూ కూర్చున్నాడు బదరీ.

"ప్రేమకుమారినిగురించి ఒకవిషయం అడుగుదామని వచ్చాను. మీరామెను సంఘారామంలో వుంచటం యుక్తంగా లేదు."

ఆమె చిరునవ్వునవ్వింది. ఆ నవ్వు బదరీని తలక్రిందులు చేసింది. తలెత్తి ఆమెవైపు చూచాడు. ఆమెనవ్వులో గంభీరత, ముఖంలో సంతృప్తి గోచరమవుతున్నవి. అదంతా బద

రీకి ఇంద్రజాలమహేంద్రజాలంవలె వుంది. తనబలహీనశక్తులు విజృంభించాయి. అనిపిస్తోంది. ఆమె తిరిగి అందుకుంది.

"ఆవిషయం మాకు తెలియకపోలేదు నాయనా! కాని ప్రేమ కొంచెం పెంకిఘటం. పట్టినపట్టు విడవదు సరిగదా, అది నెగ్గేవరకు వూపిరాడనీయదు. ఆచార్య విజ్ఞానందులు ఓసారి యిక్కడకురావటం జరిగింది. తనకు చిత్రలేఖనంఅంటే ఎంతో ఆసక్తి అనీ, నేర్చుకోదలచాననీ ప్రేమ వారితో అన్నది. కాని, విజ్ఞానందులు అంగీకరించలేదు మొదట. చివరకు ప్రేమ తన పంతమే నెగ్గించుకొన్నది."

"అందరూ మగాళ్లే వుండే సంఘారామంలో తానొక్కతే ఎలావుండగలదో మీరూహించారా ?" అన్నాడు బదరీ.

"అమ్మాయిది కుర్రతనం. తనూ మగాడివేషంవేసుకుని, నిజంగా మగవాడినేనని భ్రమసిపోతుంది. వేషంమార్చుకుని ఓ ఆడది వారిమధ్యనేవుందని, చాలాకాలం ఎవరూ పసిగట్టనేలేదు సుమా! కాని, చివరకు ఎలాగో తెలిసింది. అయినా, వాళ్ళకేమీ అభ్యంతరాలున్నట్లు అగుపడలేదు. పైగా ప్రేమఅంటే వాళ్లందరికీ ఎంతో ఆపేక్ష. వాళ్ళల్లో ఒకరుగా మారిపోయింది. అందులోను యతులు ఎవరి ధ్యానంలో వారుంటారేమో, ఎవరిపనుల్లో వారు మునిగి వుంటారేమో, దీనివిషయం ఎవరూ పట్టించుకోరు."

"అయితే మీాయిష్టంగూడా అదేనన్నమాట. ఆమె అక్కడవుండటానికి మీాకేమీా అభ్యంతరంలేదన్నమాట ?"

"దానికి అజంతాఅంటే ఎంతమక్కువో! అదివొదిలి తాను బ్రతకలేనంటుంది. అక్కడే ఆ కళారాధనలో చనిపోతా నంటుంది. అందుకనే వొప్పుకున్నాం. కాదంటే, అడవిలో పుష్పంలా ఎండి, వడలి, రాలిపోతుందన్న భయం. ఆనందంలేని జీవితం నిజానికి అంతేగా. జీవితం క్షణికం. అలాంటప్పుడు ఏవో నిబంధనలుపెట్టి, ప్రేమను బాధించటం ఇష్టంలేదు. అందుకే వొప్పుకున్నాం.

* * * *

ఒకనిముషంసేపు ఏకాంతంగా గడిపాడు. ఓ అందమైన అమ్మాయి లోపలకొచ్చింది: షోడశవర్షప్రాయం. మిడిసి పడేయవ్వనం. బ్రహ్మ తనచాతుర్యాన్నంతా వినియోగించి ప్రపంచంలో లభ్యమయ్యే సువర్ణాన్నంతా ప్రోగుచేసి, ముద్ద చేసి, ఆమెను తయారుచేశాడా అనిపిస్తుంది. ఆమె సౌందర్య రాశి. ఆమెనుచూడగానే బదరీకి కడుపులోగాలంవేసి సౌందర్యతృష్ణను రేపి, వెలికిలాగినట్లయింది. కళ్ళు ఆనంద పరవశత్వంతో మెరిశాయి. అతనిలోని పురుషత్వాన్ని మరొక సారి సవాల్‌చేసింది ఆమెరూపం, యవ్వనం, సౌష్టవం. ఆమె ఓ స్వప్నసుందరి. కాని నిజానికి ఆమె బదరీముందు సాక్షాత్క రించిన మానవతి.

బదరీ ఆమెవేపు కన్నార్పకుండా ఓ క్షణంసేపు చూచాడు. ప్రేమతల్లి అది గమనించకపోలేదు. గమనించి, మందహాసంచేయకనూపోలేదు.

"మా రెండోఅమ్మాయి కమల" అన్నది ఆమె అతని అనుమానాన్నితొలగిస్తూ.

"ఈమెగూడా చిత్రకారిణియేనా ?"

"ఊహుఁ, కమల మంచి గాయకురాలు. బాగా పాడుతుంది. నృత్యంచేస్తుంది"

"వీళ్ళిద్దరేనా ?"

"ఆఁ, యిద్దరు చాలరూ ?"

బదరీ హఠాత్తుగా లేచాడు. ఏదో స్ఫురించింది.

"వస్తాను. ఇంతతొందరగా వెడుతున్నందుకు క్షమించండి."

"నువ్వెప్పుడైనా రావచ్చు. అభ్యంతరంలేదు. మీ విషయం ప్రేమ చెప్పింది. ఇంకొంచెంసేపు వుండకూడదూ ?"

ఇంతవరకు కూర్చుని చూస్తున్న గృహస్థు నోరుకదిపాడు. బదరీ ఆశ్చర్యంతో చూచాడు.

"నీవు ఉజ్జయినినుండికదూ వచ్చింది ? అనే ప్రేమ చెప్పింది. నువ్వు రఘునాథ్‌ని ఎరుగుదువా ?"

'ఓ బాగా తెలుసు. వారే అక్కడ నిర్మాణాధ్యక్షులు. గొప్ప శిల్పాచార్యులు కూడా. పథకాలువెయ్యటంలో పెద్దచేయి."

"అతనంటే నీ కిష్టమేననుకుంటాను "

"ఎవరికిష్టంవుండదు అలాంటివారంటే? చాలా సహృదయుడు, సరసుడు, మంచివాడుకూడా. ఎప్పుడైనా మనస్సు చీకాకుగా వుంటే, వారిదగ్గరకే వెళ్లేవాణ్ణి. విచారాన్ని నిముషంలో మటుమాయంచేసేవారు. మీకు తెలుసా రఘునాథ్."

"అతను నా ప్రాణస్నేహితుడు. బహుశా, నాకున్న ఒకే ఒక్క స్నేహితుడే నేమో !"

బదరీ తనముందున్న నిండువిగ్రహాన్ని మరోకసారి పరిశీలనగాచూచాడు. నెమ్మదిగా అనుమానంగా అడిగాడు.

"అయితే మీరు...మీపేరు—రామగుప్త...?"

"అవును, నేనే రామగుప్తను."

"మిమ్మల్ని గురించి అనేకవిషయాలు చెప్పేవారు. వారి కెప్పుడూ మీస్మరణే. మీరు దూరంకావటంవల్ల జీవితంలో ఎంతో కోల్పోయాడనుకుంటాను. అదే ఆయన మాటల్లో వ్యక్తమయ్యేది. మీరిక్కడవున్నట్లు వారికి తెలియదు గదూ? అవును, అలాగే చెబుతూండేవారు."

"నిజంగానే నాడునికి ఆశ్చర్యాన్ని కలిగించేవుంటుంది." అనుకున్నాడు రామగుప్త.

'నిట్టూర్చి, అటూయిటూ పచార్లుచేశాడు. కొంచెం సేపు. కిటికీదగ్గరగా వెళ్ళాడు. అక్కణ్ణుంచి చూస్తే బాహ్యప్రపంచం, అక్కడిసౌందర్యం దృగ్గోచరమవుతుంది. పచ్చని తోట నల్లనిఆకాశంక్రింద ముసుగుకప్పుకున్నట్లుంది. గది లోంచి బయటపడుతోన్న దీపపువెలుగు మినహా, మరోరకమైన వెలుతురుగానీ, కాంతిగానీ లే దక్కడ. భావనాప్రపంచంలో తేలిపోతూ, ఆలోచనాతరంగాల్లో కదలిపోతున్నట్లు అవుపించాడు......

*　　*　　*　　*

యథార్థంగా రామగుప్త రఘునాధ్ లిద్దరూ రక్త సంబంధీకులు కాకపోయినా, ఆత్మీయులే. ప్రాణమిత్రులు. ఒకరియెడఒకరికి పూజ్యభావం వుండే. రఘు భవననిర్మాణశిల్పి, గొప్ప యోధుడునైన హరిసేన్ కొడుకు. రఘు తండ్రివద్దనేవుండి,

రెండు యుద్ధాల్లో పోరాడి, అటు తండ్రికి, యిటు ఉజ్జయినికి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించాడు. అదే అతనిగౌరవానికి కారణం. ఉజ్జయినీప్రభువు రఘును ఆదరసత్కారాలతో ఎంతగానో ప్రేమించాడు. యువలోకంలో సింహకిశోరంగా పరిగణించబడ్డాడు రఘు. కాని, రఘుకి ఈ కీర్తి ప్రతిష్ఠలంటే ఆవగింజంత యినా లెక్కలేదు. మమకారం లేదు. యుద్ధాలవల్ల ఆర్జించినకీర్తి అతనికి విలువగా అవుపించలేదు. పజయోత్సవాల్లో పాల్గొన్నా, అతనిమనస్సుమాత్రం అన్యథా వుంది; అతని మనస్సు దేన్నో వాంఛించింది. యుద్ధాలంటే తగని అసహ్యం వేసింది. యుద్ధాలవల్ల ప్రయోజనం కనుపించలే దతనికి. రణరంగాలు లేకుండా, రక్తంస్రవించకుండా శాంతిసాధించే మార్గాలే లేవా అనేబాధ అతన్ని పీడించసాగింది. యుద్ధాలు కొనితెచ్చేది వినాశనం. రక్తప్రవాహాలు, రణరంగాలు మానవులు పరికోరి ఎందుకు తెచ్చుకుంటారో అతనికి అర్థంకావటం లేదు. తాను శిల్పి, నిర్మాత. తనఆశయానికి ధ్యేయానికి విరుద్ధంగా యుద్ధంకల్గించేది విచ్ఛిత్తి, వినాశనం, ఇళ్ళకునిప్పెట్టడం, పడగొట్టడం, మారణహోమం, కత్తులు, విల్లంబులు, బరిసెలు, కటార్లు వీటిఉపయోగం తలుచుకుంటేనే గుండెబేజారెత్తిపోతోంది. తిరిగి యుద్ధరంగంలో కాలుమోపనని ప్రతిజ్ఞ చేశాడు రఘు. అందువల్లనే, విరక్తితో, నిర్వేదంతో శిల్పాచార్య చంద్రదేవునిసందర్శించాడు. చంద్రదేవునిసాన్నిధ్యంలో, ఆయన ఆచార్యత్వంలో, కళాసేవలో తాను తరించగలనని నమ్మాడు.

రఘునాథ్ అలా శిల్పాశ్రమంచేరటం అతనితల్లి దండ్రుల్ని ఆశ్చర్యపులకాంకితుల్ని చేసింది. చంద్రదేవుని శిల్ప బోధతో జీవితం ధన్యమవుతుందని ఆశించారు. ఉజ్జయినీ రాజ ప్రాసాదంలో ఆశ్చర్యపడనివారు లేరు. అందరిఅచ్చెరువుకు తగి నట్లే అనతికాలంలోనే అత నో సుప్రసిద్ధ శిల్పిగా తయా రయ్యాడు. నిర్మాణచాతుర్యం అలవరుచుకొన్నాడు. నిర్మా తగా జీవితం ప్రారంభించాడు. కొత్త కొత్త పద్ధతులతో, అలం కారాలతో భవనాలను, కట్టడాలను తయారుచేశాడు. అతను నిర్మించిన ప్రతీఒక్కదానిలో కొత్తదనమేకాక, ఆనందం, ఆశ్చర్యం పొందుపరచేవిగా తయారైనయ్. తొందరలోనే పేరుబడ్డశిల్పి అయ్యాడు రఘు. పతాకస్థాయినందుకున్న అతని కీర్తిలతలు ఉజ్జయినిలోనే కుసుమించనారంభించినవి.

అప్పుడే అతనిలో ప్రేమబీజాలు మొలకెత్తినవి. ప్రేమిం చటం నేర్చుకున్నాడు. ప్రమీలజను ప్రేమించాడు. స్వప్న సదృశసౌందర్యరాశి ప్రమీల. నక్షత్రాలవంటికళ్లు. దరహాసం చిందించేపెదాలు, చిన్ననోరు, పల్చనిపలువరస ఆమెకు శోభ చేకూర్చాయి. ఉజ్జయినీరాజ్యంలోనే ఆమెనుమించినఅందగత్తె లేదేమో! ప్రమీలజ కలవారిబిడ్డ కావటంవల్ల అల్లారు ముద్దుగా పెరిగి, ఆమెసౌందర్యానికి, నవయవ్వనానికి సొకు మార్యంతోడైనవి. సుదర్శన్ రాజవంశీయుడే. ఆస్థానంలో ముఖ్యపాత్రధారి సుదర్శన్‌కుమార్తె గనుక, ప్రమీలజ అందరి కంటికి ఇంపుగా, సొంపుగా అవుపించటంలో ఆశ్చర్యంలేదు. సుదర్శన్ రాజవంశీయుడు కానటంవల్లను, బలవంతుడు, సద్గుణ వంతుడు కావటంవల్లను కొంతమందికి కంటకంగావున్నమాట

వాస్తవమే. అయినా, అతనికూతురు ప్రమీలజ అందరిదృష్టి నాకర్షించింది.

అనేకమంది ప్రమీలజప్రేమఫలాన్ని పొందాలని ఆశించారు. సుదర్శనను అనుకూలుడనుచేసికో ప్రయత్నించారు. కాని, అతను అయోగ్యుడైనవారికి తనకుమార్తెను అందాల రాశి ప్రమీలజ నిచ్చిచేయగలడా? అసంభవం. అతని సమాధానాలు విని, అందరూ నిస్పృహచెందారు. ప్రతి ఒక్కరూ అతనిముందా ప్రసక్తి తేవటానికి భయపడేవారు అయినా, యువకులప్రయత్నాలు ప్రమీలజసఖ్యతకోసంగానీ, సుదర్శన్ ప్రాపకంకోసం కాదుగా. అదేభావంతో అనేకులు అతన్ని సమీపించినమాట నిజమే. వారికోరికలు తిరస్కరింప బడినమాటా వాస్తవమే. ఎవరికీ ఏవిధమైన అవకాశము లేక పోయింది.

రఘు యిదంతా చూస్తూనేవున్నాడు. అంతా తెలుసు అతనికి. ప్రమీలజ అనేకసార్లు కోవెలకు వెళ్ళటం అతను చూచాడు. ఆ దర్శనమే అతన్ని ఆమెవైపు మళ్ళించింది. ఆమెకోసం పరితపించాడు. ఏ యువకహృదయం ప్రమీలజవంటి అందాల ప్రోవును చూచి మోహించదు? అలాగే రఘు ఒక ప్రేమ తపస్వి అయినాడు. ఆమె సాక్షాత్కారంకోసం రోజులతరబడి తపించాడు. ఆమెపొందు తనకు లభించగలదనే ఆశించాడు. రఘు ఏవిధంగానూ ఎవరికీ తీసిపోడు. సుదర్శన్ రాజవంశీయుడే కావచ్చు. ప్రమీలజ సౌందర్యరాణి కావచ్చు. రఘుమాత్రం తక్కువవాడా! అతనికీ రాజాస్థానంలో గొప్పగౌరవం వుంది. అతను వాంఛిస్తే నిరసించేవారు ఉజ్జయినిలో ఏ ఒకరిద్దరో

ఫుంటారేమో! కనుకనే తాను ప్రమీలజను వాంఛించటంలో తప్పుచేయలేదనుకున్నాడు.

ఒకనాటి ప్రభాతసమయాన రఘు నిద్రలేచేసరికి అశనిపాతంలాంటివార్త అతని చెవినిబడ్డది. నగరమంతా ఆ దేవార్తతో ఉడికిపోతున్నట్లు గ్రహించాడు. ఆ ఘోరవార్త వినేసరికి రఘు గుండె లాగి, హృదయం ఘనీభవించినట్లైంది. ప్రమీలజ కనిపించటంలేదు. అర్ధరాత్రి మాయమైంది – ఎవరితోనో అర్ధరాత్రి...వినలేకపోయాడు. నిజమా కలా అనే భ్రమకల్గింది. యోధులు, రాజభటులు నలువేపులకు శరవేగంతో బయల్దేరటంవల్ల, రాజప్రకటనలవల్ల, సుదర్శన్ ఆరాటంవల్ల నిజమేననిపించింది. ప్రమీలజ ఎక్కడవున్నా ప్రాణాలతో బంధించి, తీసుకురావలసినదన్న రాజాజ్ఞ పట్టణమంతట ప్రాకింది. గూఢచారులు మారువేషాల్లో బయల్దేరారు. ఒక్క సుదర్శన్‌మాత్రం కుంచించుకుపోయి, నిస్పృహాత్తో, హతాశుడుగా అగుపిస్తున్నాడు. మిగతవారంతా ప్రమీలజను కనుగొనేనిమిత్తం హడావిడిపడుతున్నారు. వార్తలు, కారణాలు, జరిగినదాన్ని గూర్చి చిలవలుపలవలతో పలువిధాలుగా చెప్పుకుంటున్నారు.

ఆ వార్త రఘు నెత్తిమీద అశనిపాతమైంది. జీవితంలో తను ప్రేమించింది. ఒక్క ప్రమీలజనే. ఆ సంఘటనతో ప్రేమించి, విఫలుడై విలపించేకన్న, అసలు ప్రేమించకపోవటమే మంచిదేమోనని భ్రాంతిచెందాడు. నిశ్చేతనుడు, నిర్వ్యాపారుడు అయినాడు. రోజులుగడచినకొలది, అలా విలపించడంవల్ల ప్రయోజనంలేదని గ్రహించాడు. పోయినప్రమీలజ తిరిగిరాదు. వస్తుందన్న ఆశ, అవకాశాలు లేవు. ముక్కలు చెక్క

లుగా వ్రయ్యలైన హృదయాన్ని అతుకులబొంతగా తయారు చేసుకుని, సువర్ణపుపూతన్వూసుకున్నాడు. ఇంక ఆమెకోసం తల బ్రద్దలుకొట్టుకోవటం అనవసరమని తీర్మానించుకున్నాడు. తాను ప్రమీలాజను ప్రేమించినమాట వాస్తవం. కాని ఆమె తనను ప్రేమించలేదుగదా! కనీసం తా నామెనువాంఛిస్తున్నట్టు ఆమెకు తెలియదుగదా, తెలిస్తే తనకే ఆ అదృష్టంపట్టి వుండునేమో! ఇప్పుడన్నీ వ్యర్థపుప్రూహాలు. చెయిజారి, రత్నం సముద్రంలోవడ్డది. దాన్ని తిరిగి సేకరించటం అసంభవం. ఈ ఊహాలతో ఓ కొత్త భావనాజగత్తు నిర్మించుకున్నాడు. కొన్నాళ్ళుగా స్వస్తిచెప్పిన తన లౌకికకార్యాలు చేయనారభించాడు. తిరిగి తాను కోల్పోయినప్రతిష్ఠను పునః స్థాపించుకోవాలి. అజేయుడుగా కీర్తి ప్రతిష్ఠలతో జీవించాలి. అదే తాను జీవితంలో సాధించవలసింది, సాధించదగింది కూడా. ఈ ప్రేమలు, వాంఛలు బుద్బుదాలు. ఒక్క కళాసృష్టిరే శాశ్వతానందాన్నివ్వగలదు. విశ్రాంతిభవనాలు, ఉద్యానాలు, అంతఃపురాలు, సరస్సులు, స్తూపాలు అనేకం ఉజ్వలంగా నిర్మించాడు. రాళ్ళతో మలచి, రత్నగిరుల్ని సృష్టించాడు. నూతన కృషితో ఉజ్జయిని వినూత్నశోభలను కూర్చుకున్నది. పరదేశీయులకు యాత్రీకులకు కళాతీర్థంగా పరిణమించింది నగరం.

సంవత్సరాలు గడచిపోతున్నాయి. రఘు పూర్తిగా ప్రమీలాజను విస్మరించాడు. కాలం అలా అతనిచేత చేయించింది. అతడు ఆజన్మబ్రహ్మచారిగా వుండిపోయాడు. తిరిగి ఎప్పుడూ ప్రేమనుగురించిగానీ, వివాహాన్నిగురించిగానీ ఆలోచించలేదు. అస్ఖలితబ్రహ్మచర్యంవల్ల అతనిలో నూత్నకాంతి

ప్రస్ఫుటమైంది. సౌందర్యం వర్థిల్లింది. నగరంలోని యువకులు, కళారాధకులు ప్రతివారం వందలకొలదీ అతనిదర్శనార్థం వచ్చేవారు. అతనిసలహాలు అమూల్యంగా ప్రసాదంగా స్వీకరించేవారు. సరసుడు, చతురుడు, వాక్ప్రతిభ కలవాడు, విజ్ఞానవంతుడు అవటంవల్ల ఆతనిసలహాలు యువకళారాధకులకు ఎంతో ఉపయుక్తమయ్యేవి. ఒకనాడు అతనిలో రేగిన తుపాను ఈనాడెవరూ గుర్తించలేరు. కనీసం వాటి ఛాయలైనా అతనిలో యిప్పుడు లేవు.

రఘుజీవితచరిత్రలో అంతటి విషాదఘట్టం జరిగినా, అతను నిత్యయవ్వనుడుగనే కనుపించేవాడు. ఆరోగ్యం. బలం అతని కధీనములు. కోటగోడలను దాటి, నగరానికిదూరంగా వాహ్యాళికి వెళ్తూండేవాడు అప్పుడప్పుడు. పర్వతప్రాంతాలలో నిలబడి, కొండలపై అస్తమించే సూర్యుణ్ణి, ఎర్రగామండిపోతున్నట్టుండే మేఘాలను, పరిసరదృశ్యాలను చూచి, విశ్వశిల్పిలో ఎంతటిశక్తి వున్నదా అని ఆశ్చర్యపడేవాడు. భగవంతుడు ఓ మహాశిల్పి. ఆయన సృష్టించిన ఈ విశాల అగోచర, చరాచరప్రపంచం ఒక రమణీయశిల్పమందిరం. ఆ మందిర సౌందరనందాన్ని కని, తన్మయత్వంచెందే కళాహృదయం రఘుది అప్పుడు.

ప్రమీలజ మాయమై పదిసంవత్సరాలయింది. ఆమె విషయం ఇప్పు డెక్కువమందికి తెలియదు. తెలిసినా ఏ కొద్దిమందికో మాత్రమే. కాలభ్రమణంలో ఎవరు ఎవరో, ఎవరు ముందో ఎవరు వెనకో! ఆమెను ఎవరు తస్కరించిందీ, ఏంచేసిందీ ఎవరికీ తెలియదు. అస లిప్పటికి సజీవియో, హతజీవియో

కూడా తెలియదు. ఆమెనుగాని, ఆమె ప్రియుణ్ని గానీ ఎవరూ చూళ్ళేదు. సుదర్శన్ కూతుర్ని తిరిగి చూడగలననే ఆశలేక గుండెపగిలి చనిపోయాడు. తనవృద్ధాప్యంలో తన కీ విషాదం కలిగించిన ఆ మహామేయుని మనస్సులోనే స్మరించి, తనకు తగినశిక్ష లభించిందనే సంతృప్తితో తనువుచాలించాడు ఆ అభాగ్యుడు. అయినా ప్రమీలాలజజాడ లెవరికీ తెలియవు. తండ్రిమరణవార్త ఆమె విన్నదో లేదో! విన్నా ఏంప్రయోజనం?

ఒకనాటిఉదయం రఘు వనవిహారానికి బయల్దేరాడు. అది వసంతరుతువు కావటంవల్ల, చెట్లన్నీ పచ్చగా కొత్త చిగుళ్లుతొడిగినై. విశాలమైనపచ్చికబయళ్లు శోభాయమానంగా వుండి, అరణ్యాలకు అలంకారప్రాయమైనయ్. ప్రశాంతిని అనుభవిస్తూ, చాలాదూరం వాహ్యాళికి వెళ్ళాడు. దోవ డొంక తెలీని ప్రదేశం అది. అక్కడనుండి ఎటుపోవాలో ఎటువెడితే నగరవీథులు అగుపిస్తాయో తెలియదు. అంతా నిర్మానుష్యం.

తను చూచేది యథార్థమని నమ్మకం కలుగలేదు. లేకుంటే ఆప్రదేశంలో ఆ ఆమ్మాయి కనిపించటానికి కారణం? ఏడేళ్లుంటాయి. తేనెటీగవెంట పరుగెత్తి పట్టుకోబోతుంది. ఆశ్చర్యంతో అలా నిలబడి చూచాడు. తేనెటీగ కసిదీర కరచి, తుర్రునపారిపోయింది. అయినా, ఆ అమ్మాయి. ఏడవ లేదు. నొప్పి వేసేవుంటుంది. ఓదార్చేవారుంటేగా ఏడ్పువచ్చేది! అక్కడే కూలబడి మోకాలిమీదిబొబ్బను సవరించుకుంది. లేచి వెళ్ళబోయింది. పాపం! నొప్పి ఎక్కువై వుంటుంది. ఇస్సో అంటూ మళ్లీ కూర్చుండిపోయింది. మోకాలిమీది

బొబ్బను తడిచేసి, నోటితో వూదుకోటం ప్రారంభించింది. కొంతసేపు అలాగేవుండి, తర్వాత లేచి వెళ్ళిపోయింది.

ఆ అమ్మాయిచేష్టకు రఘు ఆశ్చర్యపడ్డాడు. అమ్మాయి ఏ వనదేవతో అనేభావం అతనిలో అంకురించింది. కాకపోతే ఆ వనాంతరంలో ఎలావుండగలుగుతుంది. ? కొంతదూరం ఆ అమ్మాయివెంట నడిచాడు. అతని ఆశ్చర్యాన్ని యినుమడించేట్లు మరో అమ్మాయి - అయిదేళ్ళ వయసుంటుంది - అగుపించింది. మొదట తేనేటీగపోటుతో బాధపడుతున్న అమ్మాయిదగ్గర కొచ్చి ఓదార్చింది - అంత కన్నా ఏంచేయగలదు ? చేయిపట్టుకుని, నడిపించుకుపోతోంది. రెండునిమిషాల్లో యిద్దరు ఓ చిన్న ఇంటిముందు కొచ్చారు. అది యిల్లుగాదు. పర్ణశాల. మన మునులు పూర్వం నివాస యోగ్యంచేసుకునేవారు అలాంటిపర్ణశాలల్ని. అస లక్కడ అలాంటిపర్ణశాల వుందనికూడా రఘు ఎప్పుడూ వూహించ లేదు. చిన్నపిల్ల గుమ్మంముందు నిలబడి, అన్నది "అమ్మా ! ప్రేమకు దెబ్బతగిలింది. ఏదో కరచిందే !"

ఆ కేకతో తల్లి బయటకు వచ్చింది. ఆ పిల్లలతల్లి - ఓ దేవతలా వుంది. ఏ శాపవశానో ఈ అరణ్యంలో అజ్ఞాతవాసం చేస్తున్న అప్సరసయేమో ! రఘు ఆమెను చూచాడు. చూచి పులకించాడు. తెరచిననోరు తెరచినట్లే వుండిపోయింది. కను రెప్పలు తిరిగి మూతపడలేదు. తనకళ్లను తానే నమ్మలేక పోయినాడు. తనముందు తనకలలు ఫలించినాయా అన్నట్లు ప్రమీలజ సాక్షాత్కరించింది. నిజం. తనది కాదు, ఎవరిదో యిప్పుడు - ప్రమీలజ, ఒకక్షణంలో ప్రేమను లోపలకు

తీసుకువెళ్ళి, తిరిగి బయటకు వచ్చి, చంకను బిందె పెట్టుకుని, వొయ్యారాలొలకబోస్తూ, నదివైపు నడచివెళ్ళింది. అబ్బ! ఏమిసౌందర్యం! నిర్జనారణ్యంలో ఓ సౌందర్యరాశి, అప్సరస లనుమించిన అందగత్తె చంకను బిందె పెట్టుకుని, మందగమ నంతో నదీలోయలో నడుస్తుంటే, ప్రక్కన చెట్లు, గాడ్పు, పొదలు పలుకరిస్తుంటే, రఘుహృదయంలో సౌందర్య తృష్ణ పెల్లుబికింది. తాను నిజంగా అదృష్టహీనుడు. చేజేతులా అవకాశాన్ని వినియోగించుకోలేక, పిరికివాడై, ఈనాడు కుమిలి పోతున్నాడు.

* * * *

ఏంచేయాలో రఘుకి తోచలేదు. కొంతసేపు అలాగే నిలబడి, ఆ పసిపాపలను, తల్లినిగూర్చి, వాళ్ళు ఎవరైవుంటారా అని ఆశ్చర్యపడ్డాడు. ఆట్టేసేపు ఆలోచించకముందే అను మానం తీరిపోయింది. ఆజానుబాహుడైన ఒకవ్యక్తి విల్లంబుల పొది భుజానవేసుకుని, ఒక లేడిని మోసుకురావటం అవు పించింది. అతను అడివిమనిషి కాదు. ఆకారం అలావున్నా. అది అతనిజీవనం అయినా, అతనొకప్పుడు మంచి సంపన్న కుటుంబీకుడని చూడగానే తెలిసిపోతుంది. మంచి స్ఫురద్రూపి, బలిష్టుడు, వయస్కుడు అయిన అతన్ని రఘు చూపుతోనే ప్రేమించాడు.

రఘు ఎంత ఆలోచించినా అతనెవరై వుంటాడో అతని బుర్రకు తట్టలేదు. అతన్నెప్పుడూ, ఎక్కడా చూడలేదు. బహుశా, ఉజ్జయినీవాసి కాదేమో! అయినట్లయితే, తా నాతని గుర్తించగలిగేవాడే! అంత నిండైనవిగ్రహానికి ఉజ్జయిని

నోచుకోలేదు. అతనే ఉజ్జయినిని నోచుకోలేదు, అతనే ఉజ్జయినివాసి అయినట్లయితే ఏ రాజోద్యోగంలోనో వుండేవాడే. అలాంటివారిని గౌరవించటం అక్కడిరాజమర్యాద.

చెట్టునీడను నిలబడి, చూడాలని అత నెంచేస్తాడో ఉబలాటపడుతున్నాడు. మరుక్షణంలోనే తననిశ్చయాన్ని మార్చుకున్నాడు. ఆ యింటికి వెళితే బావుండుననిపించింది. తాను కొత్తవాడు, వారు గుర్తించరు, ఆకలివేస్తోంది కూడా. వెళ్ళి పరదేశినని, ఆకలిదప్పులుగొన్నానని, ఆతిధ్యమిప్పించమని అడిగితే సరి. అక్కడ కొంతసేపు విశ్రమించనూవచ్చు, వారి చరిత్ర తెలుసుకోనూవచ్చు. రెండువిధాలుగాను ఉపయోగమవుతుంది.

పిల్లలిద్దరూ ఈఅభ్యాగతుని చూచి, అరుస్తూ ఇంట్లోకి పరుగెత్తారు. ప్రమీలజ, ఆమెభర్త బయటకు వచ్చారు. అతనెవరో శత్రుపక్షంవాడనీ, తమకు అపకారం చేయడానికీ వచ్చాడనీ భావించి, పోరాటానికి సిద్ధంగా బయటికి వొచ్చారు.

రఘు వారికి అభివందనంచేశాడు. వారు తిరిగి అభివందనంచేశారు. అయినా, వారికళ్లల్లో అనుమానం తొలగిపోలేదు. రఘు తనరాకకు కారణం తెలియజేశాడు వినమ్రంగా. రఘుకి ఆతిధ్యమివ్వడానికి వారెంతో సంతోషించారు. తమకలాంటి అదృష్టంకలగటం ఎంతో సంతోషదాయకం అనుకున్నారు.

ప్రమీలజ అతన్ని గుర్తించిందేమో. తెలియదు. గుర్తించినా వ్యక్తంచేయలేనిభావాలు ఆమెలో నిబిడీకృతమైనా

యేమో! ప్రమీలజ వంటప్రయత్నంలో వున్నది. వీరిద్దరు సంభాషణలోకిదిగారు.

"నన్ను రఘునాథ్ అంటారు." అని రఘు చెప్పాడు, మౌనాన్ని ఛేదిస్తూ.

"మిమ్మల్ని గురించి విన్నాను. మీరు శిల్పులుకదూ! మీరు చక్కని భవనాలు నిర్మిస్తారని తెలిసింది!"

"అవును, అదే నే చేయగలిగింది. నా జీవితోపలంబనం అదే" ఆ గృహస్థు మందహాసంచేసి అన్నాడు – "నాపేరు రామగుప్త. నాగురించి యిక్కడ ఎవరికీ తెలియదనుకుంటాను. అంగరాజ్యానికియువరాజుని ఒకప్పుడు. ఇప్పుడో వనమాలిని."

"ఎందువల్ల యిలా మారారు?"

"అందతా ఓ మహాగాథ. నేను రాజ్యానికిరావాలని, మహారాజును సింహాసనానికిదూరంచేయాలని యత్నించాను.

"దాదాపు పనిఅంతా పూర్తయింది. నేడో రేపో మహారాజు సింహాసనాన్ని అధిష్ఠిస్తాననుకుంటున్నప్పుడు ఒక విచిత్రం జరిగింది. ఒక సన్యాసిని కలుసుకోవటం తటస్థించింది. అప్పుడే నాలో పరివర్తనకలిగింది. అతను నన్ను పూర్తిగా మార్చివేశాడు. మానవమహత్వం ఒక్కటేనని, రాజ్యకాంక్ష అవివేకమని బోధించాడు. జీవితపరమార్థం అంటే ఏమిటో, ఆత్మసాక్షాత్కారంపొంది, ఎలా తరించాలో తెలియచెప్పాడు. అంతటి బలవంతుణ్నే, రాజ్యాన్ని క్షణంలో వశపరుచుకోగలిగినవాణ్ణే మారిపోయాను. ఏదో అనిర్వచనీయమైన భయం నన్ను ఆవేశించింది. ఆ భయంతో వాణికిపోయాను. నా కుట్ర పటాపంచలైంది. దూరంగాపోయి, ఏకాంతంగా బ్రతుకనిశ్చయించను

కున్నాను. ఆత్మసాక్షాత్కారం పొందాలని కాంక్షించాను. యిలా వొచ్చేశాను"

"మీరు చాలాకాలంనుండి యిక్కడ వున్నారనుకుంటాను ?"

"ఓ, చాలాకాలం. దాదాపు పదిసంవత్సరాలు. ఇక్కణ్ణించికూడా వెళ్ళిపోయేవాణ్ణే. ఇక్కడ బాగానే వుంది. ప్రశాంతంగావుంది. కాని, సురక్షితంగాలేదు ఎప్పుడూ రాజభటులు వస్తుంటారు. దొంగలబాధ ఎక్కువ. రాజభటులు నా భార్యను బంధించి తీసుకువెళ్ళ ప్రయత్నించేవారు. అలాంటి వారిని యిద్దర్ని చంపివేశాను. దొంగలతో అనేకసార్లు పోట్లాడవలసివచ్చింది. ఇప్పుడు ఎవరూ రారు. అందరికీ భయం ఏర్పడ్డది నేనంటే."

అంటూ సంభాషిస్తోంటే, ఇద్దరిమధ్య ఆత్మీయత ఏర్పడింది. ఒకరికొకరు కొత్తవారనేభావం పోయింది. ఎంతో ఆత్మీయులుగా మారిపోయారు. భోజనంచేసి, అడవిలో అనేక ప్రదేశాలు తిరిగారు. అనేకం చూచారు.

ఇప్పుడు రఘు ప్రతిరోజు అక్కడికి వస్తున్నాడు. ఇద్దరూ ప్రాణస్నేహితులుకావటంవల్ల ఒకరినివదలిఒకరు ఒక్కరోజుకూడా వుండలేకపోతున్నారు. పిల్లలిద్దరూ అతనికి మాలిమిఅయినారు. రఘు గుర్రందిగగానే అతనికాళ్లకు చుట్టుకునేవారు. గుర్రం మీదస్వారిచేయించమని అడిగేవారు. ప్రమీలజకు అతను సోదరుడు. తనకుసోదరప్రేమ లభించిందనిసంతోషించింది. కాని, ఆమెకు తెలీదు రఘు ఒకప్పుడు తన్ను ప్రేమించాడని, తనకోసం ఉపవాసాలుచేశాడనీ. ఆవిషయం రఘుఎప్పుడూ బయట

పెట్టలేదు. ఆమె మందహాసాలు, ప్రసంగాలు రఘుని ఏలోకా లకో తీసుకు వెళ్ళేవి. తనహృదయాన్ని విప్పి ఆ ఆనందానికి దూరంకాలేదు రఘు.

* * * *

రఘునాథ్ రామగుప్త లిద్దరూ ఆత్మీయులైనారు. వారిప్పుడు ప్రాణమిత్రులు. ప్రపంచంలోని అన్ని విషయాలను గురించి వారిసంభాషణ. తమనుగురించి, తమధ్యేయాన్ని గురించి విచారణలు. అలాంటి సమయంలోనే ఒకసారి రామగుప్త తన జీవితాన్ని గురించి, తనప్రేమవివాహాన్ని గురించి రఘుకి చెప్పాడు. నిజంగానే అతనిది ప్రేమమయజీవితం.

దాన్ని గురించి వినటానికి రఘుకి ఆసక్తిలేకపోలేదు.

"జీవితంలో ధైర్యం అవసరం రఘూ. ఎవరు ఎక్కువ ధైర్యం ప్రదర్శించగలరో వారే ఫలితాన్ని పొందగలుగుతారు. అది అదృష్టమంటే" రామగుప్త తననుగురించి చెప్పుకు పోతున్నాడు.

"ఇక్కడ ఎలాంటి ఒంటరిజీవితం జీవిస్తున్నానో నీవు చూస్తూనేవున్నావుగా. భయంకరమైన ఆటవికజీవితం యిది. అడుగడుగున ప్రమాదాలే. నేను ప్రమీలాలజను ఎరుగకముందు నుండి యిక్కడే వుంటున్నాను. నిజంగా ఇక్కడిజీవితం హాయిగా ప్రశాంతంగా వుందిగదూ! తిరిగి ఎప్పుడూ అంగ రాజ్యంలో కాలుబెట్టనని ప్రతిజ్ఞచేశాను. అందుకే అక్కడికి వెళ్ళాలన్నతలంపే లేదు నాకు ఇక్కడికిరాగానే ఈప్రశాంత జీవితం ప్రారంభించగానే నా గతజీవితపుపుటలను చించివేశాను. అన్నీ మర్చిపోయాను. సత్యం, పరమార్థం, సాక్షాత్కారం-

యివే నే పొందదలచినవి. వీటికోసమే నా సుదీర్ఘ తపస్సు. నా ధ్యానం వీటిసాధనకోసమే.

అప్పుడప్పుడు యిక్కడిజీవితం విసుగనిపించేది, అలా విసిగిపోయినప్పుడు అక్కడక్కడ తిరిగేవాణ్ణి. అలా నగరంలో తిరుగుతున్నప్పుడే ప్రమీలాలజను చూడటం తటస్థించింది.

ఆమె అప్పుడే కోవెలనుంచి తిరిగివెళ్తోంది. అప్పుడు నాకళ్ళకు దేవతలాగా అగుపించింది. అపూర్వజ్ఞానసంపర్గం నాలో కలిగినట్లు ఆక్షణంలో అనిపించింది. అందుకే ఆమె వెంట పోయాను. ఎలాగో ఆరాత్రి మొండిధైర్యంతో ఆమె గదిలో ప్రవేశించాను. అర్థరాత్రి, నిశ్శబ్దం నలుమూలలా ఆవరించివుంది. ఆమె నన్నుచూచి, భయపడింది. అప్పుడు నేను ఫలానా అని చెప్పాను. అప్పుడుగానీ, ఆమెకు కొంత ధైర్యం కలుగలేదు. అప్పుడు ఆమె నన్నునమ్మినట్లు అగుపించలేదు. కాని, నాధైర్యం, పట్టుదల చూచి నమ్మింది. ఆమెను నేను ప్రేమించాను. ఆమె నా భార్యకావాలని వాంఛించాను. నాకోర్కె యిదీ అని చెప్పాను ఆమెతో. కాని అనేక అభ్యంతరాలు చెప్పింది. అన్నీ తనతండ్రివల్ల భయాలే. నాతో లేచి రమ్మన్నాను. ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోదామని చెప్పాను. తండ్రివల్ల, రాజువల్ల భయంలేకండాచేస్తా నన్నాను. ఆమె వొప్పుకోలేదు. ఏంచేయటానికి నాకు తోచలేదు. నిస్పృహతో యింటిముఖంపట్టాను.

కొన్నిరోజులతర్వాత ఒకసారి తిరిగి ఆమెనుచూడకండా వుండలేక వెళ్ళాను. అప్పటికి ఎంతో నీరసించిపోయింది. తెల్లగా పాలిపోయివుంది. ముఖంలో సంతోషరేఖలు లేవు.

నిర్వేదం ఆమెచుట్టూ అలముకొనివుంది. ఆమె స్థితి చూచి, ఎంతగానో విచారించాను.

"నీకు బాధగావుంటే యింకెప్పుడూ రాను ప్రమీలా!" అన్నాను — తిరిగి ఆమెకోసం, ఆమెను బాధించటం యిష్టంలేక.

ప్రమీల అప్పుడు భోరుభోరున ఏడ్చింది. నా కర్థం కాలేదు. మెడను గట్టిగా కావిలించుకుని నాకళ్ళలోకి దీనంగా చూస్తూ అడిగింది. "నన్ను నీతో తీసుకెళ్ళు రాం — నువ్వు లేకుండా యిక్కడ ఒక్కదాన్నే బ్రతుకలేను"

ఎంత బాధపడకపోతే స్త్రీహృదయం అలా విలపిస్తుంది!

నాగురించి, నాజీవితాన్నిగురించి చెప్పాను. అన్నిటికి అంగీకరించింది. "నీతో నరకానికి తీసుకెళ్ళు రాం. అదే స్వర్గంగా అనుభవిస్తాను." అంది. పాపం! ఆమె హృదయం ఎన్నికొండలబరువును, భారాన్ని మోస్తోందో!

తర్వాత ఆమెకోసం వెదకినసంగతి నాకు తెలుసు. ఏంచేయాలో నాకు తోచలేదు. ఇక్కణ్నించి పారిపోదామనుకున్నాం. కాని, ఎలాపోయేట్లు? కాలుకదిపితే రాజభటులు, గూఢచారులు, మాకోసం పొంచివున్నారాయె! ఇక్కడే కొండచీకుల్లో, అజ్ఞాతంగా బ్రతకటం నేర్చుకున్నాం గత్యంతరంలేక. అప్పటికీ, యిప్పటికీ యిదే మా కుటీరం. ఇదే మాఉద్యానం. మాకుమేమే నేస్తాలం.

కథఅంతా విని రఘు తలూపాడు "ఆ గొడవంతా యిప్పుడు లేదులే. అంతా చల్లారిపోయింది. యిప్పుడు

మీకోసం వెదకమన్నా ఎవరూ వెదకబోరు. మీరు సురక్షితంగా వున్నారుగా."

నిజంగా సురక్షితంగానే వున్నారు. అయినా రాంగుప్తకు మనశ్శాంతిలేదు. ఎక్కడికో ఎందుకో వెళ్ళాలని అతని ఆకాంక్ష.

అతను రఘునాధ్‌తో హృదయంవిప్పి చెప్పాడు-"ఒక నాటికి తప్పక వెళ్లిపోతాను. ఎక్కడికైనా వెళ్ళివుండాలంటే ఓ యిల్లు కావాలి. ఆ యిల్లు కట్టుకోవాలి. నాకోసం ఒక మంచియింటికి నమూనా వ్రాసియిద్దూ!"

రఘు నమూనా తయారుచేసి రాంగుప్తకు ఇచ్చాడు. అప్పటికి రఘుకి నమ్మకంలేదు వారు నిజంగా వెళ్లిపోతారని. సంవత్సరంతిరిగేలోగా ఆ పర్ణశాల ఖాళీఅయింది. కనీసం మిత్రుడైన రఘుకికూడా చెప్పకండా వెళ్లిపోయాడు రాం కుటుంబంతో సహా.

అలా పారిపోయి రాంగుప్త ఇక్కడికి ఈ అజంతా ప్రాంతాల కొచ్చాడు. ఇక్కడ మకాం వేశాడు."

* * * *

అంటూ బదరీవేపు తిరిగి మందహాసంచేశాడు. అంత సేపు అతనిమనస్సు ఏ ఆలోచనలను, భావనలను వూహిం చిందీ తెలీదు. అంతసేపు మౌనంగానే కూర్చున్నాడు. ఏమీ ప్రశ్నించలేదు. అడుగలేదు కూడాను. రాంగుప్త స్వీయజీవిత చరిత్ర వింటూ, సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయాడు.

"రఘు చాలా మంచివాడు. నే నిక్కడ వుంటున్నానని అతనికి తెలిస్తే ఎంత బావుంటుంది! అప్పుడప్పుడు అనుకుంటాను అలా తెలియకపోవటమే మంచిదేమోలెమ్మని."

"ఇక్కడ మీ రేంచేస్తుంటారు?" బదరీ అడిగాడు.

"తపస్సుచేసుకుంటాను. చదువుకుంటాను. ధ్యాన సమాధిలో ఏవో సత్యాలు దర్శిస్తాను"

బౌద్ధమతాన్ని గూర్చి ఆలోచిస్తారా?"

"ఒకమతం అని నిర్ధారణలేదు. అసలు మతాలంటే ఏమిటో నాకెందుకు? సత్యం, ధర్మం, జ్ఞానం – యివే ముఖ్యం. వాటినిసాధించే మార్గాన్ని అన్వేషిస్తున్నాను. ఇన్ని సంవత్స రాలధ్యానఫలితంగా ఇప్పుడో గ్రంథం వ్రాస్తున్నాను. అదే నే సాధించగలిగింది"

"పూర్తయిందా?"

"అవుతూఅవుతూవుంది"

"చూడవచ్చా మీ పుస్తకాన్ని?"

"అలాగే, రా వెడదాం, నాగదిలో వుంది, చూద్దువు గాని."

అది రాంగుప్త చదువుకునేగది. చాలాచిన్నది. ఎంతో ముచ్చటగా వుంది. దొంతర్లుగా అమర్చబడ్డ పుస్తకాలు అల మరనిండా. అక్కడ అనేక ప్రకృతిచిత్రాలు, తైలవర్ణాలతో ప్రేమ వ్రాసినవి – గోడలకు వ్రేలాడుతున్నాయి. అది కళ శిల్ప సాహిత్యాల సమ్మేళనం.

"గది ఎంతో బావుంది" అన్నాడు బదరీ.

రాంగుప్త తను వ్రాస్తున్న పుస్తకం బదరీకి చూపించాడు. అది వేదాంత గ్రంథం. కళాఖండం. నిగూఢతత్వదర్శిని. సత్యాన్వేషకుల కెంతో ఉపయోగకారి అది.

బదరీనారాయణ పేజీలు తిప్పుతూ, అక్కడక్కడ చదివాడు. 'సమాధి' అనే వ్యాసం ఎంతో బావుంది. రాంగుప్త దాన్ని నాలుగు విభాగాలుచేసి వ్రాశాడు. మొదటిభాగం 'ఆత్మతత్వవిచారణ'లో ఆత్మఅంటే ఏమిటి? వ్యక్తికి (నేను) ఆత్మకు సంబంధం ఏమిటి? ఎప్పుడు, ఎలా సాక్షాత్కారం కలుగుతుంది ? యివీ ముఖ్యాంశాలు. తర్వాతది ఏకత్వం - అదే ఏకాగ్రత. ఇంద్రియాలను జయించి, సమాధ్యవస్థ పొందటం. మనస్సును మహాజ్ఞానం వేపు మళ్లించటం. మూడవది దర్శనము. ధ్యానసమాధిలో మానవుడుపొందదగిన శాంతి అదే ఆనందం, పరబ్రహ్మస్వరూపం అని తెలుసుకోవీలవుతుంది. నాల్గవది విశ్వశ్రేయస్సు. విజ్ఞానియైన మానవుడు ధ్యాన, తపోసమాధిలో సంపాదించినదాన్ని మానవశ్రేయస్సు కొరకు ఎలా ఉపయోగించాలో అందు నిర్దేశించబడింది. ఈ చివరిస్థితిలో నిర్మలానందం లభిస్తుంది. ప్రకృతి ఆనందమయంగా సాక్షాత్కారమిస్తుంది.

"బాగా తరచి వ్రాశారు. మొత్తానికి"

"నీకు నచ్చిందా ?

"ఓ పూర్తిగా చదివితే, మీరుసాధించిన శాంతి, సౌఖ్యాలు ఎలా పొందగలనో తెలుస్తుంది"

"పూర్తి అయిన తర్వాత అలాగే చదువుదుగాని."

"అలాగే"

*    *    *    *

మళ్ళీ పేజీలుతిరగేశాడు. 'కళను'గురించిన వ్యాసాలు చదివాడు. కళనుగురించి, కళాప్రయోజనాన్నిగురించి ఎంతో వ్రాసివుంది. కళ మానసికానుభవం. సౌందర్యారాధనమే కళ. హృదయాన్ని కదలించి, శాశ్వతానాందాన్నిచ్చేది, హద్దులు లేనిది కళ అవుతుంది. కళ సౌందర్యాన్నే గాక, సత్యాన్నిగూడ నిక్షిప్తంచేసుకుని, లోకానికి చాటుతుంది.

ఈ విశ్వసృష్టిలో కళది మూగవేదన. అది మూగ ధ్వనుల్నివ్యక్తంచేస్తుంది. ఆత్మను ధ్యానంవేపు మళ్ళించుతుంది. కళ ఎంతో పవిత్రమైనది. మతాలకందని మతం అది. నీతులు నియమాలు వల్లించేమతం కాదు దానిది – మానవునిలో పరివర్తన కలిగించి, నిర్వాణాన్ని సుఖతరంచేయగలిగింది కళ. ఆత్మకు స్వాతంత్ర్యం కలిగించి, అనంతంలోకి దారితీస్తుంది. చక్షురింద్రియాలతోనేగాక, అదిభౌతికంగాదర్శించగలిగేశక్తిని ప్రసాదిస్తుంది కళ. మానవమేధస్సునుబట్టి, దాని జ్ఞానాన్నిబట్టి అర్థంచేసుకోగలశక్తి లభిస్తుంది.

తర్వాత కళాకారునిలక్షణాలనుగురించికూడా విపులంగా వ్రాయబడ్డది. కళాకారునికి ఉండవలసినగుణాలను గురించి తర్కించాడు. మొదట కళాకారునికి ధ్యానసమాధిలో సర్వందర్శించగలశక్తి వుండాలి. దూరదృష్టి, హస్తలాఘవం, శారీరకశాస్త్రం – యిలాంటివిషయాలు అనేకం చర్చించబడ్డాయి. అన్నిటికిమించిన శీలం, ఆత్మనిగ్రహం కళాకారునికి అవసరం –

"మీరు జీవితాన్ని తరచినవారు. మీ అనుభవాల ముందు నా ఆలోచనలు బలహీనములు. అంతే నేను చివరకు చెప్పగలిగింది" అన్నాడు బదరీ పుస్తకంమూసి.

"మనకు ఎంత తెలిసిందనేది ప్రశ్నకాదు. మన సత్యాన్వేషణ, తద్వారా పొందే నిరవధికానందము సక్రమమేనా అనేది విచారణీయాంశం."

"మనిషి ఎలా నిజమైనజీవితం జీవించగలడు ?"

"తనమీద, తన పనులమీద తనకు నమ్మకం ఏర్పడితే సరి. ఒకదాన్ని సత్యమని నమ్మినపుడు దాన్ని పొందటానికే ప్రయత్నించాలి. అదే సత్యాన్వేషణకుమార్గం."

"అది యితరులను బాధించేది అయితే ?"

"కాని, అందరూ అలావుండరుగా! ఎవరికివారుగా న్యాయమార్గం అవలంబిస్తే సత్యాన్వేషణ అందరికీ సులభమవుతుంది."

కమల గదిలోనికివచ్చి "నాన్నా! వంటఅయింది. అమ్మ మియిద్దర్నీ లెమ్మంటోంది."

"నేను భోజనంచేసేవచ్చాను" అని చెప్పాడు బదరీ.

రాంగు పత్రమాత్రం లేచి, తలుపుదగ్గరగా వెళ్ళి అన్నాడు- "మరోసారి ఎప్పుడైనా కూర్చుందాం. ఇలా ఒకరితో మాట్లాడి ఎంతోకాలమయింది" అంటూ వెళ్ళిపోయాడు.

కమల అక్కడే తచ్చాడింది.

"ప్రేమ నెందు కోకపడుతున్నారు మీరు? అక్కకు మీరంటే ఎంతో యిష్టం. ఇక్కడికొచ్చినప్పుడల్లా మిమ్మల్ని గురించే చెబుతూంటుంది."

బదరీ మౌనంగా వుండిపోయాడు. కమల వెళ్ళిపోతున్నప్పుడు—"నీకు సంగీతం వచ్చుగదూ! ఓ పాట పాడ గూడదూ!"

"అలాగే పాడుతాను"

బదరీ తిరిగి హాల్లోకి వెళ్ళి, మెత్తపై కూర్చున్నాడు. కమల వీణ తెచ్చి, చాపమీద పెట్టి, తీగలను శ్రుతిచేయటం ఆరంభించింది. నెమ్మదిగా పాటనందుకుంది. ప్రమీలజ, రాంగుప్తకూడా వచ్చి, వింటూ నిలబడ్డారు. కమల పాటపూర్తి చేయగానే అభినందించాడు బదరీ.

"అద్భుతంగా వుంది. ఎంత ఆనందం అనుభవించానో లెఖ్ఖ లేదు."

బదరీ తలెత్తి ప్రమీలజవైపు చూచాడు.

"వెళ్లొస్తాను. చాలా పొద్దుపోయింది" అంటూ లేచాడు.

* * *

బదరీనారాయణ చిత్రశాలలో ఆచార్యపద్మదత్తుని గంభీరోపన్యాసం విన్నాడు. ఆచార్యునిఔన్నత్యం ఆయన ఉపన్యాసంవల్ల గ్రహించాడు. ఆయన సంపూర్ణమానవుడుగా, పరమోన్నతుడుగా అతనిదృష్టికి అగుపించాడు. ఆయనలో తొట్రుబాటులేదు. పైగా, నిర్మలహృదయం. ఆవేదన లేదు. సాత్వికమహస్సు వుంది. కళాసేవ ఆయనపరమావధి. ఇతరులగూర్చిజోక్యంకలిగించుకోడు—ఇవే ఆయనలోని విశిష్ట లక్షణాలు. వీటివల్లనే ఆచార్య పద్మదత్తు గొప్పవాడు కాగలిగాడు. మహోన్నతశిఖరాల నందుకోగలిగాడు. తనభావాలను, నమ్మ

కాలను విద్యార్థులకు బలవంతాన నేర్పడు. తనఅనుభవాల నీడలలో వారు తమకళాభిజ్ఞతను తీర్చిదిద్దుకో నవకాశం కల్పించుతాడు. ఎంతో ఉన్నతాశయాలుగలవ్యక్తి. స్వార్థరాహిత్యం అతనిలోనే రూపందుకున్నది. బదరీ మనస్ఫూర్తిగా భావించాడు – ఆచార్యులు ఒక గొప్ప విశిష్టవ్యక్తి అని.

"అనేక పర్యాయాలు చెప్పాను-కళలు ఆత్మసంస్కృతీ వికాసాలని. అవి మనస్సు నుత్తేజపరచి, భావాల నుత్పన్నం చేస్తాయి. ఇంద్రియాలు, ఐంద్రియకతానుభూతులు కళాసాధనలో పటిష్ఠత నందుకుంటాయి. మానవుని నీచాభిరుచుల్ని, ఉద్రేకాలను మరుగుపరచి, శాశ్వతానుభూతుల్ని కలిగిస్తాయి.

"మానవుని ఆత్మశక్తి పరిపూర్ణమైనప్పుడే కళలు జన్మిస్తాయి. ఈకళలు ఒకదానితోనొకటి తాదాత్మ్యంపొంది, రూపలావణ్యాలలో స్వభావ, సారూప్యతగల్గి, జీవితాన్ని విశ్వజనీన మార్గాలలోకి పయనింపజేస్తాయి.

"కళకూడా యోగాభ్యాసంవంటిదేనని చెప్పాను. సచేతనమైన భావనాప్రపంచానికి సింహద్వారంవంటిది. ఈ భావన పతాకస్థాయినందుకొన్నప్పుడే ధ్యానమగ్నత కలుగుతుంది. పరమాత్మతో తాదాత్మ్యంపొందగలడు వ్యక్తి – రామణీయక వస్తుసృష్టి, సమ్యక్ దృష్టి ఏర్పడ్డప్పుడే ఉన్నతమైన నిర్మాణశక్తి అలవడుతుంది. వా స్తవికప్రపంచాన్ని అప్పుడే రామణీయకతా రాజ్యంలోకి తీసుకుపోగలుగుతాం. అదీ ఒకవిధమైన సంగీతమే. చర్మచక్షువులతో అనుభవించలేకపోవచ్చు. కాని, ఆత్మతో వినగలవు, చూడగలవు. అనుభవించనూగలవు. కళ మానసికానందాన్ని కలిగించుతుంది.

"మీకు షడంగాలనుగురించి కూడా చెప్పినజ్ఞాపకం. కళకు షడంగాలు ముఖ్యం. ఆరురకాలైన భావాలు. మీలో చాలకొద్దిమందికే అవి జ్ఞాపకంఉండివుంటాయను కుంటాను. మీలో చాలామంది ఉత్సాహవంతులే కాని, ఉద్రేకపరులు కూడా. ఉద్రేకం పనికిరాదని అనేకసార్లు హెచ్చరించాను. ఉద్రేకంతో మీ కళాకృతుల్ని భంగపరచరని నాఉద్దేశం కాదు. మీ మీ కృతులు చూస్తుంటే, వాటిని పూర్తిచేయ టానికి మీకుపడిన ఉద్రేకం, తొందరపాటు అగుపిస్తోంది.

"ఈరోజునుండి ప్రతివారు ప్రతిరోజు షడంగాలను 'మననంచేసుకుంటూ వుండాలి. అవి మీ కళాసృష్టికి ఎంతో ఉపయోగపడగలవు. అలా రోజూ మననంచేసుకోవటంవల్ల అవి మీ హృదయాల్లో నాటుకుపోగలుగుతాయి. ప్రేమా నంద్! షడంగాల్ని గురించి నీకు జ్ఞాపకంవుందా?"

ప్రేమానంద్ ముకుళితహస్తాలతో నిలబడి "వున్నది ఆచార్యా!" అన్నది.

బదరీ దూరంనుండే ప్రేమను తిలకించాడు. కలలో దూరంగాపోతూ, గాలిలో కరిగిపోతున్నవ్యక్తిలా వున్నది ఆమె.

"అందరికీ వినిపించేట్లు ఒకసారి చెప్పు" ఆచార్యులు ఆజ్ఞాపించారు.

ప్రేమానంద్ వినయవిధేయతలతో యిలా చెప్పనారం భించింది – "షడంగాలలో మొదటిది రూపభేదం. రూపంలో, ఆకృతిలో, తీర్చిదిద్దటంలో, చివరకు ప్రతీహాంపులోను, రేఖ లోను ప్రత్యేకతను తీర్చిదిద్దటం – రూపభేదం అంటారు.

"రెండవది – ప్రమాణం. రూపంవల్ల కలిగే ఆలంకారిక భావాన్ని, ఉద్రేకాన్ని ప్రమాణంద్వారా స్పష్టంచేయాలి."

"మూడవది-భావం. ఇది చిత్రంలోగాని, శిల్పంలోగాని వ్యక్తీకరించవలసిన రామణీయక, ఆలంకారిక సౌందర్యం.

"నాల్గవది – లావణ్యం. కళాసృష్టిలో దిఙ్మాత్రంగా సూచించవలసినసత్యం.

"అయిదవది – సాదృశ్యం. రంగులకలయికవల్ల కలిగే భావభేదాలు.

"ఆరవది – వర్ణకభంగం : చిత్రం పూర్తయినపుడు మొత్తంమీద అది కలిగించే దార్శనికభావం. చిత్రంపరిపూర్ణత, అదికలిగించేభావం, అనుభూతి యిందుమూలంగా వ్యక్తీకరించ బడుతాయి."

ఆచార్యులకు నమస్కరించి ప్రేమ కూర్చుంది. తిరిగి ఆచార్యులు శిష్యులనుద్దేశించి అన్నారు –

"మీకు 'భావం' అర్థమయినట్లులేదు. రూప – లావణ్యాలు ప్రతి వర్ణచిత్రంలోను వ్యక్తంకావాలి. చుట్టూవున్న కొండలను, చెట్లను, నదిని, ఆకాశాన్ని చూడండి. అవి మీలో ఒకభావాన్ని కలిగించాలి. అలాకలిగినభావం మీమనస్సులో అలల్ని రేపి, దాన్ని చిత్రించేవరకు మీలో అలజడి రేపగలగాలి. ఆ భావంలో, ఆ రూపంలో మీరు తాదాత్మ్యం పొందగలగాలి. ఒక జలపాతాన్ని సృష్టించదలచినప్పుడు మీలో ఆ జలపాతాలు కలగాలి. ఊహించుకోగలగాలి. వాటిబరువును భరించలేక చిత్రంలో, వర్ణాలలో ప్రతిరూపించాలి. అలాగే ఒక సుందరదృశ్యం మీరు చిత్రించదలుచుకున్న దానిలో

పూర్తిగాకరిగి, కలసిపోవాలి. లేనప్పుడు మీరు దాన్ని చిత్రించ లేరు. ఆ అంతస్సందుకోగల్గడం ముఖ్యం చిత్రాకారునికి. కళ యాంత్రికం కాదు. కాని, ఆలోచన, భావన కలసి ఒకరూపం ధరిస్తాయి. అప్పుడే కళకు సంపూర్ణత్వం ఏర్పడుతుంది.

"కళ మానవమహాత్మును ద్విగుణీకృతంచేస్తుంది. అది రామణీయతకు రూపకల్పనచేసి, శాశ్వతత్వాన్ని ప్రసాదిస్తుంది. ఆ రామణీయకతను సౌందర్యంతో మనం జయించగలం. అందులో భేదభావాలను వదలి, ఏకంకాగలం. కళాకారుడు రమణీయకృతికి జన్మనిస్తాడు. రూపరహితమైనవాటికి రూపాన్నిస్తాడు. మనోభావాల్ని రూపింపచేస్తాడు ఒక పుష్పాన్ని చిత్రించటమంటే దానిబాహ్యరూపాన్ని చిత్రించటం కాదు. దాని అంతఃసౌందర్యాన్ని, ఏభావానికి అది ప్రత్యామ్నాయమో దాన్ని నిరూపింపచేయాలి. ఆ భావాన్నే చిత్రించినపుష్పం వ్యక్తం చేయగలగాలి."

అలా ఎంతోసేపు ఉపన్యసించి, ఎప్పటికన్న ఎక్కువ సేపు విద్యార్థుల్ని ఆకర్షించుకోగలిగారు. చివరకు 'అందరూ వెళ్ళిపోవచ్చు' అనిచెప్పి – "బదరీనారాయణ! నీతో మాట్లాడాలి. నీవు వుండు" అన్నారు.

విద్యార్థి యతులందరూ వెళ్ళిపోయారు.

బదరీ ఒక్కడే ఆచార్యునికెదురుగా వుండిపోయాడు. తలెత్తి పద్మదత్తునిముఖంలోనికి చూచాడు.

"రాత్రి ప్రేమానంద్ నాదగ్గరకొచ్చి, ఏడ్చింది. ఆమెకు నీవు అన్యాయంచేశావు. అంత నిర్దయగా ప్రవర్తించటం బాగా లేదు. ఇక్కడ అందరికీ తెలుసు ప్రేమ స్త్రీ అని. అయినా,

ఎవరూ భేదంపాటించరు. తమలో ఒకరుగా ఆమెను చూచు కుంటారు. ఇకమీదట ఆమెస్నేహం అవసరంలేదన్నావుట. ఆమెకు నీవంటే, నీస్నేహమంటేఎంతో యిష్టం. నీవులేకుండా ఆమె ఏమీ చేయలేనంటుంది. ఆమె మనస్సును నువ్వు ఆక్ర మించావు - తెలుసా?" అన్నారు ఆచార్యులు.

"ఆవిడ స్త్రీ ఆచార్యా! నాకు స్త్రీలంటే యిష్టం లేదు"

"ఆమె స్త్రీ అయినంతమాత్రాన నీ కేం అపకారం? కేవలం స్నేహితమేగా ఆమె వాంఛించింది నీనుండి. ఇక్కడ అసూయలకు, ద్వేషాలకు ఆస్కారంలేదు. అలాంటివన్నీ మర్చిపోగలగాలి. అయినా, నీకు నేను సలహా చెప్పటంలేదు. నీయిష్టం నీది"

"ప్రయత్నిస్తాను ఆచార్యా!"

* * * *

బదరీ చాలాసేపు కొండల్లో తిరిగాడు. చివరకు నాగోజీ దగ్గరకు వచ్చాడు. నాగోజీ తన ఏనుగుతొండంతో సతమత మవుతున్నాడు. అతను దిగాలుపడి నిలబడిచూస్తున్నాడు తోచక. ఆ తొండంవొంపులు తనవల్లకావటంలేదు. తనకు సహాయంచేస్తానన్నాడు. కానీ, ఎంతకీ రాడు. బదరీనిచూచి నాగోజీహృదయం సంతోషంతో పరవళ్లు త్రొక్కింది.

"నీకోసమే ఎదురుచూస్తున్నాను బదరీ!"

"ఏదీ పోగరు, ఉలి యివ్వు, ప్రయత్నిస్తాను"

అవి రెండూ నాగోజీ యిచ్చాడు. వెదురుబొంగులతో కట్టిన మంచెమీదికి ఎగబ్రాకాడు. పనికుపక్రమించాడు "ఒక వొంపా, రెండువొంపులా నాగోజీ?" బదరీ అడిగాడు.

"రెండు. తొండంతో పూలదండపట్టుకొని, ఎవరి మెళ్ళోనో వేస్తున్నట్లుండాలి."

"నువ్వు భలే భావుకుడివి నాగోజీ! రా పైకి, నే నెలా తీరుస్తానో చూద్దువుగాని."

నాగోజీ ప్రక్కనే బదరీ. బదరీ వొంపులు తీరుస్తున్నాడు.

నాగోజీ ఆత్రుతతో అతనిచేయి వెంటనే తనదృష్టిని పోనిస్తున్నాడు. బదరీ తీర్చిదిద్దిన తొండం చూచి, సంతృప్తి చెందాడు.

"ఇప్పుడెలా చెక్కాలో తెలిసింది బదరీ! అంగుళిమాల విహారంలో ఏనుగుల్ని ఇలాగే చెక్కుతాను."

మంచెమీదనుండి క్రిందికి దిగారు. "విచారించకు నాగోజీ! నిర్విచారంగావుంటే నువ్వే చెక్కగలిగేవాడివి నాసహాయంలేకుండానే."

"అబ్బే! ఏం విచారంలేదు బదరీ!"

బదరీ అతన్ని వదలివెళ్ళాడు అక్కణ్నించి. కొండనా విహారానికి వచ్చాడు. అక్కడ ప్రేమ కనుపించింది.

ఆమె ఒక భిక్షువుచిత్రం చిత్రిస్తోంది. భిక్షువు యిల్లు వదలి వెళ్ళిపోతున్నదృశ్యం అది. బదరీకాలిచప్పుడు విని, వెనుదిరిగి చూచింది.

"చిత్రంలో లీనమైనట్టున్నావ్ ప్రేమ్?"

"లేదు, లీనంకావాలనే ప్రయత్నం. కానీ, కాలేకపోతున్నాను. ఇంకా నామీద కోపమా?" దీనంగా, నిర్జీవంగా అన్న ఆమెమాటలు బదరీహృదయాన్ని కరగించాయి.

"కోపంలేదు. ఏమిటి చేస్తున్నావ్?"

"ఆనందుని నిష్క్రమణం చిత్రిస్తున్నాను – అలా ఆనందుడు సంసారాన్ని వదలి భిక్షువుల్లో కలిసినప్పుడు, అతనిభార్య రాకుమారి హృదయభారంతో చనిపోయింది. అతన్ని ఎంతగానో ప్రేమించింది ఆమె. కాని, ఏంలాభం! ప్రేమఎక్కువై అతనువెళ్లిపోగానే మరణిస్తుంది."

"ఏదీ? ఎక్కడా రాకుమారిచిత్తరువు కనుపించదేం? ఇంకా చిత్రించలేదేమిటి? ఆ గీతలు అంత అస్పష్టంగా వున్నాయేం? ఇంకొంచెం మందంగా గీసుకోగూడదూ వాటిని" అలా కన్పించీకన్పించకండావుంటే ఎల్లా?"

"గీస్తాను. ఆనంద్ నీలాగా వుంటాడు ఈచిత్రంలో. మధురంగా అన్నది ప్రేమకుమారి.

"ఓ రాజకుమారిని వదలి, నేనూ సన్యాసంపుచ్చుకోవాలా?

"రాకుమారికాకుంటే మరొకరు – నీకోసం విలపించేవారు ఎవరైతేనేం?"

"నే వెళ్ళిపోతే అలా నువ్వు విలపిస్తావా?"

ఆమె అదోలా చూచింది బదరీవైపు. అతను నవ్వాడు.

"నాకు ప్రేమ అవసరంలేదు, స్నేహంకావాలి" అన్నది.

"నాకోసం విచారిస్తావా అంటే చెప్పవేం?" అని అడిగాడు బదరీ.

విహారంలో నలుమూలలా తిరిగాడు. అనేక జాతక చిత్రాల్ని పరిశీలించాడు. చిత్రం చెక్కడం చూస్తూ అలా పోతూవుంటే ఒక్కొక్క ఆలోచన మనస్సులో మెదిలింది. అలా ఆలోచనకలిగినప్పుడు కళ్ళు మెరిసినయ్ సంతోషంతో.

గోడలను తీక్షణంగా చూచాడు. పడమటివైపు వెలుగు కిరణాలు బాగా ప్రసరిస్తున్నా ఓ గోడ అపుపించింది. అనేక చిత్రాలు మనస్సులో రూపొందినయ్. ఏదో చేయాలనిపించింది. మొలలోంచి ఒక ఉలితీసి, గోడను నున్నగా చెక్కనారంభించాడు.

"నేనుకూడ సహాయంచేస్తాను బదరీ" అన్నది ప్రేమ.

"అవసరంలేదు. నీపని నీవుచూచుకో"

గబగబా బయటకు వెళ్లి, సున్నపునీళ్ళు తీసుకొచ్చాడు. గోడఅంతాశుభ్రంగా తెల్లగా వెల్లవేసివర్ణచిత్రరచన కుపక్రమించాడు. అపరాహ్ణానికి ప్రాథమికావస్థ పూర్తయింది. ఆలుచిప్పలలో రంగులుకలుపుకుని తీసుకొచ్చాడు. ఉడుత వెంట్రుకలతో కట్టిన కుంచెలు సిద్ధంచేసుకున్నాడు. వర్ణచిత్రం చిత్రించటాని కుపక్రమించాడు.

సింధూరవర్ణంలో నమూనా రేఖాచిత్రం గీశాడు. రేఖలు రంగుల్లోకి మారుతున్నాయి. కొన్నినిముషాల్లోనే రేఖలన్నీకలసి ఓ సుందరరూపందాల్చాయి. రాత్రి తాను చూచిన యవ్వనవతిరూపకల్పన అది. తనకోసం, తన సంప్రాప్తి కోసం మధురగానం వినిపించిన కిన్నెరరూపం అది. గోధుమ రంగుగీతలు గీశాడు — వివరణాలు అందంగా రంగరించాడు. అబ్బ! ఎంత ఉద్దీపితాలు ఆ కళ్ళు! పెదాలు పండిపగిలిన

ఎఱ్ఱదానిమ్మగింజల్లా వున్నాయి. గాలికి కేగినట్టుగా వున్నాయి ముంగురులు. పాలిండ్లు కోరికల నణచుకోలేక, కొట్టవచ్చినట్టు న్నాయి. వక్షోజాలమధ్య కనుపించీ కనుపించని సన్నటిలోయలో సన్ననిగొలుసు వ్రేలాడుతోంది. ఆమె చేతిలో అద్దం, రెండవ చేతితో ముఖానికి పౌడరుఅద్దుకుంటున్నట్లుంది. శరీరాన్ని రంగులమయం చేశాడు. నిండైన నిజవిగ్రహంలాగున్నది చిత్తరువు. ఆమెఉచ్ఛ్వాసనిశ్వాసాలు బదరీకి వినిపిస్తున్నాయి. ఆమెకళ్ళలో అణగివున్నకోర్కెలు అతనికి తెలుస్తున్నాయ్. తలవెంట్రుకలను సన్ననికుంచెతో చిత్రించాడు. ఎంతో జాగ్రత్తగా, స్వాభావికతఉట్టిపడేలా చిత్రించాడు. దురదృష్టవశాత్తు కుంచె చేయిజారింది. వెన్నెలలాంటి ఆమెనుదురుపై నల్లటిమచ్చపడ్డది.

బదరీకి పట్టరాని ఏడ్పువచ్చింది. లోలోన కుమిలిపోయాడు. ఎంతపని జరిగింది పొరపాటున కుంచెజారింది. సౌందర్యరాశి మలినమైపోయింది. ఘోరాపరాధం జరిగింది. చిత్రం అందం చెడిపోయింది. కోపంతో చిత్రంలోకి చూచాడు. మనస్సు కలవరపాటు చెందింది. కోపం, శోకం హద్దుమీరినయ్. చిత్రాన్ని నాశనంచేయాలి. తాను సృష్టించిన దాన్ని తానే తుడిచివేయాలి.

బయటకు దూసుకువెళ్లిపోయాడు సున్నపు నీళ్లకోసం చిత్రాన్ని సున్నంతో చెరిపివేయాలని ఆత్రుత. అతను వెర్రిగా కేకలేస్తున్నాడు... ఆత్రుత చూచి, ప్రేమ భయపడింది. రంగులు కలుపుతున్నదల్లా.దిగ్భ్రమతో తలెత్తి అతనివెనుక చూచింది.

"బదరీ!" గట్టిగా పిలిచింది. అత నంత చిరాకుగా కోపంగా, ఆత్రంగా వుండటానికి కారణం తెలీదు ఆమెకు.

ప్రేమకు సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయాడు. కుంచెనుండి దోసెడుసున్నం తీసుకుని, విహారం వేపు పరుగెత్తాడు. ప్రేమ ఆశ్చర్యంగా, భయంగా అతన్ని అనుసరించింది. గోడమీద ఆ చిత్రితసుందరిని చూచి, ఆశ్చర్యపోయింది. దీన్ని చిత్రించిన దివ్యాంశసంభూతుడెవరో కదా! అనుకున్నది. బదరీ అంతటి కళాకారుడని ఆమెకు తెలీదు అంతకుముందు. ఎంతో ఉత్సుకత ప్రదర్శించింది. ముఖ్యంగా ఆ కురులు ఎంత సహజంగా వున్నాయి! ఎంతటిఅనుభవం ఉంటేనోగాని, అలాంటివి చిత్రించటం సంభవంకాదు. ఒక్క స్త్రీకే ఆ మెళకువలు తెలుస్తాయి. ఉత్తమచిత్రరాజము. ప్రేమ అతని దగ్గరగా వెళ్ళి అడిగింది. "ఏంచేస్తున్నావ్ బదరీ?"

"నాశనమయింది." పెద్దగా అరచాడు. అప్పుడు బదరీ ముఖం ఎంత భయంకరంగావుందో చూచిన ప్రేమకే తెలుసు. "చెడిపోయింది" మళ్లీ అన్నాడు నిస్పృహతో, నిరాశగా.

"ఏంచెడిపోయింది అందులో? బాగానేవుందిగా" అనుమానంగా అడిగింది.

"వెళ్లు, యిక్కణ్నించి వెళ్ళిపో, నన్ను వొంటరిగా వుండనీ. వెళ్ళిపో ప్రేమ్!"

బదరీ చెయ్యి గట్టిగాపట్టుకుని, ఆపుతూ అన్నది తొందరపడకు బదరీ! ఏంచెడిపోయిందో చెప్పు నాకు?"

"ఆ జుట్టు చూడు, ముఖంమీద ఎలా ముద్దలా పడ్డదో! కుంచె జారింది. మొహంమీద ఆ మచ్చ అసహ్యంగాలేదూ ఎంత అసహ్యంగా, దారుణంగా అవుపిస్తోంది చెప్పు!"

ప్రేమ్ ఆశ్చర్యంగా అడిగింది "ఏది బదరీ! కుంచె జారిందా! అదే నీ చిత్రానికి వన్నె తెచ్చింది. ఎంతో సహజంగా స్వాభావికంగా అగుపిస్తోంది దానివల్లనే - గాలికి జుట్టు రేగినట్లు అగుపిస్తోంది. నువ్వు కావాలనే అలా వేశావనుకున్నాను బదరీ. నే చెప్పినట్లు ఊహించుకో, ఎంత బావుందో చూడు యిప్పుడు"

బదరీ కోపంతో యింకా వొణికిపోతున్నాడు. నిరుత్సాహంగా చిత్రాన్ని పరిశీలిస్తున్నాడు - అనూహ్యమైన బాధ అతనిలో.

"నీయిష్టంవచ్చినట్లుచేసుకో!"

"అలాగే బదరీ" అంటూ కుంచె, రంగులు తీసుకున్నది. అలంకరణ పూర్తిచేసుకుంటున్న ఆ యువతిచిత్రం మీద యిద్దరూ దృష్టి కేంద్రీకరించారు. మిగతా లోపాలన్నీ సవరించారు. సేవికలు, గది, పరిసరాలు అన్నీ చిత్రించారు యిద్దరూకలసి.

సాయంత్రమయేసరికి చిత్రం సంతృప్తికరంగా పూర్తయింది. బదరీ ప్రేమబుజాలను ఆప్యాయంగా పట్టుకుని, వూపుతూ "ప్రేమ్!...బ్రహ్మాండంగావుందిగదూ" అన్నాడు సంతోషపట్టలేక ఉద్వేగంలో.

"అవును. చాలా బావుంది" అంటూ అతనికళ్ళలోకి చూచింది. ఆమెకళ్లు అశ్రుపూరితాలయినాయి. "నీ భావన ఎంతో రమణీయంగా వుంది బదరీ! నీలాగా నేను భావించగలిగితే ధన్యురాల్నే"

ఆమె అమాయికత్వానికి మందహాసంచేసి, ఆమె కన్నీళ్లు తన ఉత్తరీయంతో తుడిచివేశాడు.

"నా ఆలోచనలు చాల ఘోరమైనవి. ఆమె ఎంతో చపలంగా చంచలంగా వుండాలని భావించాను. కానీ, పవిత్రంగా తయారయింది. ఎందువల్లనో ?"

"నీ నిజమైనవ్యూహాలు పవిత్రమైనవి గనుక !"

కొన్ని క్షణాలు అతనిచుట్టూ నిశ్శబ్దం. అంతకంటే మాట్లాడడం అనవసరమయింది యిదరిమధ్య.

"నీ సహాయానికి కృతజ్ఞుణ్ణి ప్రేమ్ !"

"నేనంటే కోపంలేదుగదూ బదరీ ?"

"లేదు. ఒక్కోసారి అలా అయిపోతాను ఎందుకనో. అప్పుడప్పుడు భరించలేనంత కోపంవస్తుంది, నాకు. నా స్థితి తెలుసుకుని మంచివిరుగుడు వేసినందుకు కృతజ్ఞుణ్ణి.

"బదరీ ! నీ హృదయం మంచిది. పరాకాష్టనందుకున్న చిత్రకారుడివి నువ్వు. నువ్వు గొప్పవాడివే. నాకు చాలా ఆనందంగావుంది. బదరీ!"

* * * *

కొద్దిరోజుల్లోనే అలంకరణ పూర్తయింది. ఇద్దరూ కలసి, సమిష్టిగా చిత్రించిన చిత్రంకావడంవల్ల ఒకరిలోపాలు రెండవవారు సరిదిద్దటం జరిగింది. మొత్తంమీద అద్భుతంగా తయారయింది. అవకాశం చిక్కినపుడల్లా చిత్రలేఖనాన్ని గురించి, అందలి మంచిచెడ్డలనుగురించి తర్కించుకుంటూ కాలక్షేపంచేసేవారు.

"ఆచార్యపద్మగత్తుని ఈ కళాఖండంచూడటానికి పిలుద్దాం. ఆయ నేంచెబుతారో!" అన్నది ప్రేమ.

'ముందుగా ఏంచెబుతాం. ఆహ్వానిద్దాం. తర్వాత వారి అభిప్రాయ మేమైనాకానీ!"

మర్నాడు పద్మదత్తు ఉపన్యాసం ముగించగానే యిద్దరూ నమస్కారంచేసి నిలబడ్డారు. బదరీ నోరువిప్పి, మనోగత భావాన్ని వ్యక్తంచేశాడు. "ఓ చిత్రం పూర్తిచేశాం ఓ స్త్రీ మూర్తి అలంకరణ. అలంకరణపట్ల స్త్రీ చూపే ఆసక్తి, చాక చక్యత అందులో చిత్రీకరించటానికి ప్రయత్నించాం. అస భ్యంగా ఏమీలేదు. ఒకసారి..."

"చూస్తాను" అన్నాడు పద్మదత్తు.

తనముందున్న చిత్రం చూచి పద్మదత్తు మందహాసం చేశాడు. "ప్రతివిషయంలోను జాగ్రత్తవహించారు. కురులు ఎలా వేసుకలిగారు ఆ విధంగా ?"

"బాగాలేదా ఆచార్యా?" భయంగా అడిగాడు బదరీ.

ఆచార్యుడు అలాఅనేసరికి అతనిగొంతులో ఏదో అడ్డు పడ్డట్లయింది నోటమాటపెగల్లేదు. తానేదైతే లోపమను కున్నాడో, దాన్నే ఆచార్యులు బయటపెట్టారు.

"బావుంది. తలదువ్వి, కురులు ముడుచుకుంటున్నప్పుడు గాలిపీచినట్లుంది. నొసలుమీదవడ్డ జుట్టును వెనక్కిత్రోసే ప్రయ త్నంలోవుంది కదూ! ఓహో చాలా అద్భుతంగా వుంది"

"అలా వేసింది ప్రేమ్, నేనుగాదు" అన్నాడు బదరీ.

పద్మదత్తు ఆసక్తితో చిత్రం తిలకించారు. చిత్రంలో స్త్రీమూర్తి అత్యద్భుతంగా వుంది. ఎంతో లావణ్యం ఆ చెక్క

ళ్ళలో, కళ్ళలో పొదువుకున్నట్లుగా వుంది. ఎంతో చిలిపితనం కూడా అవుపిస్తోంది. అయినా, గంభీరదృష్టి ఆమెది. సృష్టిలో ఇంతటి మహత్తు వున్నదా అనిపిస్తోంది ఆ చిత్రాన్ని చూస్తే.

"బావుంది చాలా బావుంది...మీరిద్దరూ నిజమైన స్నేహితులు యిప్పుడు – ఇద్దరికీ ప్రజ్ఞ వున్నది, ఉపజ్ఞ వున్నది. మీవల్ల చక్కని చిత్రాలు యిక్కడ ఎన్నో చిత్రితం కావాలని ఆశిస్తున్నా."

"అలాగే ఆచార్యా! కాని, మనమంతా మనుష్యులం"

"అయినా కళసజీవం. నశించదు. మనం చనిపోయినా, మనం నిర్మించిన కళాకృతులు శాశ్వతంగా వుంటాయి. ఈ చిత్రాలు ఎవరుచిత్రించినది ముందుతరాలవారికి తెలియదు. కాని, వాళ్ళు వీటిని గౌరవించకుండా వుండలేరు. అలా గౌరవిస్తూ ఎంతో ఆనందం అనుభవిస్తారు. బదరీ! నువ్వు బౌద్ధ మతం ఎందుకు స్వీకరించకూడదూ?" అని అడిగాడు ఆచార్యులు దీనంగా.

"నా కా అవసరంలేదనుకుంటున్నాను ఆచార్యా! నాకు నేను సంతృప్తిపొందగలుగుతున్నాను యిప్పుడు"

"అలా అనకు బదరీ! నువ్వు బౌద్ధమతంస్వీకరిస్తే, నీ కళాసేవ బుద్ధుని ఆరాధించటానికి వినియోగిస్తుంది. బుద్ధదేవుని మహిమలను చిత్రిస్తావని ఆశ"

"బుద్ధుని చిత్రించటం నా కిష్టంలేదు. ఇప్పుడే కాదు, ఎప్పుడూ, నాకుతోచిందల్లా చిత్రించటం నా కిష్టం. నా కళకు హద్దులు వుండటం నా కిష్టంవుండదు."

"ఎందువల్ల బదరీ ?"

"నేను బౌద్ధుణ్నయితే మీ సిద్ధాంతాలు, నమ్మకాలు నన్ను బంధించేస్తాయి. నేను స్వేచ్ఛాజీవిని ఆచార్యా !"

"నువ్వు అలా భావిస్తే నీకు చెప్పవలసిందేమీ లేదు"

"నన్ను అర్థంచేసుకున్నందుకు సంతోషం"

అంతటితో సంభాషణ అంతమయింది. ఎండలోకి వెళ్ళిపోయారు. నెమ్మదిగా ప్రవహిస్తున్న వాఘీరా అక్కడికి కనుపిస్తోంది.



"నువ్విప్పుడు ఏంచేస్తున్నావ్ ప్రేమానంద్ ?"

"ఆనందుని నిర్గమనం వర్ణచిత్రంగా వ్రాస్తున్నాను. ఆనందుడు, ఆయనభార్య రాజకుమారి - రాకుమారిమీద ఎక్కువగా కేంద్రీకరిస్తున్నాను. ముందు ఆనందుని చిత్రించాను. ఎందువల్లనంటే బదరీనిచూచి, ఆనందుని సులువుగా చిత్రించవీలవుతుందని."

"మరణిస్తున్న రాకుమారిగా నీచిత్రం వ్రాసుకుంటూవా ?" పద్మదత్తు కళ్లు చిలిపిగా నవ్వాయి. ఆ క్షణాలలో ఆగ్రహానికి బదులు అనుగ్రహం అగుపించింది ఆయనలో. పద్మదత్తు కళ్లువొత్తుకున్నాడు కూడా.

ప్రేమ నవ్వుతూ సమాధానం చెప్పింది "కావచ్చు, నాచిత్రమే కావచ్చు."

"జాతక చిత్రాలు వ్రాస్తానని మాటయిచ్చావుగదూ?"

"రెండు పూర్తిచేశాను ఆచార్యా !"

"ఒకటే చూచాను. విధురపండితుని జాతకకథ. రెండవది ఏది ?"

"హంసజాతకం"

"అది నీవుచిత్రించినదేనా? నాకెందుకు చెప్ప లేదు దాన్ని నువ్వేచిత్రించినట్లు? ఇంకెవరో వ్రాశారను కున్నాను. ఎవరో కనుక్కుందామనికూడా ప్రయత్నిస్తున్నాను. అది చాలా బాగుందిసుమా!"

"నిజంగానా ఆచార్యా?"

ఆచార్యులు సంబాళించుకుని, తన్నుతాను చూచు కున్నాడు. ప్రపంచంలోని సౌందర్యమంతా కలసి, తనను పుల కింపచేసినట్లు తొట్రుపడ్డాడు ప్రేమ ఆమాట అనగానే.

"ఇవ్వేళ ఎంతో హాయిగావుంది. మీరిద్దరూ ఏంచేస్తారు?"

"లోయలోకి వెడుతున్నాం - మాయింటికి" అన్నది ప్రేమ.

"అలాగా. తిరిగివచ్చాక, మీనాన్న ఎలావున్నారో నాకు చెప్పు, ఎప్పుడైనా ఒకసారి తీరికచూచుకుని, వారిని కలుసుకుంటానన్నానని చెప్పు వారితో. చాలాకాలమయింది నేనుకలుసుకుని"

* * * *

"నదివెంట కొంతదూరం నడిచారు ప్రేమ, బదరీ యిద్దరూ. "సప్తగుండందగ్గర కెళ్లి, స్నానంచేద్దాం పద" అన్నాడు బదరీ.

"సప్తగుండమా, అమ్మో! అది చాలాప్రమాదకరం"

"చాలాప్రమాదం! ఏంఅయితే? ఎవరు భయపడ తారు? జాగ్రత్తగా మసలుకుంటే అపాయానికి ఎదురీదవచ్చు.

అసలు పడటమే అపాయంలోపడితే, యింకా ఎదురీద గలిగేదే ముంటుంది ?"

వాఘీరాజలపాతాల అడుగులు సుడిగుండాలుఏర్పడి, మోతలుపెడుతున్నాయి, కొద్దినిమిషాల్లో యిద్దరూ అక్కడికి వచ్చారు. అటు జలపాతం, ఇటు సుడులుతిరిగేనది ఉరవడి. అరణ్యం, ఇసుకతిన్నెలు, కొండరాళ్లు-అందంగావుంది ప్రకృతి. ఏడుమెలికలు తిరుగుతూ, ఏడుసరస్సుల్ని సృష్టిస్తూ ప్రవహిస్తోంది వాఘీరా. చివరి సరస్సులోతు ఎక్కువ. చేపలమయం.

బదరీ ఉత్తరీయంతీసి క్రిందవేశాడు. చెప్పులువిప్పి ప్రక్కనేపెట్టి, నీళ్ళలోకి దూకాడు. హుషారుగా ఈదాడు. ప్రేమ వొడ్డునే నిలబడి బదరీనిచూస్తోంది.

"అక్కడే నిలబడ్డావేం ప్రేమ్? రా, గుడ్డలువదలి దూకు నీళ్ళల్లోకి"

"ఎల్లా ? నేను స్త్రీని బదరీ!"

"అయితేయేం? నిన్ను మగవాడిలాగా భావించాలని అన్నావుగదూ! అందుకే నువ్వు ఆడదానివనేవిషయం మర్చిపో. రా, దూకునీళ్ళలోకి."

ప్రేమ చెప్పులు, ఉత్తరీయం తీసి, భద్రంగా ఒడ్డున పెట్టింది. ఎత్తయినరొమ్ముల్ని సిల్కుగుడ్డతో బిగించి నీళ్ళల్లోకి దూకింది.

చేపల్లా ఈదారు ఎంతోసేపు. ఒకర్నొకరు తోసుకుంటూ, దాటిపోతూ, నీళ్ళునిమ్ముకుంటూ చాలసేపు ఈదారు. చివరికి అలసి వొడ్డుకు చేరారు.

పచ్చికమైదానంలోకి వెళ్ళి, ఎండకు శరీరాలు వెచ్చబెట్టుకోనారంభించారు.

"ఇక్కడ హాయిగావుంది కదూ బదరీ!" మృదువుగా అన్నది ప్రేమ. గాలిలో తేలిపోతున్నట్టుంది ఆమె మనస్సు.

ఒకక్షణం కన్నార్పకుండా ప్రేమవైపు చూచాడు. ఆమెపైకి వొంగి, గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు. చేతిని పెదాలకు తాకించుకుని ముద్దుపెట్టుకొని, నిమిరాడు. మొదట ప్రేమ భయపడ్డది. కొంచెం చలించింది. చివరకు లొంగిపోయింది. ఆమెకళ్ళల్లోకిచూస్తూ అన్నాడు–"ఇప్పుడు హాయిగావుంది!"

ఆ వ్యంగ్యానికి తట్టుకోలేక ప్రేమ మొహం తిప్పుకుంది. ఆమెకళ్ళల్లోంచి బొటబొట అశ్రువులురాలాయి.

"నీకు బాధకలిగించానా ప్రేమ్?" అన్నాడు భయంగా బదరీ ఆమెకన్నీటికి అర్థం తెలుసుకోలేనిస్థితిలోవుండి.

"అవును, నే నెవర్నీ ప్రేమించలేదు. ఇప్పుడు నిన్ను ప్రేమిస్తున్నాను."

"నేనూ నిన్ను ప్రేమిస్తున్నానుగా!"

"మరి, అంత కోపంగావుంటావు దేనికి?"

"ప్రేమ ఎప్పుడూ అలాగేవుంటుంది–ఇచ్చేభాగంకంటే, పుచ్చుకునేభాగమే ఎక్కువ అందులో. ఎప్పుడూ ప్రేమ పొందదగిందే. ప్రతిదీ నాకే కావాలనిపిస్తుంది."

ప్రేమ అతనికళ్ళల్లోకి చూచింది.

"ఎప్పుడూ యిలాగే ప్రేమించగలవా బదరీ?"

"ప్రేమకు అపజయంలేదు. అలా అనంతంగా, అప్రమేయంగా చొచ్చుకుపోవలసిందే." బదరీతలత్రిప్పి ప్రేమ అతన్ని

తల తనరొమ్ముల పై చేర్చుకుని, ఆప్యాయంగా జుట్టులోకి వేళ్లు పోనిచ్చింది. బదరీ గారాబంగా, అమాయికంగా అన్నాడు—"ప్రేమనుగురించి నాకు ఎక్కువగా తెలీదు. ఎప్పుడూ ఎవర్నీ ప్రేమించి ఎరుగను. నువ్వు నేర్పాలి నాకు"

"చాలామంది స్త్రీలుచేసేపనే అది"

"చాలామంది ప్రేమ్. అందరికీ ప్రేమించటంరాదు. వాళ్లు జీవితంలో నేర్చుకోలేరు. అనేకమందిలో అవుపించేది కామం, తృష్ణ, వాంఛ – యివేగానీ, నిజమైనప్రేమ కాదు"

"నేనూ అలాంటిదాన్నేనా బదరీ ?"

"అలాంటిదానివి కాదు. నీవు మారిపోయావు. నీవు నాదానివి. నే ప్రేమిస్తున్న సౌందర్యరాశివి."

ఆమె గాఢంగా కావిలించుకుని, ముద్దుపెట్టుకుంది.

"నీకోసం తపిస్తున్నాను బదరీ ! నిజం. నీకోసం ఎంతవిలపించానని ! నీకు జ్ఞాపకంవుందా ఒకసారి అడిగాను–నువ్వెవరినైనా ప్రేమించావా అని. నువ్వేమన్నావ్ : 'లేదు' అని. అప్పుడెంత సంబరపడ్డానని! నాహృదయం ఎలా పరవశమైపోయిందో నీ కెలాచెప్పను ? మాటలు చాలవు. ఇప్పుడనుకుంటాను, నువ్వు ప్రేమించకుండా ఇంతకాలంవున్నది నాకోసమే నేమోనని"

"నా గతజీవితంగురించి నువ్వేంబాధపడవూ...?"

తన కనవసరమన్నట్లు తలాడించింది.

బదరీ పిచ్చిగా ఆమెను కౌగిట్లోకితీసుకుని, ఊపిరాడనంత యిదిగా ముద్దులవర్షం కురిపించాడు. అలసిపోయి, పచ్చికమీద వెల్లకిలాపడుకున్నాడు చివరకి.

"తర్వాత నువ్వే చిత్రం వేస్తావు?" అనడిగింది ప్రేమ.

"తెలుసుకోవాలని వున్నదా ?"

"ఊఁ"

"ఇద్దరు ప్రేమికుల్ని చిత్రిస్తాను. నువ్వూ - నేను"

"ఓ ! వొద్దు బదరీ వొద్దు. ఆపనిమాత్రం చెయ్యకు. యతులందరికీ మనవిషయం తెలుస్తుంది."

"తెలవనీ, ఏం తెలిస్తే! ప్రేమ, చంద్రిక దాచిపెడితే దాగుతాయా ?"

"బహుశా, నన్ను యిక్కణ్నించి పంపేస్తారు తెలిస్తే. విజ్ఞానందులకు ఈ ప్రేమవ్యవహారాలంటే మహామంట. బదరీ ! నాకు అజంతా అంటే ఎంతో యిష్టం. ఇక్కణ్నించి వెళ్ళిపోలేను నేను."

"నాకు తెలుసు. ఆ మాత్రం జాగ్రత్తగా వుంటాలే."

ఆమె ఆనందంలో పరవశం చెందింది. ఆమె పెదాలు అతనికోసం ఎదురుచూచాయి మెత్తగా, తియ్యగా. బదరీ ఆమెను తనహృదయానికి వొత్తుకున్నాడు. అలా ఎంతసేపు, ఎన్నినిమిషాలు, మధురక్షణాలు జరిగాయో తెలీదు. వాళ్లు వాస్తవప్రపంచంలో కళ్ళు తెరచేసరికి చీకటిపడింది.

రాంగుప్తయింట్లోవాళ్లకు అరమరికలు, ఆటంకాలు లేవు. హృదయపూర్వకంగా, ప్రేమగా ఆహ్వానించేందుకు వారుసిద్ధమే. ఇద్దరూ యింటికిరాగానే కమల బదరీనిచూచి మందహాసంచేసింది. ఆ నవ్వులో లజ్జ, సిగ్గు, ఆప్యాయత తొణికసలాడినయ్. "యిద్దరూ మళ్ళీ మాట్లాడుకుంటున్నా

రన్నమాట. బలేగావుంది ! మీరుమాట్లాడుకోరనుకున్నాను సుమా !'' అంది.

"మిత్రులంతాకలసి బలవంతాన మమ్మల్ని కలిపారు. మళ్లీ మాటలుకలిశాయ్. కలిసినందుకు సంతోషంగావుంది''

''అక్క నీలాగే దుస్తులువేసుకున్నా, ఆమెను ప్రేమిస్తావు నువ్వు.''

"ఆ, అన్నట్టు కమలా ! నువ్వొకసారి మా విహారానికి రావాలి సుమా !''

"ఎందుకో''

"నీచిత్రంఒకటి గీశాను. తలదువ్వి అలంకరించుకుంటున్న భంగిమలో చిత్రించాను. చాలా బావుందిలే''

"నిజంగానా! అక్కకు తెలుసా ఆ విషయం ?''

"అది నీదని తెలియదు. తనుగూడా సహాయంచేసింది దాన్ని చిత్రించటంలో. అది నీ చిత్తరువేనని తెలిస్తే అసూయ పడుతుంది''

కమలకు కడుపుబ్బనవ్వొచ్చింది. ఆమె నవ్వుతూంటే గుడిగంటలు మోగినట్లు ఘల్లుఘల్లుమంటుంది. నిండుగా నవ్వగలదు ఆమె.

"అంతవరకూ వెళ్ళిందన్నమాట వ్యవహారం!''

అంతలో రాంగుప్త లోపలకొచ్చాడు. "నాగదికి వెడదాం రా బదరీనారాయణ ! ఈమధ్య ఇంకొంచెం వ్రాశాను. కమలమూలంగా వ్రాయవలసివచ్చింది. ఆమెదే ప్రోత్సాహం.''

రాంగుప్త వెంట గదిలోనికి వెళ్ళిపోయాడు. వంటగది లోకి వెళ్ళింది కమల తల్లికి అక్కడకు సాయంగా.

రాంగుప్త క్రొత్తగా వ్రాసినభాగం యిచ్చాడు బదరీకి. అది నాట్యరీతులను గురించి వ్రాయబడ్డది. బదరీ ఉత్సాహంతో చదివాడు.

చిత్రలేఖనం, శిల్పం నాట్యకళలోని భాగాలే. నాట్యం అంటే సజీవశిల్పం. నాట్యం జీవితంలోని రసానందాన్ని అందిస్తుంది. నాట్యంవలన జీవితగతుల్ని మనం తెలుసుకోవచ్చు. అటు అంతర్జీవితాన్ని, బాహ్యజీవితాన్ని తెలియజేస్తుంది – చెట్లు చేమలు, కొండలు, కోనలు, చరాచరజీవరాసులఅంతర్జీవితాన్ని. ఇటు జీవులశారీరకావసరాలను ఛాయామాత్రంగా వ్యక్తంచేయగలిగినది కళ.

మానవునిఉద్రేకాలను, ఉద్వేగాలనుసైతం కళ. నాట్యకళ వ్యక్తంచేయగలదు. కొత్త ఆనందలోకాల్ని సృష్టించగలదు, సంతోషసాగరాన్ని సృష్టించగలదు. ఉన్నత భావుకలోకాల్లోకి ప్రేక్షకుణ్ణి, కళాకారుణ్ణి తీసుకుపోగలదు.

అవాస్తవికజగత్తునుండి, ప్రవిమలానందభావజగత్తు లోకి, రామణీయకప్రపంచంలోనికి. తీసుకుపోగలుగుతుంది. బాధామయజీవికి శాంతిసౌఖ్యాలు, వ్యథామయజీవికి రసానందం కలిగించుతుంది.

"మీరు వేదాంతమార్గం వదలి, నృత్య, శిల్ప, నాట్య కళలమీద ఎందుకువ్రాశారో నాకర్థంకాలేదు" అన్నాడు బదరీ ఆశ్చర్యంగా రాంగుప్త వేపు చూస్తూ.

"నిత్యజీవితంలో దీనిఉపయోగం అపారంగా అగుపిం చింది. వాంఛలు, కోరికలు లేని మానవుడంటూ వుండడుగదా! అలాగే తామసం, ఉద్రేకంకూడా మనిషికి సర్వసామాన్యం. తను బతుకుతున్న ప్రపంచంలో ఈ ఉద్రేకాలకు ప్రతివాడు గురికాకతప్పదు. అయితే, నృత్యం వీటిని అధిగమిస్తుందని కాదు. అవన్నీ అశాశ్వతమని ఋజువుచేసి, పరిపూర్ణానంద లోకాలతీరాలకు తీసుకువెడుతుంది" అన్నాడు రాంగుప్త.

"ఆధ్యాత్మికానందం అంటే మీ కెందు కంత యిష్టం?"

"అదే శాశ్వతమైనది కనుక. మన బాహ్యక్రియలన్నీ ఆత్మఅధీనంలో వుంటాయి. ఆత్మసౌందర్యాన్ని దర్శించగలిగితే, ఆత్మానందం పొందగలిగితే, మనజీవితాలు ధన్యమయినట్లే; శాంతిసౌఖ్యాలు లభించినట్లే"

"కమల మిమ్మల్ని ఉత్తేజపరచిందన్నారు, ఎట్లా?"

"ఆమె నాట్యంచేసింది. ఆమెఅడుగులకదలిక, ప్రతి చలనం నన్ను ముగ్ధుణ్ని చేసింది. ఆలోచనాపూరితుణ్ని చేసింది. ఏవో భావాలు కలిగినై. నీకు తెలియదూ ఈ జగత్తంతా ఈశ్వరసృష్టి అనీ, శివతాండవంలోంచి వుద్భవించినవే ఈ లోకాలనీ. మాటలు వ్యక్తంచేయలేనిభావాల్ని నాట్యం వ్యక్తం చేస్తుంది. నాట్యరాణి ఆంగికాభినయంలోంచి తప్పించుకోగల భావం అంటూ లేదు. లోకాలన్నీ ముగ్ధమోహనంలో ఆ అడు గులసవ్వడిలో, పదవిన్యాసంలో రూపొందుతాయి.

"కమల నాకోసం ఒకసారి నాట్యంచేస్తుందేమో అడ గాలి. చేస్తుందంటారా నే నడిగితే?"

"ఆమెకు నాట్యంఅంటే పిచ్చిమమత. అలాగే అడుగు దాం. నాకూ మళ్లీమళ్లీ చూడాలనేవుంటుంది కమల నాట్యం అంత చక్కగా చేస్తుంది"

రాంగుప్త ఒకనిమిషం బయటకువెళ్లి, తిరిగివచ్చాడు.

"కమల నాట్యంచేస్తానంది – 'సృష్టినృత్యం' రా వెడదాం. హాలు విశాలంగానుంటుంది గదూ అక్కడకు వెడదాం పద"

*  *  *  *

కమల నాట్యం ప్రారంభించింది, ఉద్రేకంతో ప్రారంభిం చింది. ఎంతో ఉత్సాహం, ఆవేశం ఆమెముఖంలో, అడుగు లలో, ప్రతిపదవిన్యాసంలో ప్రస్ఫుటమవుతోంది. 'శివ తాండవం' అని తెలుస్తోనేవుంది. కమల పురుషవేషంలో జింక చర్మంచుట్టుకొని, విభూతిరేఖలుదిద్దుకొని, వొంటినిండా బూడిద పూసుకుని, త్రిశూలం, డమరుకం చేతుల్లోధరించి, శిగముడిచి, రుద్రాక్షమాల చేతులకుకట్టి ఆవేశంలో కదిలింది. చూపులో, కట్టులో, వేషంలో పరమశివుడులా వుంది. కొండజాతి అనా గరికుడు రౌద్రంగా లోకంలోకి వొచ్చినట్లుంది. ప్రక్కనే మృదంగంవాయిస్తూ కమలనృత్యానికి సహాయంచేస్తోంది ప్రేమ.

కథాసారాంశం యిది :– సృష్టికిపూర్వం శివుడు రోద సిలో ప్రయాణంచేస్తున్నాడు. ఉద్రేకంగా నడుస్తున్నాడు. ఎటూ ఏమీ అవుపించటంలేదు. ఒక్కడే లోకంలో. మిగతలోకం యావత్తూ చీకటి. శూన్యం. ఏకాంతంలో నాట్యంచేస్తున్నాడు. అడ్డు అవరోధం లేవు ఆయనకు. జీవితాన్ని ప్రతిబింబించే నృత్యం అది. అదే శివసృష్టి. అనంతంలోనుండి, శివనృత్యంలో

నుండిమానవుడుద్భవించాడు, 'స్థితి' ఏర్పడింది. సృష్టించినమానవునికి స్థితిఏర్పడింది. జీవితం నేర్చుకున్నాడు. తర్వాత 'సంహార' నృత్యం స్థితిఏర్పడ్డ మానవునిమరణం ఎలా సంభవించిందో తెలియజేస్తుంది. జీవించటానికి అనర్హమైనవన్నీ మరణించవలసిందే. అదే దానితాత్పర్యం.

'సృష్టిస్థితిసంహార' నృత్యం చేసి, శివుడు అలసిపోయాడు. విశ్రాంతి అవసరమయింది. ఉద్రేకం తగ్గింది. తాండవనృత్యం తిరుభావం, అనుగ్రంలోకి మారింది. మరణించిన ప్రతిజీవి తిరిగి జన్మిస్తుంది. లోపాలనన్నింటినీ ఒక్కొక్క జన్మలో సరిదిద్దుకుంటూ చివరకు పరిపూర్ణత్వం పొందగలడు. జీవి. నృత్యం పూర్తిచేసి, సంతృప్తితో శివుడు కైలాసపర్వతం మీదికి వెళ్ళిపోయి, విచారణలో మునిగిపోయాడు.

బదరీ దాహదృక్కులతో నాట్యం చూచాడు. విశ్వశిల్పం, సృష్టిశిల్పం ఎంతో రమణీయంగా హావభావభంగిమలలో వ్యక్తంచేయబడ్డప్పుడు దీక్షగా తిలకించాడు. ఒక్కొక్క కదలికలో, అంగుళికంలో, వ్రేళ్లకదలికలలో, శరీరం తిరిగినవొంపులలో వూహించలేనన్నిభావాలు అగుపించాయి.

రాంగుప్తకూడా బదరీలాగానే నిశ్చేష్టుడై తిలకించాడు. అయినా, అతనిలో ఆలోచన రేగింది. సామాన్యులకు వట్టి ఆనందమే లభిస్తుంది. అతనికి ఆలోచనకలిగింది. నాట్యం అంతర్వాణిలాగా ఏవేవో జీవితరహస్యాలను రాంగుప్తకు ఉపదేశించింది.

* * *

"నాగదిలోకి వెళ్లి, వ్రాసుకుంటాను" అంటూ నిష్క్రమణ చేశాడు రాంగుప్త. ఆపినా ఆగని భావోద్వేగం కలిగింది. ఆలోచనలతో మెదడు సతమతమవుతోంది.

ప్రమీలాలజ సాలోచనగా బదరీవైపు చూచింది. అతని భావాలను, కదలికలను అర్థంచేసుకునే ప్రయత్నం ఆమెది. ఒక్కసారిగా వాస్తవలోకంలోకి వచ్చారు. 'ఓ! మర్చేపోయ్యాను. పొయిమీద మాడిపోతుంది" అంటూ వంటగదిలోకి పరుగెత్తింది.

బదరీ కమలవైపు చూచి అభిమానంతో, సిగ్గుతో తల వొంచుకున్నాడు.

"నీ నాట్యం కలిగించినఆనందం, మా చిత్రలేఖనం యివ్వలేదు కమలా!" అన్నాడు.

"ఈ నాట్యం కలిగించిన ఆనందాన్నిమించిన రసానుభూతిని కలిగించే చిత్రం ఒకనాడు మీరివ్వగలరు ప్రపంచానికి"

"పోనీ అలాగే అనుకుందాం; అలాంటిచిత్రం పూర్తికాకముందే ఈ బదరీ కన్నుమూస్తాడు. అది అసంపూర్ణంగానే వుండిపోతుంది. అసలు ప్రారంభించకముందే ముహూర్తందాటిపోవచ్చు"

"అలా అనకు బదరీ"

బదరీకి సమాధానంలేదు. ఏంసమాధానం చెప్పగలడు? కమల సౌందర్యాన్ని చూస్తుంటే మాటరావటంలేదు. భ్రమలో పడి కొట్టుకుంటున్నాడు. తిరిగితిరిగి తానుచూచిన నృత్యాన్నే స్మరణకు తెచ్చుకుని, కమలను ధ్యానిస్తున్నాడు.

ప్రేమ చీరకట్టి, రవికతొడిగి, వాలుజడవేసి, పూలు సింగారించి. రంగారుబంగారు బొమ్మలా ప్రత్యక్షమైంది. మేలిమి బంగారుచాయ ఆమెశరీరవర్ణం. అంతటిఅందం ప్రేమలో వుందని బదరీకి తెలియదు. ధోవతి, ఉత్తరీయం వేసుకుని సన్యాసిలావున్న ప్రేమనిజసౌందర్యం చూచి, నమ్మలేకపోతున్నాడు. తా నొగివున్న ప్రేమ ఈమేనా అని, ఆనందంతో పరవశం చెందాడు.

కమల అక్కవైపు ఓక్షణం కన్నార్పకుండా చూచింది· "బట్టలుమార్చుకుంటాను" అంటూ లోపలికి వెళ్లిపోయింది.

కమల ఆ మాటలు అనటంగాని, లోపలకువెళ్ళటం గానీ, బదరీకి తెలియదు. ఈలోకంలో లేడు. అతనిదృష్టులు, భావం, సర్వం ప్రేమమీాద కేంద్రీకృతమైనాయి. ప్రేమకు దగ్గరగా వెళ్లి, పొదివిపట్టుకొని, చేతుల్లోకి తీసుకున్నాడు.

"ఈ స్వప్నసౌందర్యం నాకోసమే గదూ !" అన్నాడు.

"నేను నీదాన్నేగా. తీసుకో. నన్నేతీసుకో నీలోనికి"

అమెకళ్ళల్లోకి చూచాడు. తేనెవాకలు, వెన్నెల వెలుగులు, ప్రేమభాసితాలు, కరడుకట్టుకున్న కోర్కెలు ఆ చూపుల్లో పొంగిపొరలుతున్నాయి.

"ఇంత అందంగా ఎందుకున్నావు ప్రేమ్ ?"

"నీహృదయంలో నా ప్రేమపుష్పాలు పరిమిళించాయి గనుక"

తనచేతుల్లో యిమిడి, కళ్ళల్లోకి చూపులునిగిడ్చి, ఆత్రంగాచూస్తున్న ప్రేమను... హృదయానికి హత్తుకుని గాఢంగా చుంబించాడు.

ప్రభుఘోష్ విజ్ఞానసంపత్తి గణనీయమైనది. ఏ గ్రహాలు ఎక్కడ వుండేది, హాటిబలాబలాలు ఎలాంటివో, ఎవరిజీవితం మీద ఎలాంటిశక్తి వున్నది, అతనికి అవలీలగా తెలుస్తుంది. చిన్నపిల్లలు ఆటవస్తువులతో ఎల్లా మురిసిపోతారో, రాత్రిళ్ళు నక్షత్రగమనాన్ని చూచి, ఘోష్ అలా సంబరపడతాడు. అతనికి మొదట అజంతాకావాలన్నతలంపు లేదు కాని, రాక తప్పలేదు. అంతకుమించినవిజ్ఞానకేంద్రం అతనికికనుపించలేదు. అంతకన్న గత్యంతరంలేక, అజంతా చేరుకొన్నాడు. అక్కడకు రావటం మహాద్భాగ్యమని తర్వాత అనుకున్నాడు. జీవితంలో తానుచేసిన మహత్కార్యం జనసమూహంనుండి నిర్జనప్రదేశంలోకి – అజంతాకు రాగల్గడమే. అక్కడ నిశ్చింతగా, నిర్విరామంగా తనకృషి సాగుతోంది. అక్కడ బౌద్ధయతులు, సన్యాసులు అనేకమందిపరిచయం కలిగింది. వారిజాతకాలను పరిశీలించి, గ్రహబలం ఎవరెవరికి ఎలావున్నదో వివరించి చెపుతూ అందరికి తలలోనాల్కగా పరిగణించబడుతున్నాడు.

ఒకరోజు ఆచార్య విజ్ఞానందుని దర్శించాడు.

"పదిరోజులకు బుద్ధునిజన్మదినం వస్తున్నది. పదివందల సంవత్సరాలకుపూర్వం అదేరోజున బుద్ధభగవానులు జన్మించారు. నక్షత్రాలను లెక్కించాను. చక్రంవేశాను. నా లెక్కలనుబట్టి వచ్చేపౌర్ణమి బుద్ధజన్మదినం" అన్నాడు.

విజ్ఞానందులకు పరమానందమయింది. ఘోష్‌పట్ల ప్రేమ, గౌరవం కలిగాయి. ఈ శుభవార్త చెప్పినందుకు ప్రభుఘోష్ సూచించిన లెక్కలను, జాతకచక్రాలను పరిశీలిం

చాడు. యథార్థం . అనిపించింది. అది పవిత్రమైనదినంగా పరిగణించాలని నిశ్చయించాడుకూడా.

"ఆ రోజు మనం పర్వదినంగా పరిగణిద్దాం. దాన్నే బుద్ధ జయంతి" అందాం.

ప్రార్థనకోసం అందరూ చైత్యంలో సమావేశమైనప్పుడు, బుద్ధజయంతి వేడుకలు ఎలాజరపాలన్న ప్రసక్తితీసుకు వచ్చాడు. యతుల్ని పృఛ్ఛించాడు.

"బుద్ధజయంతి యిప్పటికి సరిగా పదిరోజులున్నది. పది శతాబ్దాలకుపూర్వం భగవానులు ఆరోజునే జన్మించారు. మహోత్తమంగా మనం ఆరోజున వేడుకలు జరుపుకోవాలి. ఏం చేద్దామో మీసలహాలు యివ్వండి "

శ్రవణులలో కలకలం బయలుదేరింది. గుసగుసలు సాగాయి. కొంతసేపు అలా రహస్యసంభాషణలు జరిగిన మీదట ఒక రన్నారు —

"పవిత్రమైన బుద్ధదేవునిజీవితం నాటకంగా ప్రదర్శించటం మంచిది."

"ఎవరు వ్రాస్తారు నాటకం ?" విజ్ఞానందులప్రశ్న.

"దేవపాల్‌కవి" ప్రేమకుమారి సూచించింది.

ఆచార్యులు సమావేశమైన భిక్షువులముఖాల్లోకి చూచాడు. కొందరు నవ్వుతున్నారు. కొందరు గేలిచేస్తున్నారు, కొందరి ముఖాలు వాడిపోయివున్నాయి.

"దేవపాల్ ! వ్రాస్తావా నాటకం ?"

దేవపాల్ వినమ్రుడై నిలబడి "వ్రాస్తాను ఆచార్యా" అన్నాడు.

"అయితే త్వరగా వ్రాయి. నటుల్నికూడా సిద్ధం చేసుకో. మనమిత్రులలో ఎవరు తగినవారనుకుంటే వారిని తీసుకో. అంతేనా, యింకేమైనా ?"

"నృత్యాలుకూడా మంచివి" బదరీ సలిహాయిచ్చాడు.

"నృత్యంచేయగలవా రెవరు ?"

"కమలాకుమారి, లోయలో నివశిస్తున్న రాంగుప్త గారి అమ్మాయి. మనప్రేమానంద్ చెల్లెలు"

"బావుంది సలహా, అలాగే ఏర్పాటుచేద్దాం"

"ఇంతమందిమగవాళ్లమధ్య ఒక స్త్రీ నాట్యంచేయటమా !" నాగోజీ అభ్యంతరం తెలియజేశాడు.

విజ్ఞానందులు ఒకక్షణం మౌనంవహించి, చెప్పాడు—

"మనమంతా పరమార్థసాధనకోసం యిక్కడ చేరాం. కమలనృత్యాలు మనకి పరబ్రహ్మచింతన కలుగజేస్తాయి కాని, సామాన్యకామనలను కలిగించవు. నేను కమలను బాగా ఎరుగుదును."

"పరిసరగ్రామాలనుండి గ్రామీణులనుకూడా ఆహ్వానిద్దామంటారా ఆచార్యా ?" ఒక భిక్షువు అడిగాడు.

"మరీ మంచిది. నాటకాలవల్ల, నాట్యాలద్వారా బౌద్ధ సిద్ధాంతాలను సులువుగా బోధించవచ్చు - అలాగే తప్పక ఆహ్వానిద్దాం. సాధ్యమయినంత ఎక్కువమందినే రప్పిద్దాం. ఇదిగో, ఆంజనేయులూ ! నీవు ఆ కార్యక్రమం చూడు. అన్నిగ్రామాలకు మనవారిని పంపి, జయంతికి అందరినీ రమ్మని ప్రచారంచేయించు"

ఆంజనేయులు లేచి, విజ్ఞానందులకు నమస్కారంచేసి, అంగీకారం తెలియజేశాడు. భిక్షుకగణంలో ఆంజనేయుల్ని మించిన బలశాలి లేడేమో! మంచి శరీరదార్ఢ్యం కలవాడు. కావటానికి సన్యాసేకానీ, అతనిఆలోచనలు, భావాలు సాంసారికమే. ఎప్పుడు వక్రమార్గాన పయనిస్తుంటాడు. రాంగుస్తవలె పొడుగరి. అందగాడు. బదరీకి అతన్నిచూస్తే ఆశ్చర్యంవేస్తుంది, యిలాంటివ్యక్తికిఅజంతాకళాతీర్థంలో ప్రవేశం ఎలాలభించిందా అని. రంగురంగులదుస్తుల్ని ధరించి, దేహసౌందర్యాన్ని పోషించుకోవటంలో సిద్ధహస్తుడు. తాత్వికచింతనకంటే, దేహసౌందర్యాన్ని పోషించుకోవటంఅంటే ఆసక్తి హెచ్చు. అతని అలంకరణలు చూచి శ్రమణసోదరులు అసూయచెందేవారు. అతను నిజానికి అజంతాకు చేసింది ఏమీలేదు. ఒక్క చిత్రంగానీ, ఒక శిల్పంగానీ అతనివల్ల తయారుకాలేదు. అతనుచేసినసేవ అటు గ్రామాలకు వెళ్ళి, యింటింటికి తిరిగి, బౌద్ధధర్మాలను బోధించటంమాత్రమే. బోధిసత్వునిజీవితగాథలను వర్ణించటంలో అందెవేసినచేయి. జన్మతః కథకుడేమోననిపిస్తుంది. ఎక్కడికి వెళ్ళినా, ఎన్నిగ్రామాలు, నగారాలు తిరిగినా, ఎందరికి బోధ చేసినా, తిరిగి అజంతాకు రావలసిందే. "ఇక్కడే నాకు ఆనందంగా వుంటుంది" అంటాడు.

బుద్ధజయంతికి కార్యక్రమాన్ని పూర్తిచేసుకున్న తర్వాత విజ్ఞానందులు దాని ప్రాముఖ్యాన్ని గూర్చి ఉపన్యసించారు. చివరకు సమావేశం సమాప్తమయింది.

* * * *

సమావేశానంతరం విజ్ఞానందులు నదీలోయలోనికి వెళ్ళి, మిత్రుడు రాంగుప్తను కలుసుకోవాలని నిశ్చయించు కున్నాడు. తనవిహారానికి వెడుతున్న బదరీని ఆపి అడిగాడు- 'బదరీనారాయణా! నేను అలా లోయలోకి వెడుతున్నాను. రాంగుప్తను కలుసుకుని చాలకాలం అయింది. ఒకసారి కలుసు కొనివద్దాం వస్తావా? మరేంపనిలేదుగదా?"

"అలాగే వెడదాం ఆచార్యా!"

"కొంచెం తోడుగావుంటావని, అంతే"...

"ఫరవాలేదు, వెడదాం నడవండి"

పోతూ, త్రోవలో అనేకవిషయాలు ప్రస్తావించు కున్నారు. ఆచార్య విజ్ఞానందులు బదరీని అనేక పశ్నలువేశాడు బదరీ ఎక్కడినుండి వచ్చింది, ఎందువల్ల వచ్చింది - అతను వ్యక్తిగతంగా అజంతాజీవితాన్ని ఎలాభావిస్తున్నదీ - యిలాంటి ప్రశ్నలే అన్నీను.

"మా స్వగ్రామం కుటీరావతం అనే ఓ కుగ్రామం ఆచార్యా! ఉజ్జయినిలో కొంతకాలం విద్యాభ్యాసంచేశాను. అక్కణ్నించి నలందా, విక్రమశీల, వల్లభి మొదలైన కళా తీర్థాలుసేవించాను..."

"అలాగా. అంటే విక్రమశీలలోకూడా కొంతకాలం వున్నావన్నమాట?" అని ఆచార్యులు ప్రశ్నించాడు.

"షుమారు అర్థసంవత్సరంపాటు వున్నాను"

"ఇప్పుడు అక్కడివిద్యాలయం ఎలావున్నది?"

"ఇప్పుడెలావుందో నాకు తెలీదు గురుదేవా! నేను అక్కడవున్నప్పుడే పతనావస్థ ఆరంభమైంది. అక్కడి ఆచా

ర్యులు - అనగూడదుకాని- ఒక్తి,స్త్రాగుబోతులు, వ్యభిచారులు. అలాంటివారి ఆధ్వర్యాన నడిచే విద్యాలయం పతనంకాక ఏమవుతుంది ?" నిట్టురుస్తూ అన్నాడు బదరీ.

"ఇప్పటికి పూర్తిగా పతనమైవుంటుంది నిస్సంశయంగా. మరికొన్ని రోజులకు విద్యార్థులే వుండరు. పూర్తిగా నాశమై పోతుంది." అర్ధనిమీలితనేత్రుడై, ఆలోచనానిమగ్నుడై అన్నాడు ఆచార్యులు.

"మీకు ఆవిషయం బాగా తెలుసుననుకుంటాను. అక్కడ తమరు విద్యార్థిగా వున్నారా ఎప్పుడైనా ?"

బదరీ అడిగినప్రశ్నకు విజ్ఞానంద్ ముఖంలో అనేక రంగులు కన్పించాయి. కళ్లు బరువుగా మూతలుపడ్డాయి. అయినా, ఆయన పెదాలపైన అర్థంకానినవ్వు అగుపించింది. ఒక్కసారిగా నిట్టూర్చి అన్నాడు —

"అవును. నీవన్నట్లు అక్కడ కొంతకాలం చదివాను. నేను అజంతాకి రావటానికి ఆ విక్రమశీలయే కారణం"

" ఎలా? " అన్నట్లు విజ్ఞానంద్ కళ్లల్లోకి చూచాడు బదరీ.

"అదొక పెద్ద విషాదగాథ బదరీ !"

"వినగూడదా ఆచార్యా ! రండి, అలా యిసుకతిన్నె మీద కూర్చుందాం. మిమ్మల్ని గురించి తెలుసుకోవాలని ఎప్పటినుండో కుతూహలంగావుంది."

ఇద్దరూ కొంతదూరం నడిచారు. జలజలప్రవహించే నదీ జలాలధ్వనులు వినిపిస్తున్నాయి. తరంగాలు అంచులకు కొట్టు కుని, ఎగిరెగిరిపడుతున్నాయి. కొంచెం ఎత్తయిన కొండ

రాయిపై విజ్ఞానందులు, యిసుకపైన బదరీ కూర్చున్నారు. ఆచార్యులు వేడినిట్టూర్పు వదలి, జీవితపుటలను తిరుగవేయ నారంభించారు.

"నా అసలుపేరు విజ్ఞానగోత్రుడు. పుట్టింది బ్రాహ్మణ కుటుంబంలో. చిన్నతనంలో అందంగా వుండేవాణ్ణి. అందంగా వుండటంవల్లనెమో గర్వంగావుండేది. అందుకు మరోకారణం చిన్నతనంలోనే, వేదవేదాంగాదిఉపనిషత్తులు క్షుణ్ణంగా కంఠతా వల్లించటం. ఎవరూ నాతో వాదించగలిగేవారుకారు. చివరకు దిగ్గజాల్లాంటిపండితులుకూడా జడిసిపోయేవారు. అందరికీ భయం నన్నుచూస్తే. శాస్త్రవిషయాల్లో అందర్నీ చిత్తుగా ఓడించేవాణ్ణి నిజంగానే. నాన్నకు నన్నుచూస్తే సంతోషం ఇంతవాణ్ణిగదా అని. కొమ్ములుతిరిగిన పండిత ప్రకాండులే నా ధాటికి తట్టుకోగలిగేవారుకారు, వాళ్ళలోపాలను యిట్టే గ్రహించేవాణ్ణి. వాళ్లు సత్యాన్ని దుర్వినియోగంచేసి, శాస్త్రాలను స్వప్రయోజనాలకు ఉపయోగించుకుంటూంటే దెబ్బలాడేవాణ్ణి. శాస్త్రం, సత్యం, న్యాయం, వాటివిలువలు, యథార్థాలు వ్యక్తుల్ని, వారినడవడికల్ని సమర్థించటానికి కాదుగదా నిజానికి. అదీ నా వాదం.

ఇరవైరెండేళ్లు వచ్చినయ్, నాకూ పెళ్లిచెయ్యాలనుకున్నారు మావాళ్లు.

అప్పుడు పెళ్ళంటే, ప్రేమంటే, స్త్రీ పురుషసంబంధాలంటే ఏవగింపు నాకు. అదే చెప్పాను. నాకు పెళ్ళిచేసుకోవాలనేకోరిక లేదు. ఇంకా చదవాలనివున్నది. విజ్ఞానాన్నార్జించా

లినివుంది. ఆ దాహంతీరేవరకూ చదువుతూనేవుంటాను అని చెప్పాను.

"అదెలా సాధ్యంరా నాయనా ?" అన్నారు నాన్న.

"ఏం ? ఎందువల్ల సాధ్యంకాదు ? మనదేశంలో విశ్వ విద్యాలయాలకు కొదువలేదు. వెళ్ళిపోయి, ఏప్రముఖవిద్యా లయంలోనో చేరి, కొంతకాలంపాటు చదువుకుంటాను. విసుగు పుడితే తిరిగివస్తాను. వెళ్ళక తప్పదు" అన్నాను.

"ఏవిశ్వవిద్యాలయానికి వెళ్ళాలని ?" అన్నారు.

"విక్రమశీల..."

"ఏమైనా మతిపోయిందా విజ్ఞగోత్రా? ఆ విశ్వవిద్యా లయాలకు వెళ్ళి, నీవు నేర్చుకునేదేమిటి ? ఇప్పటికే సర్వ శాస్త్రాలు నీకు కరతలామలకములు. నీలోనే ఓ మహావిద్యా లయసంపత్తి వున్నది. అధికంగా కావాలని, పొందాలని వాంఛించటం మంచిదికాదు. జీవితంలో నిలకడ, సంతృప్తి అవ సరం. అదిలేనినాడు ఎందుకూ పనికిరాకుండాపోతుంది నీ విజ్ఞానం." అని కోప్పడ్డారు.

అయినా, నాకు సంతృప్తిలేకపోయింది. ఎన్నిమాట లన్నా లెక్కచెయ్యలేదు. కొత్త కొత్త విషయాలు నేర్చు కోవాలని మనస్సుఆరాటపడుతోంది. మానవునిమనస్సు ప్రవ హించే నదీజలాలవంటిది. ఎన్నిమెలికలు ఎన్నివొడుదుడుకులు ! అన్నీ వుంటాయి మరి. దానికి కరకట్టలువేయటం సాధ్యం కాదు. అన్ని అవాంతరాలు అధిగమించాల్సిందే. అందు లోనూ వరదలురావలసిందే. కట్టలు తెగిపోవలసిందే. అప్పటికి గానీ స్థిమితంచిక్కదు.

అనుకున్నట్లు, భావించినట్లు విక్రమశీలకు వెళ్ళాను. నే వ్యూహించుకున్న లోకంలో అడుగుపెట్టాను.

యువకుణ్ని; తెలివితేటలున్నయ్. పట్టుదలవుంది. ఇంకేం కావాలి ? ఇవి చాలు విద్యార్థి దశలో. అందువల్ల నే కొద్ది రోజుల్లోనే అక్కడివారికి తలలోనాల్కగా తయారయ్యాను. అది మహోత్తమవిశ్వవిద్యాలయం. విజ్ఞానధనులైన ఆచార్యులు ఎందరో వుండేవారు. వారి వేదాంత, మత, తాత్త్వికోపన్యాసాలకు ముగ్ధుణ్నయేవాణ్ని. అనుభవం, జ్ఞానం వారిబోధనల్లో మేళవించి వుండేవి. అందుకే వారిలో అంత ఆకర్షణ వుండేది. యుగయుగాలవిజ్ఞానతేజస్సు అగుపించేది వారిలో. వారి ప్రశాంత ప్రవిమలవదనమండలాలు ఆకర్షణీయంగా వుండేవి.

అయినా, వారితో అనేకవిషయాల్లో ఏకీభవించలేక పోయేవాణ్ణి. కొన్నివిషయాల్లో వాగ్వివాదాలు పెరిగేవి. కాని, వెనుకంజవేసేవాణ్ణికాను నేను. వారిని ఓడించకపోయినా, అదొక సంతృప్తి అప్పట్లో. నాధోరణికి, ధాటికి సాటి విద్యార్థులు నిర్విణ్ణులయేవారు. ఆచార్యులకు నిజంగా సహనం ఎక్కువ. వారితో అంతగా వాదించినా, కోపగించుకునేవారు కాదు. అది వారితార్కికదృష్టిని వినిర్మలంచేయటానికే అవకాశంగావుండేది అనేవారు. తమ అనుభవంలో నాలాంటి వ్యక్తిని చూడలేదని చెప్పేవారు.

వారికి ఎదురుతిరిగి, వాదించినా నేనంటే అందరికీ అభిమానంగావుండేది. వాళ్ళతో చనువుకు అవకాశాలు ఎక్కువగా వుండేవే. అయినా, వాళ్లనెప్పుడూ నిందించేవాణ్ణిగాను. విశ్వవిద్యాలయంఅంటే ప్రేమ. ఆచార్యులు, పూజ్యులు అంటే

మక్కువ, గౌరవం. అయినా, అద్వాలరకంద్రుష్టి అలవడింది అక్కడ అప్పట్లో నాకు.

అలా ఆచార్యులు చెప్పుకుపోతున్నారు. బదరీ అన్యాసక్తంగా అగుపించాడు వారిద్రుష్టికి.

"బాగాలేదా బదరీ?" అని ప్రశ్నించాడు మధ్యలో.

"నే నమ్మలేకుండావున్నాను ఆచార్యా! మీరు ఒకనాడు గర్వంగావుండేవారని చెబుతుంటే, నమ్మశక్యంకాకుండా వుంది మీకై మీరుచెప్పినా ఈవిషయాలు నమ్మదగ్గవిగా అగుపించటంలేదు సుమండీ"

"చెబుతా... తెలుసుగా విక్రమశీల నలందా దగ్గర దగ్గర నగరాలేనని. నలంద బౌద్ధబోధలకు కీలకస్థానం. అయినా, విక్రమశీల పతనమైంది."

"అక్కడ 'గహ్యాసమాజం' అని ఒకపుస్తకం వుండేది అప్పట్లో. అందులో బౌద్ధతాంత్రికాలన్నీ విడమరచి వ్రాయబడివుండేవి. అందులో బుద్ధుడు పచ్చివ్యభిచారిఅనీ, స్త్రీలోలుడనీ, సౌందర్యరాసులైన దేవతాస్త్రీలను లోబరచుకుని, శారీరకసుఖాలు అనుభవిస్తూండేవాడనీ, మాంసం, మధువు, స్త్రీ అనవరతం వుండాలనీ వుండేది. అదిగాక, మరికొన్ని గ్రంథా లుండేవి. సత్ప్రవర్తన, న్యాయం, ధర్మం-వీటినిగురించి చెప్పేవి. ఒకసారి ఏంజరిగిందంటే - అక్కడో విద్యార్థిసన్యాసి మధువుసేవించటం బయటపడ్డది. అది ఎక్కడిదీ అని ఆరాతీస్తే రోజూ అత నొక భిక్షుకిని కలుసుకుంటూంటాడనీ, ఆవిడ రోజూ అతనికి మధువుయిస్తూండేదనీ, అతనికీ ఆవిడకూ శారీరక సంబంధంకూడా వున్నదనీ తేలింది. అధికారులు అతనిమీద

క్రమశిక్షణాచర్యతీసుకున్నారు. అంతలు కల్లోలం చెలరేగింది. ఈ గాథలన్నీ తెలుసుకున్నప్పుడు, బుద్ధుడన్నా, బౌద్ధమతమన్నా అంతులేని అసహ్యం వేసింది నాకు. ఇంక అక్కడ వుండ బుద్ధికాలేదు.

* * * *

అప్పుడే జీవితంలో తొలిసారిగా అనుభవం కలిగింది. స్త్రీసాహచర్యంవల్ల లభించే ఆనందం మొదటిసారిగా అనుభవించగలిగాను. విక్రమశీలవిశ్వవిద్యాలయంలో ఆచార్యుల అనుగ్రహం పొందటంవల్ల ఎప్పుడు ఎక్కడికి వెళ్ళాలన్నా అభ్యంతరం వుండేదికాదు. అదొకఅవకాశం నాలాంటివారికి. ఆ అవకాశాన్ని పురస్కరించుకునే నగరంఅంతా తిరిగేవాణ్ణి. విద్యార్థినికావటంవల్ల ఎక్కడా అవరోధం కలిగేదికాదు. బౌద్ధ విద్యాలయంవాణ్ణికావటంచేత ఎవరికీ అపకారంచేస్తానసే భయం లేదు. ఆ హోదాతోనే కలుసుకున్నాను. ఆమె దేవదాసి. మంచి సౌందర్యవతి. అసలు సౌందర్యం అప్సరసల ద్వారా దేవదాసీలకే సంక్రమించింది. అందులో యవ్వనం. ప్రకృతిలో ఉషఃసౌందర్యం ఎలాంటిదో ఆమెలోని యవ్వనపు శోభ అలాంటిది. పున్నమిచంద్రికలరంగు ఆమెశరీరచ్ఛాయ. అసలు 'దీప్తి' అనే ఆమె పేరులోనే వెన్నెలవెలుగులు ఉదయపుగాలులు, కాంతిపుంజాలు అలముకొనివున్నాయి.

ఆమెను ప్రేమించాను. దీప్తి అనురాగంకోసం ఉవ్విళ్లూరాను. ఆమె అంగీకారంకోసం ఘోరమూగతపస్సుచేశాను. కుర్రవాణ్ని, విద్యార్థిని, బౌద్ధుని కావటంవల్ల మనసులోని మమత నెవరికీ చెప్పుకోలేక లోలోపలే బాధపడ్డాను. రహ

స్యంగా ఆమెకోసం పడ్డవేదన వర్ణనాతీతం. కొన్ని నెలలు అలా భూలోకనరకం అనుభవించాను నాలోనేను. ఒకరికి చెప్పుకునే స్థితి లేదు. ధైర్యంతక్కువ. ఆచార్యులతో ఘోరంగా పోట్లాడే నాకు ఈ విషయంలో ధైర్యంలేకుండాపోయింది.

చివరకు నిర్ణయించుకున్నాను ఒకరోజు - దీప్తియింటికి వెళ్ళి, మనసులో విషయాన్ని చెప్పేద్దామని. ఎవరికీ భయపడే వాణ్ణికాను, ఏవిషయంలో వెనుకంజవేసిఎరుగను. అపజయం అంటే తెలీనినేను ఆమెయింటిముందు ఆగిపోయాను. లోపలికి అడుగుపడ్డదికాదు. గ్రీష్మంలో ఎండుటాకులాగా వొణికి పోయాను.

వెళ్ళి బయటివాకిలితలుపు తట్టాను. ఎవరో ఒకావిడ వచ్చి, లోపలకు తీసుకెళ్ళింది. కలలో గాలిలో నడచినట్టుగా వుంది.

దీప్తి నావైపు అదోలా చూచింది. సిల్కుపరుపుమీద ఓరగా పడుకునివుంది. తాంబూలంతో ఎరుపెక్కినపెదాలు, కాటుకదిద్దినకళ్ళు, తిలకంబొట్టు కన్పించాయి. నన్నుచూచి తొణకలేదు, బెణకలేదు. అసలు నేను అనేఒకవ్యక్తి వచ్చినట్లే గమనించనట్లు ప్రవర్తించింది. అప్పుడు దీప్తిచూచినచూపులు ఇప్పటికీ తలచుకుంటే నన్ను కలవరపెడతాయి. ఆ చూపుల్లో ఎన్నికోరికలు, ఎన్నిఆహ్వానాలు, వలపులు యిమిడివున్నాయి! ఏంచెప్పాలో నాకు తోచలేదు. ఆమెవైపు చూచాను. ఆమె రూపం నిండుగా నాహృదయఫలకంమీద హత్తుకుపోయింది ఆక్షణంలో. తర్వాత భయంవేసింది.

"ఏంకావాలబ్బాయ్ ?" అన్నది. స్తంభించిపోయాను. అబ్బాయిని ! అవును విద్యార్థిని. అంతకన్న గౌరవంగా ఎలా పిలుస్తుంది ? తలవూపి, సమాధానంకూడా చెప్పలేనిదైన్యం నాచుట్టూ ఆవరించివుంది. నా మౌనం గమనించి, అక్కడున్న వారందర్నీ పంపివేసింది. అప్పుడు ఏకాంతంలో ఆమెను చూచాను. మరీ సుందరంగా అగుపించింది. నాలుక నోటికి అతుక్కుపోయింది. మాటరాలేదు – అప్పటికీ భయం తగ్గిందికాదు.

దీప్తి నాచేయి పట్టుకుంది. మెత్తగా, నున్నగా మృదువుగా హాయిగావుంది ఆ క్షణంలో. కలలో తేలిపోయాను. అలా చేయిపట్టుకొని, పరుపుమెత్తమీద కూర్చోపెట్టింది. నాపక్కన తనూ కూర్చుంది. ఆమెకేసి చూడటంతప్ప మరో పనిచేయలేకపోయాను. నా స్థితి చూచి, దీప్తి కలవరపడ్డది. కోపంరాలేదు నయం. అనూహ్యమైనకాంతి ఏదో ఆమె కళ్ళల్లో నా కగుపించింది ఆ క్షణంలో. తక్షణం లేచి, నేను వెడుతున్నా"అన్నాను. ఆమె దానికి సమాధానం ఏంచెప్పిందో తెలీదు. వెంటనే వెనుదిరిగి పారిపోయాను.

అంతటితో కథపూర్తిఅయితే బావుండేది, నాధైర్యం అలా పిరికిబట్టలుకప్పుకునివున్నా బావుండేది. కాని, ఏదో ధైర్యంకలిగి మర్నాడు మళ్ళీ ఆమెదగ్గరకు వెళ్ళాను. రాత్రంతా మనస్సుతో ఘోరయుద్ధంచేశాను. దానిఫలితమే ధైర్యంగా మరునాడు దీప్తిముందు నిలబడగలగటం. ఆమె మందహాసం చేసింది. కళ్ళు మెరిశాయి.

"మళ్ళా ఏంపనిమీాద వచ్చావ్ ?" అని అడిగింది ఆ నవోఢ.

"నీకోసం. నిన్ను ప్రేమిస్తున్నాను" అన్నాను.

నాలోకి ప్రశాంతంగా చూచింది. ఆ ప్రేమఅనేమాట ఆమెలో ఎలాంటికదలిక తీసుకురాదని విన్నాను అనేకమంది చెప్పగా. కాని, నేను ఆమాట అనగానే ఆమెముఖంలో వెలుగు అగుపించింది.

"నిజంగానా ?" అన్నది.

"అవును. ఎంతగానో చెప్పలేను" అన్నాను - అప్పుడు నా కళ్ళనుండి జొలజొట నీళ్ళుకారాయి. ఉద్రేకం అణచుకో లేకపోయాను. మళ్ళీ అన్నాను తొట్రుపడ్డగొంతుకతో" నిన్ను ప్రేమిస్తున్నాను స్త్రీ !"

నా స్థితిచూచి, నా నిర్ణయం విని ఆమె కలవరపడింది. నాదగ్గరగా వచ్చి, విధేయతగా అన్నది– "నేను దేవదాసిని; వేశ్యను. నన్ను ప్రేమించటంవల్ల ప్రయోజనంలేదు. ప్రతివానికీ నన్ను ప్రేమించేహక్కుంది. ఎందరికో నా ప్రేమను అమ్ము కున్నాను. నాకోసం నీ పవిత్రమైనభావాలను మలినంచేసుకో వద్దు." అని చెప్పింది.

"నువ్వు ప్రేమను అమ్ముకోలేదు; సుఖాన్ని అమ్మావు" అన్నాను. అవును మరి. ప్రేమ అమ్ముకొనేవస్తువు గాదు. అమ్ముడుపోయేవస్తువూ కాదు. ప్రేమ ఉదారంగా ఒకరికి ప్రసాదించబడగలది మాత్రమే.

ఆమె నాకళ్ళల్లోకి చూచింది. మునివ్రేళ్ళమీద నిలబడి, నా నోటిని ముద్దుపెట్టుకుంది. చలించలేదు నేను. అలాగే వుండిపోయాను,

"నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా భిక్షూ!" అని అడిగింది.

"అవును. నువ్వు ఏదికావాలన్నా యిస్తాను. నా ప్రాణం కావాలన్నా యిస్తాను. నీప్రేమకోసం ఏది త్యాగం చేయలేను?" అన్నాను.

"అయితే, నేను నీదాన్నే" అంటూ చేతుల్లో వాలిపోయింది. దీప్తికళ్ళు నీరవంగా నవ్వినయ్.

*  *  *  *

ఇక ఎక్కువకాలం దీప్తితో నేగడుపుతున్నాను. ఇప్పుడు ఆచార్యులతో వాదోపవాదాలు లేవు. తర్కాలు లేవు. అసలు వాటికోసం దుర్వినియోగంచేయటానికి తీరికేదీ? ఉన్న కొద్ది అమూల్యకాలం దీప్తితో గడపటానికే చాలటంలేదు. ఒక్క దీప్తినిమినహాయించి మరోఆలోచన, విచారణ లేదు నాకు. దూరంచేసుకోలేను ఆమెని. ఆమె కనిపించనిదే వుండలేను నేను. నాకు నేనే పూర్తిగా ఆమెకు అంకితమైపోయాను. ఆమె ప్రేమకు దాసుణ్నయిపోయాను.

రోజులు గడచినకొలది, దీప్తికి ప్రేమతత్వం అర్థమవుతోంది. నన్ను ప్రేమించటం నేర్చుకుంది. ప్రేమ ఎంత పవిత్రమైనదో తెలుసుకున్నది. గత కలుషజీవితానికి తిలోదకాలిచ్చి, పూర్తిగా కొత్తజీవితం ప్రారంభించింది. విద్యార్థుల్లో కలకలం బయలుదేరింది. అందరూ మాగురించి చెప్పుకునేవారే.

అయినా, అధికారులు వాళ్ళనానుడి లెక్కపెట్టలేదు. నన్ను భయపెట్టారు. సత్ప్రవర్తనగా లేకుంటే విద్యాలయంనుండి వెళ్ళిపోవలసివుంటుందని బెదరించారు.

దీప్తిసాహచర్యంలో ఆనందం, సంతృప్తి, శాంతి లభించినయ్. ఒకసారి అన్నాను దీప్తితో –

"ఈ ప్రేమవ్యవహారాలకు నేను అసమర్థుణ్ణనుకునేవాణ్ణి. అలాంటివాణ్ణి ఓ తండ్రిని కాబోతున్నానంటే నాకు నేనే నమ్మలేకుండావున్నాను."

ఒక్కొక్కసారి దీప్తి విముఖంగావుండటంచూచి, అనేవాణ్ణి "నువ్వేదో, దేన్నిగురించో బాధపడుతున్నావు. అది కాస్త చెప్పకూడదూ?" అని.

"ఏమీలేదు విజ్ఞా! నాకు విచారం దేనికి?" అనేది.

"అబద్ధంఆడుతున్నావు. అబద్ధంఆడుతున్నావని నీమాటల్లోనే తెలుస్తోంది. నాగురించే కదూ! అవును, నాకు తెలుసు నాగురించేనని. ఎక్కడికైనా వెళ్ళిపోతానేమోనని నీభయం. అవునా?"

"కాదు విజ్ఞాన్. నీవు వెళ్ళిపోతే, నే చనిపోతాను. నీవులేనిదే నే బ్రతకలేను. నన్నువొదిలి వెళ్ళవుకదూ!"

"పోను. ఎలాపోగలను? నా ప్రాణానికి ప్రాణం నీవు. అలాంటి నిన్నొదిలి పోగలనా అసలు? అని చెప్పినా, నీవిచారం పోలేదు చూడు. అయితే, యిదికాదు కారణం. ఇంకా దేన్నిగురించో విచారిస్తున్నావ్. చెప్పు దీప్తి! ఏమిటి నీవిచారం? ఎందుకు?"

చాలసేపు సమాధానం చెప్పిందికాదు. చివరకు అన్నది "మీరు ఎప్పుడూ వాదిస్తుంటారు. సంతృప్తి లేదు మీకు. ఎందువల్ల ? మీ స్థితి చూచి, నేను బాధపడుతుంటాను. మీ బాధలు తెలుసుకోటానికే నా ఈ బాధఅంతాను"

"నువ్విలా అడుగుతావని అనుకోలేదు సుమా! నిజంగానే నామనస్సుకు శాంతిలేదు. నీముందు వున్నంతసేపూ, శాంతంగా వుంటాను. కాని, నిజానికి నాహృదయం ఒక రణరంగంలాంటిది. ప్రతివారితో ప్రతివిషయంలో దెబ్బలాడుతాను"

"నేనొకవిషయం చెపుతాను, కోపగించుకోరు కదూ!"

"లేదు చెప్పు"

"మీరు బౌద్ధమతం ఎందుకు అవలంబించగూడదూ ?"

అడవిజంతువును చూచినట్లు చూచాను ఆమెని.

"ఎంత పిచ్చిమాట మాట్లాడావు నీ స్త్రీ! బౌద్ధమతమా! ఛీ! ఛీ! ఆ బౌద్ధసన్యాసుల్ని చూడు. త్రాగుడు, వ్యభిచారం, జూదం. పైగా పుస్తకాలు వ్రాస్తారు - బుద్ధుడుకూడా అలాంటివాడేనని నమ్మా అలా కమ్మంటావా బౌద్ధంస్వీకరించి. నాకింకా తెలివితేటలున్నాయి. వాళ్లలా పతనంకాలేను" అన్నాను.

"బుద్ధుడు అలాంటివాడుకాడు విజ్ఞాన్! నీవు చదివిందంతా పొరపాటు: నీకు తెలిసినవ్యక్తులు అలాంటివారు. అది నీతప్పు కాదు. బుద్ధునితప్పిదమూ కాదు."

"మా ఆచార్యులే కొందరు అలా అంటారు. వారి నమ్మకాలవి. లాభంలేదు నీ స్త్రీ! బౌద్ధం ఒకమతంకాదు.

అది నమ్మినవాళ్ళకు నీతినియమాలు లేవు. సిగ్గూఎగ్గూలేని వాళ్ళందరూ అందులో చేరుతారు" అన్నాను.

నానోటికి చేతినడ్డుపెట్టి, మెత్తగా నోరుమూసి, "అలా అనకు విజ్ఞాన్. అలాంటిమాటలనకు. బుద్ధుడు అవతారపురుషుడు. అలాంటివాడు ఎప్పుడూ భూమ్మీద పుట్టలేదు. యింతకుముందు. ఇక పుట్టబోడుకూడాను"

కోపంతో ఆమెకళ్ళల్లోకి చూచాను. "అయితే, నువ్వు బౌద్ధమతం స్వీకరించావా?" అన్నాను.

"ఆఁ...ఏం తప్పులేదులే" అన్నది మృదువుగా.

"అందుకనే నువ్వు వేశ్యవయినావు. సిగ్గులేని జీవితం గడిపావు. శరీరాన్ని అమ్ముకున్నావ్, కోరికలకు బానిసవైనావ్. అదే మీ మతస్థులుచేసేపని. నాకు బుద్ధివచ్చింది. వెళ్తొస్తాను" అంటూ లేచాను. దీప్తి మెడకుచుట్టవేసుకుని పోనివ్లేదు. పసిపిల్లలా ఫ్రొంటికిచుట్టుకుపోయింది. పసిపిల్లలా ఏడ్చింది. నిజంగా, జాలివేసింది నాకు.

"నువ్వు విన్నదంతా అబద్ధం. నువ్వేదో జ్ఞానం సంపాదించాననుకున్నావ్. కాని, నిజమైనజ్ఞానం ఏమిటో చెబుతాను వినరాదూ!" అన్నది.

"కూర్చునిచెప్పు. ఏమిటి సత్యం అంటే ?" అన్నాను.

దీప్తి చెప్పింది. బుద్ధునిజీవితాన్నిగురించి, కొన్నిజాతక కథలు, వాటిప్రాశస్త్యంగురించి చెప్పింది. బౌద్ధం ఎలా నలుమూలలకు వ్యాపించిందీ, దానిప్రభావం దేశదేశాల్లో ఎలా పరివ్యాప్తమయిందీ తెలియజేసింది. దేవప్రియుడయిన అశోకునిగురించి, చైనాయాత్రికుడు ఫాహియాన్నుగురించి చెప్పింది.

అన్నిసత్యాల్లోను బౌద్ధసత్యంఒక్కటే చిరకాలం మన గలిగేది.

"నీవాదానికి బౌద్ధంలో తావులేదు విజ్ఞాన్. నీకు కావలసిందల్లా నమ్మకం, తెలుసుకోవటం. నేను వేశ్యను ఎలా అయినానో వింటే నీకు ఆశ్చర్యంకలుగవచ్చు, కాని బ్రతకాలి గదా! ఆశయాలు అన్నంపెట్టవుగదా! వేశ్యావృత్తి నవలంబిం చటం నీచంకాదనుకున్నాను. అది జీవనోపాధి మాత్రమే. అన్నివ్యాపారాలవలె యిదీ వ్యాపారమే."

నేను సమాధానంచెప్పేస్థితిలో లేను. దీప్తి చెబుతున్న విషయాలనుగురించే ఆలోచించుకుంటున్నాను.

తర్వాతరోజుల్లో శాసనాలకోసం గాలించాను. చిన్నవి, పెద్దవి వ్రాతగ్రంథాలు చూచాను. సంతృప్తిలేక నలందా దర్శిం చాను. అక్కడిఆచార్యులు ఎంతో మంచివారు. నాకు సాయం చేశారు. కొద్దిరోజుల్లోనే బౌద్ధం స్వీకరించాను.

అప్పుడు అద్భుతమైన మార్పువచ్చింది నాలో. మిగతా వారికి అది నా పతనంలా అవుపించింది. అయినా, నేను లెక్క చెయ్యలేదు. అపూర్వమైన శాంతిజ్యోతి నాలో వెలిగింది. అంతకాలం మానసికంగా పడినవ్యధ అప్పటితో తీరిపోయింది. మానసికంగా శాంతిపొందాను. ఆనందం లభించింది.

దీప్తి కాలధర్మంచెందింది. బిడ్డను ప్రసవిస్తూ చని పోయింది. బిడ్డకూడ చనిపోయింది. అంత్యక్రియలుచేసి, విక్రమ శిలను వదలివేశాను. విశ్వవిద్యాలయానికి స్వస్తిచెప్పాను. లెక్కలేనన్నిప్రదేశాలు తిరిగాను. హృదయంలో బాధలేదు— అప్పుడే అజంతానుగురించి ఎవరో చెప్పారు. ఇక్కడికి వచ్చే

"ఇదీ నా కథ బదరీ! నీ వింకా కుర్రవాడివి. ఒకనాటికి నీవూ నాఅంతవాడివి కావచ్చు. నేను పొందే ఆనందం నీకూ లభించవచ్చు, అంతకన్న ఎక్కువే లభించవచ్చు కూడాను."

బదరీ నిశ్శబ్దంగా విన్నాడు కథఅంతా. నిండుగా ఆలోచించాడు. నిట్టూర్పువదలి అన్నాడు—

"మీకు కృతజ్ఞుణ్ని ఆచార్యా! మీకు చాలా శ్రమ కలిగించాను. కాలగమనంలో ఎలాంటివిషయాలూ పవిత్రం అవుతాయి. సిగ్గు, లజ్జ లేకుండా ఒకనాడు చేసినపనులు ఈనాడు పవిత్రంగా వున్నాయి. భూతభవిష్యద్వర్తమానాలన్నీ ఒకేగతిలో చివరకు ప్రయాణం చేస్తాయి. చివరకు కాలం మనల్ని బాధించదు."

"ఇప్పుడు మీ అంతర్దృష్టిప్రభావం ఎక్కువ. శాంతి సంగీతం మీ గొంతుకలో గానంచేస్తుంది."

"అవునవును. నువ్వు రాంగుప్త వ్రాస్తున్న పుస్తకం చదువుతున్నాననుకుంటాను. రాంగుప్త మంచి ఆలోచనాపరుడు. అతనిరచనలు తేజోవంతంగా వుంటాయి. పద వెడదాం ఇంకా ఆలస్యం అవుతుంది."

పోతూపోతూ విజ్ఞానంద్ యింకా అనేకవిషయాలు చెప్పాడు. "నేను జ్ఞానమార్గం కనుగొన్నప్పుడే నా పేరు మార్చి విజ్ఞగోత్రుణ్నల్లా విజ్ఞానందుణ్నయ్యాను. ఈ పేరు బాగున్న దనుకొన్నాను."

"అవును, బావుంది" అన్నాడు సమాధానంగా బదరీ.

* * * *

బుద్ధజయంతికి రిహార్సల్స్ బాగా ముమ్మరంగా జరుగుతున్నాయి. అనేకమంది భిక్షువులు నాటకంలో నటించటానికి ముందుకువచ్చారు. ఎంతచిన్నదైనా సరే! బుద్ధునినాటకంగదా మరి! ఆంజనేయులు భగవాన్ బుద్ధవేషం వేస్తున్నాడు. వస్తుతః ఆంజనేయులు నటుడు. మొదటినుండి అనేకనాటకాల్లో భగవంతునివేషాలే వేశాడు - అలా భగవంతుడు మానవరూపం దాల్చి, పాపవినాశనంచేసి, శిష్టరక్షణచేసే పాత్రలంటే అతనికభిమానం. ఎప్పుడూ రాముడు, కృష్ణుడు - యిలాంటివేషాలే వేసేవాడు. ప్రహ్లాదనాటకంలో నరసింహామూర్తిగా నటించాడు. ఆనాటకంవల్లనే ఆంజనేయులు అజంతానివాసి కావలసివచ్చింది. ఆనాడు నరసింహపాత్రధరించకుండావుంటే, యిప్పుడు ఆంజనేయులు ఎక్కడ వుండేవాడో!

సింహాపురం నాటకాలకు ప్రసిద్ధిచెందింది. అక్కడ రంగంలోకివచ్చి, సెబాష్! అనిపించుకున్ననటుని కింక తిరుగులేదు. అందులో ఆంజనేయులు జగత్ప్రసిద్ధిచెందినవాడుకావటంతో అతనినాటకానికి విపరీతంగా వచ్చారు జనం. ఆంజనేయులు తన్మయుడైపోయి, తనపాత్రలోలీనమైపోయేవాడు. ప్రజలు అతన్ని కృష్ణుడుగా, రాముడుగా, నృశింహుడుగా భావించిపిలిచేవారు - అలా పిలవటంవల్ల తాము తరిస్తున్నామని భావించేవారు.

అక్కడ ఆతనిచెల్లెలు తులసి వుండేది. వాళ్ళయింట్లోనే తొలిసారిగా కామాక్షితో పరిచయమయింది. కామాక్షీ తులసి స్నేహితులుకావటంవల్ల అప్పుడప్పుడు కామాక్షి తులసినిచూడటానికి వచ్చేది. ఆమెలో స్త్రీత్వం ముమ్మూర్తులా

ఉట్టిపడుతూంటుంది. తొలిచూపులోనే ప్రేమ అంకురించింది. తులసియిల్లు చాలా పెద్దది. ఎవరేమూల వుంటేదీ, ఏంచేస్తుం డేదీ మరొకరికి తెలీదు. అ భయంలేదు గనుకనే ఆ లంకంత యింట్లో కామాక్షిని కలుసుకున్నాడు ఓమూల. ఇతరులు చూస్తారన్న భయంలేదు. చూచినా భయంలేదు. తులసికి ఆవిషయం తెలిసి, మండిపడింది.

ఆమెకు తనతమ్ముడు ఆంజనేయులు కామాక్షిని ప్రేమించటం సుతరాము యిష్టంలేదు. ఆమె కులస్త్రురాలు కాదు, ధనవంతురాలు కాదు. దిక్కుమొక్కు లేని ఆడది. ఎంత అందముంటేమాత్రం ఏమిటి, అనాథశరణాలయంలో పెరిగే అనాథ. సనాథకావటం, సంపన్న కుటుంబీకునితో చెలిమి చేయటం ఆమె కిష్టంలేదు. తులసి అత్తగారిపూరు కొండపల్లి. అక్కడుండగానే కామాక్షితో పరిచయంఅయింది. బుద్ధి మంతురాలు గనుక స్నేహంచేసుకుంది. శరణాలయం అధికా రుల అనుజ్ఞ తీసుకుని, తనతో పుట్టింటికి తీసుకొచ్చింది కొంత కాలం గడపిపోదామని.

ఒకఅనాథమీద వుండే జాలి, ప్రేమకన్న ఎక్కువే వున్నాయి తులసికి కామాక్షి మీద. అప్పుడు ఆంజనేయులు నాటకాలాడుతూ, సింహపురిలోనే వుండటం – కామాక్షిని చూడటం, ప్రేమించటం సంభవించింది.

అతని ప్రేమ కేవలం అభినయపూర్వకమైంది. మనసారా ప్రేమించాడు నాటకంలో నాయికిని ప్రేమించినట్లే ప్రేమించాడు. మొదట నటనలో ఎంత మోజువుందో, ప్రేమలోనూ అంత వుంది. అయితే, తులసి అతని ప్రేమవ్యవహారాలకు అడ్డువచ్చింది.

ఆమెకు ఆంజనేయులు కామాక్షిని ప్రేమించటం ఇష్టంలేదు. ఆవిడ అనాథ. సనాథ కాకూడదు.

"కామాక్షి కులట...మనకు సంఘంలో పేరుప్రతిష్ట లున్నాయి. ఆమెకు ఏపాటి గౌరవమూ లేదు, ఆమెను నీవు చేసుకోవటంవల్ల మన పరువుప్రతిష్టలు మంటకలుస్తాయి." అంది.

"అయినా, చేసుకుంటాను" అన్నాడు మొండిగా.

"ఇంతకంటె అందమైనవాళ్ళు, భాగ్యవంతులే వున్నారు. నువ్వు. ఊఁ. అంటే వందమంది వొచ్చి వాల్తారు. ఈ దిక్కుమాలినదాన్ని చేసుకుంటానంటావేం, మతిపోయిందా?" అని కోప్పడ్డది తెలిసి మండిపడుతూ.

"కామాక్షి నీస్నేహితురాలేగా. అలా అంటావేం అక్కా!"

"స్నేహం స్నేహమే. బంధుత్వం కలవటం నా కిష్టం లేదు. అడ్డమైనఆడదాన్ని నువ్వు చేసుకొంటానంటే వూరు కొంటానా?"

"ఆమెనుతీసుకుని లేచిపోతాను" బెదరించాడు.

"చెయ్యవు. అంతపని చెయ్యవద్దని చెబుతున్నా. ఆ ముష్టిదాన్ని లేపుకెళ్ళి, చచ్చి స్వర్గానవున్న నాన్నకు శోకం కలుగజేస్తావా! నీ చేష్టలు చూచి, ఆయన మనస్సు ఎంత క్షోభిస్తుందో ఆలోచించావా? అలా నువ్వుపోతే, తిరిగి నా శవంకూడా చూడలేవు తెలుసా."

"న్యాయం ఆలోచించవే అక్కయ్యా" అంటూ ఆమె కళ్లలోకి దీనంగా చూచాడు. ఆమె పాములాగా బుసలు కొడుతోంది. కళ్ళు సర్పదృష్టుల్ని ప్రసరిస్తున్నాయి.

ఏంచేయటానికి తోచలేదు...అతను ఏంమాట్లాడేడో కాని, అని గాలిలో కలిసిపోయినయ్. ఎవరికీ వినిపించలేదు.

*  *  *

ఆ రాత్రి ప్రహ్లాదనాటకం. ప్రహ్లాదుడు తండ్రిమాటను తిరస్కరించి, భగవంతుణ్ని నమ్ముకుంటాడు - తండ్రి భగవంతుడంటూ వేరే ఎవరూ లేరనీ, తానే భగవంతుడననీ, సర్వశక్తివంతుణ్ననీ విర్రవీగుతాడు. కొడుకు భగవన్నామస్మరణ చేయకండా కట్టుదిట్టంచేస్తాడు. చివరకు అటు భగవదంశకు, యిటు రాక్షసాంశకు మధ్య పోరాటం జరుగుతుంది. నృశింహావతారంలో వచ్చిన భగవంతుడు రాక్షసుణ్ని పరిమార్చి, తన గొప్పతనం లోకానికి చాటుతాడు. ఆంజనేయులు నృసింహావతారంలో రావాలి.

మిగిలిన నటులందరూ ఉత్సాహంగా సిద్ధమవుతున్నారు ఆంజనేయులుమాత్రం నిరాశతో కూర్చున్నాడు. అంతకు ముందు ఎప్పుడూ స్త్రీసౌందర్యం అతన్ని రంజింపచేయలేదు. ఈ కొత్తఅనుభూతి, అనుభవం అతన్ని పిచ్చివాణ్నిగా చేసినయ్. భయంతో వొణికిపోతున్నాడు. అతనిమీద తులసి ప్రభావం అగ్నిలా పనిచేస్తోంది.

రంగంమీదికి వెళ్ళిపోయాడు. తాను నటుడనన్న విషయం మర్చిపోయి, నిజంగా నృసింహుడై పోయాడు. తాను రాక్షసునిమీదికి దూకి, అతన్ని తన వొడిలోవేసుకుని, పొట్ట చీల్చి చంపాలి. రెండురంగాల్లో జరగవలసినకథ. మొదటిరంగం అయిపోగానే ఆంజనేయులు తిరిగి రాలేదు. అప్పుడే, మొదటి రంగంలోనే రాక్షసవేషం వేసినవాణ్ని పడవేసి, తనవేళ్ళకు

తగిలించుకున్న ఉక్కుగోళ్ళతో పొట్టచీల్చి, పేగులు బయటికి లాగాడు.

జనం ఆశ్చర్యంతో, కంగారుగా లేచారు. ఆంజనేయులు రంగంలోనుండి లోపలికి వచ్చాడు. రంగుబట్టలు మార్చుకున్నాడు. సింహంతల తీసి అవతలపెట్టాడు. అందరిముఖాలు వివర్ణంగావుండటం గమనించాడు. కారణం తెలియదు. తానేం చేశాడో తనకే తెలియదు. చివరకు ఎవరో చెప్పారు - జరిగినవిషయం. ఆంజనేయులు భయంతో వణికిపోయాడు. తన అమానుషచర్యకు అశనిపాతంలా భయపడ్డాడు.

ఎన్నిరోజులు మంచంలోవున్నాడో తెలీదు. ఒకనాడు వేకువనే మెలకువవచ్చేసరికి తులసియింట్లో అందరూ నిద్రపోతున్నారు సొమ్మసిల్లి. తనను తాను చూచుకొన్నాడు. నీరసంగా మొఖంపీక్కుపోయివుంది. ఎన్నోలంఖణాలు చేశాననుకున్నాడు. తనప్రేమ యిలా తనచేత ఘాతుకచర్యచేయిస్తుందని వూహించలేకపోయాడు. పశ్చాత్తాపంతో బయల్దేరాడు. చివరకు అజంతా చేరుకున్నాడు. బౌద్ధుడై, ప్రచారంచేస్తూ, కాలక్షేపంచేస్తున్నాడు.

మళ్ళీ జీవితంలో రంగువేసుకుని, రంగంమీదికి వెళ్ళే అవకాశం కలిగింది. ఈనాడు మహాభాగుడు - బుద్ధునివేషం వేయాలి. ఆంజనేయులు అటు పాత్రకు, యిటు తనరచనకు రాణింపు చేకూరుస్తాడని దేవపాల్ విశ్వసించాడు.

* * * *

రోజులు అతివేగంగా గడచిపోతున్నాయి. ప్రతిఒక్కరు బుద్ధజయంతినిగురించే మాట్లాడటం, ఆలోచించటం. ఆ మహా

పర్వదినం దగ్గరవుతున్నకొద్దీ అందరూ విహారసృష్టికృతులు ఆపివేసి, వేడుకసంరంభంలో మునిగిపోయారు. వేయవలసిన నాటకంలో ప్రేమకుమారికిసైతం కొంత పాత్రధారణ వున్నది. యశోధర, ఆమ్రపాలి – రెండుపాత్రలను పోషించేభారం ఆమె మీాద వుంది. ఇద్దరూ బుద్ధునిజీవితంలో ప్రముఖవ్యక్తులే. నాగోజీ దేవదత్తుని వేషం, కుమారి అజాతశత్రువు పాత్రలనుగోపీ తీసుకున్నారు. ఇతరభిక్షువులు చిన్నచిన్న పాత్రలు తీసుకున్నారు. అందులో ఆనందుడు, మొగ్గలనుడు, సారిపూత, ఆలారు, ఉదక పాత్రలు ముఖ్యమైనవి.

నాటకరంగం పర్వతాలకు పశ్చిమదిక్కున విశాల మైదానంలో ఏర్పాటుచేయబడ్డది. కొండలమధ్య రంగస్థలం నిర్మించాలన్నతలంపు కొందరికివున్నా, అది ప్రేక్షకులకు చాల దని దేవపాలుడే ఆ విశాలమైదానాన్ని తగినవసతిగా ఏర్పాటు చేశాడు. రెండువెదురుబొంగులు పాతి, తెరలుకట్టటానికి ఏర్పాటుచేశాడు – ప్రేక్షకులకు విశాలస్థలం ఏర్పాటయింది.

* * * *

కలలుగన్న బుద్ధజయంతి మహాపర్వదినం రానేవచ్చింది. అందరూ ఉపవాసంతోను, ప్రార్థనలతోను కాలంవెళ్ళబుచ్చు తున్నారు. సూర్యాస్తమయంతోఅందరిలో నూ నూతనో త్తేజం కలిగింది.

పండువెన్నెల పిండారబోసినట్లు నలుదిశల వ్యాపిం చింది. పెద్దదీపాలు వెలిగించారు. కొండప్రాంతమంతా దేదీప్య మానంగా వెలుగుతోంది. అశోకవృక్షాలు చల్లగాలులు ప్రచ లిస్తున్నయ్. తెర లేదు. రంగాంతర్భాగం అంతా చెట్లతో

అలంకరించారు. వాస్తవంగా అది బుద్ధుని ఉపవనమా అని పిస్తోంది.

వందలకొలది ప్రేక్షకులు హాజరైనారు. యతులతో, సన్యాసులతో కలసి బారులుతీరి కూర్చున్నారు జనం. బదరీకి నాటకంలో పాత్రలేకపోవటంతో ఒక్కప్రక్కగా రాంగుప్త ప్రక్కనే కూర్చుని తిలకిస్తున్నాడు.

దేవపాల్ ప్రార్థనచేశాడు. అతను ఒకనాడు వాతాపి నగరంలో ఆస్థానకవి, పండితుడు. రాజభోగాలన్నీ వదలి, ప్రశాంతజీవితం గడిపే వుద్దేశ్యంతో అజంతా చేరుకున్నాడు. నిర్మానుష్యమైన ఆ కొండచరియలో శాంతిలభిస్తుందని ఆశిం చాడు. ప్రార్థన అయినతర్వాత నాందీప్రస్తావన చదివాడు. అందులో బుద్ధదేవుడు జన్మించటానికి కారణం చెప్పాడు. ప్రతియుగంలోను దైవాంశసంభూతుడైన ఒకమహాపురుషుడు అవతరించి, ప్రజలకు ధర్మప్రబోధంచేసి, భగవంతునిసన్నిధికి చేరుకునే మంత్రం ఉపదేశిస్తాడని అందలిసారాంశం. ప్రతియు గంలో జన్మించే ఆ మహామానవుడే యుగపురుషుడు. అతనే భగవత్స్వరూపుడు. కల్లోలితప్రపంచంలోకి శాంతిదూతగా అవతరించి, క్రౌర్యం, మోసం, మరణం – యివన్నీ బుద్బుద ప్రాయాలని బోధిస్తాడు. ఆ మహామహునిజీవితమార్గమే అసి ధారగా మారి, వెలుగునీడలసందున పయనించి, పతతమాన వాళికి జ్ఞానమార్గం చూపుతాడు. ఈ భౌతికజగత్తుకన్న ఆధ్యా త్మికజగత్తు ఉత్తమమైనదనీ, దాన్నిసాధించటంకోసం అందరూ కృషిచేయాలనీ ప్రబోధిస్తాడు. అలాంటియుగపురుషుడే తథా గతుడు. ఆయనఅవతారమే బుద్ధుడు.

రంగురంగుల పూలరాశినుండే
రంగైనహారం రూపొందుతుంది;
మానవమాత్రుడుగజన్మించిన ఒకవ్యక్తే
యావత్ప్రపంచానికి మార్గదర్శకుడు;
తథాగతుని దివ్యజీవితం
లోకోత్తరమార్గ దర్శకం.

మొదటిరంగంలో బుద్ధుడు, దేవదత్తుడు ప్రవేశిస్తారు. చనిపోతున్న రాజహంసనుగురించి యిద్దరూ విచారిస్తుంటారు. రాజహంస వేటగానిఅంబుకు గురై, విలవిల తన్నుకొంటూ నేలపడుతుంది. బుద్ధుడు దానిశరీరంనుండి అంబును తొలగించి గాయానికి కట్టుకడతాడు. దేవదత్తుకు ఆగ్రహం కలుగుతుంది. కోపంతో తానుకొట్టినహంసను తనకు యిచ్చివేయమంటాడు. అప్పుడు బుద్ధుడు దేవదత్తునితో అంటాడు—

ప్రపంచంలో బ్రతికేహక్కు ప్రతిజీవికి వున్నది. చంపటం తేలికే కాని, ఒకరికి ప్రాణదానంచేయటం కష్టం. వేటగాడు పక్షిని చంపి, దాన్ని నాశనంచేస్తాడు. తాను రక్షించి ప్రాణ దానంచేశాడు కనుక అది తనదేనని బుద్ధుడు వాదిస్తాడు.

దేవదత్తుడు ఏవేవో నోటికొచ్చినట్లల్లా ప్రేలి, వెళ్ళి పోతాడు. తర్వాత బుద్ధునిమానసికపరిణామాలకు. కారణమైన అనేకదృశ్యాలు ఆయనకళ్ళబడతాయి. ఆ దృశ్యాలను చూచి, ఆశ్చర్యపోతాడు.

వార్ధక్యం మొదటిది. అలాంటివృద్ధుణ్ని తనజీవితంలో ఎప్పుడూ గౌతముడు చూచిఎరుగడు. ఆ దృశ్యం బుద్ధుని మనసును కలచివేస్తుంది.

విషజ్వరంలా మానవుని క్రమ్ముతుంది వృద్ధాప్యం
శరీరాన్ని తినివేసి, నిస్సహాయుణ్ణి చేస్తుంది
యువకులు వృద్ధుని చూచి, అసహ్యించుకుంటారు.

చుట్టూవున్న లోకం నవ్వుతుంది. ఆ స్థితిని చూచి, అప్పుడు తథాగతుడు యోచించాడు – ఇదే జీవితమైతే దీనికి మూలం ఏమిటో కనుక్కుంటాను. ఎందుకు మరణించాలి ప్రాణి ? ఒకసారి జీవించి, చివరకు వృద్ధుడై మరణించడం దేనికి ?

తర్వాత ఒకవ్యాధిగ్రస్తుడు ఎదురౌతాడు. వ్యాధిచే క్రుంగిపోయి, నడవలేనిస్థితిలో వుంటాడు. సుఖంగా జీవించటం ఎలాంటిదో మరచిపోయాడు. అబ్బ ! దారుణమైనజీవితం అతనిది. బుద్ధునికళ్ళల్లో బాధ అగుపించింది ఎదుటవున్న ఆ వ్యాధిగ్రస్తుని చూచి.

ఈ శరీరమే రోగాలకు హేతువు.
కోరికలవల్లనే రోగాలు ప్రాప్తిస్తాయి.
అలా మానవులు బాధపడనలసిందేనా? ఏమిటి కారణం

మూడవది మృత్యువు. మృత్యువువాతబడ్డ ఒకవ్యక్తి, బుద్ధుడు ఉద్రేకంతో లేచి నిలబడతాడు. శవాన్ని కొందరు వ్యక్తులు తీసుకువెడుతున్నారు. ఇదేనా సృష్టికి అంతం? ఇదేనా జీవితసమాప్తి? లేక మరోప్రపంచం, మరోజన్మ ఉన్నదా? అదే బుద్ధుడు కనుక్కోవాలని నిశ్చయించుకున్నాడు. మృత్యువు మనిషిని రూపరహితుణ్ణిచేస్తుంది. ఈ సృష్టిరహస్యాన్ని ఛేదించాలని సంకల్పించుకున్నాడు.

తర్వాత కనుపించినది ఓ బిచ్చగాడు. వీలువైనదుస్తులు అతనివంటిమీద లేవు. ముష్టిఅడుక్కునే జోలి, చింకిబట్టలు

శరీరాన్ని కప్పీకప్పని చింకిగుడ్డ. తల పూర్తిగా ముండనం చేయించుకున్నాడు. బుద్ధుడు తలపంకించి; కారణం గ్రహించాడు. వీటన్నింటికి మూలకారణం ఏమిటి? సమాధానంకోసం సన్యసించనిశ్చయించుకున్నాడు. ధ్యానంతోగాని. వీటికి సమాధానం దొరకదు. తానూ ఒక భిక్షువు కావాలి. సుఖాలన్నీ త్యజించాలి. అలా పరిత్యాగంచేయగలిగితే గాని, తన ప్రశ్నలకు సమాధానం లభించదు. అరాత్రే తను ధర్మపథం వేపు పయనించ సంకల్పించుకున్నాడు.

తరువాతిరంగమే మహాభినిష్క్రమణ. నిద్రిస్తున్న భార్య వేపు, కుమారునివైపు చూచి, విచారంతో వారికి దూరంగా వెడలిపోతాడు.

సుఖాన్ని పొందటంకోసం సుఖాన్ని, ఆనందాన్ని; సౌందర్యంకోసం సంతోషాన్ని త్యజించి, విశ్వశాంతికి రాచబాట నిర్మించటంకొరకు అర్ధరాత్రి చీకటిలో దారిలేనిదారివెంట దారి వెతకుతూ బయల్దేరాడు.

తరువాతరంగాలు ఒకదానివెంట ఒకటి వడివడిగా జరిగినాయి. బుద్ధుడు అలార్ అనే బ్రాహ్మణ్ణి కలుసుకుని, కొంతకాలం శుశ్రూషచేస్తాడు. ఆయన విద్యలన్నీ గ్రహించి, అసంతుష్టితో వెళ్ళిపోతాడు. ఉదకుని దర్శిస్తాడు. అప్పుడు ఉద్ధకుడు ఏకాంతంగా తపస్సుచేసుకుంటూంటాడు. ఆయనవద్ద కొంతకాలం విజ్ఞానసముపార్జనచేసి, చివరకు విసిగిపోతాడు.

చివరకు బోధివృక్షచ్ఛాయల తపస్సుచేసి, జ్ఞానసంపాదించి, బుద్ధుడై తరిస్తాడు. ఆ తపోనిష్ఠలో భూతభవిష్యత్ జ్ఞానం కలిగింది.

అప్పుడే మహాభాగుడు బుద్ధుడై, జ్ఞానియై, తథాగతుడై నాడు. భ్రాంతిని నిర్మూలించి, వాస్తవం కనుగొన్నాడు. వాస్తవం నిర్వాణం సాధనంగా గ్రహించాడు.

తర్వాత బుద్ధ ప్రబోధంతో ప్రజ లెలా మారిపోయిందీ ప్రదర్శించబడింది. ఆయన ప్రథమశిష్యులైదుగురు ఎలా బౌద్ధులైనదీ, సారనాథ్‌లో లేళ్ల వనంలో ఎలా తత్వబోధచేసిందీ ప్రదర్శించబడ్డది. సారిపుత్ర, మొగ్గల ఎలా తథాగతుని జ్ఞాన బోధలకు నీరాజనాలర్పించినదీ తెలుస్తోంది.

సారిపుత్ర, ఆశజీ, మొగ్గలన, ఆమ్రపాలి యిత్యాదులు ఎలా బౌద్ధమతం స్వీకరించిందీ, తథాగతుడు వారికి ఎలా ప్రబోధించిందీ ప్రదర్శించబడింది.

ఆమ్రపాలి వైశాలీనగరంలో ప్రముఖ వేశ్య. చివరకు బుద్ధబోధలు విని, శిష్యురాలై, సన్యాసిని అవుతుంది దురాత్ముడు, దొంగలనాయకుడు అయిన అంగులిమాల, బింబిసారుని కొడుకు—మగధప్రభువు అయిన అజాతశత్రువు ఎలా పరివర్తన చెందినదీ ప్రదర్శించబడింది.

తథాగతుని మహానిర్వాణంతో నాటకం సమాప్తి చెందుతుంది. అనంతవాయువుల్లో లీనమై, చేతనారహిత మైనప్రకృతిలో కలసిపోయిన బుద్ధుడు నిర్వాణ మహాత్మ్యాన్ని నిరూపించాడు.

నిర్వాణమంటే జీవన్మరణాల చివరియాత్ర – విశ్వశాంతి సోపానం.

నిర్వాణం, మానవాతీతశక్తిని పొంది, శాశ్వతసుఖాన్ని పొందుటే, వ్యాధి, రుగ్మత బాధ యిత్యాదులనుండి విముక్తి

పొందుట, జీవితరహస్యం తెలుసుకోవటం - దేవతలు, మానవులు ఒకేస్థితిలో అద్వైతానందాన్ని అనుభవించడం, మాయామందిరంనుండి తప్పించుకుని, అనుమానరాహిత్యమైనలోకంలో నివసించటం.

నిర్వాణమంటే మరణం కాదని, దానికి అద్వైతార్థం చేసి రూపించిననాటకం సమాప్తమయింది.

బుద్ధునిజీవితయాత్రలో ప్రతిమజిలీ ఉత్కృష్టమైనది. నాటకంలో అడుగడుగునా ఉద్వేగం ఉట్టిపడుతుంది. హృదయకుహరాన్ని కదలించి, వ్యక్తిని ఆలోచనాపరుణ్ణి చేస్తుంది. బుద్ధదేవుడు తిరిగి మానవాకారంధరించి, భూమిమీదకు నడచివచ్చాడా అనిపించింది బదరీనారాయణకు. అతనిలోని ప్రత్యణువు పులకితమయింది. దేనికోసమో ఆవేదన ఆవరించింది. బుద్ధజీవితం అతన్ని కన్నీటిపర్యంతంచేసింది. బరువుగా అన్నాడు "బుద్ధుడు అంతటి ఉత్తముడా! గొప్పవాడా ? ఈ సంగతి నాకు లోగడే ఎందుకు తెలియలేదు? ఇంతకాలం ఈభావం తెరమరుగున ఉండిపోయిందే!" అనుకుని విచారించాడు ఈనాటికైనా పశ్చాత్తాపం కలిగినందుకు, సత్యం తెలుసుకోగలిగినందుకు తనలోతానే సంతసించాడు.

రాంగుప్త నిర్విచారంగా, సాలోచనగా కూర్చుని చూస్తున్నాడు బదరీస్థితి చూచి అన్నాడు- "ఆ మహాభాగుడు మనలాంటివాడే. అయితే, తాను నమ్మినపనిచేసే ధైర్యసాహసాలు వారికున్నాయి. అందరుమానవులకంటె ఉత్కృష్టమైన ఆలోచన, విచారణ వారికున్నది"

* * *

కార్యక్రమంలో రెండవభాగం కమలకుమారి నృత్యం. కమలఅందం పరిపుష్టమైనది. ఆత్మనిగ్రహం గలిగి, బ్రహ్మచర్యం అవలంబిస్తున్న బదరీలో సైతం చైతన్యం కలిగించింది ఆమె సౌందర్యం. అతనిలో కాంక్షనంకురింప జేసింది. ఋషులు చెప్పే అప్సరసల అందం, రంభా ఊర్వసుల లాలిత్యం ఆమెలో వుంది. అందుకే బదరీలాంటి బ్రహ్మచారి చలించాడు. కమలను చూడనికళ్ళు కళ్లుకావు. సోదరభిక్షువులు ప్రజలు ఆమెలో నిర్మలసౌందర్యాన్ని చూస్తున్నారు. ఆమెసౌందర్యాన్ని అలా కళ్ళల్లో త్రాగుతూస్వర్గద్వారాల కేసి చూస్తున్నారు. కోరికలు నశించాలని ఆకాంక్షిస్తున్నారు. కమలశరీరలావణ్యంచూస్తే, ఎవరిలో వాంఛ జనించదు? అది అసంభవం, అసంబద్ధం కాదే? అదీ ఆమెసౌందర్యం కలిగించే అనుభూతి.

చూపరులహృదయాల్లో నూతనోత్తేజంకలిగించాయి. ఆమెప్రదర్శనలు. ఆమె ప్రదర్శించేహావభావాలతో, ఏవేవో అర్థాలను సూచించే ఆ చేతులు, కాళ్లు, కళ్లు ఎరిగినసత్యాన్నే మరొకసారి జ్ఞాపకంచేస్తున్నాయి. ఆమెచేసిన 'వేటగాడు - పావురం' నృత్యం అందర్నీ కదలించింది. వేటగాడు పావురాన్ని చూచి, చెట్లచాటున, పొదలచాటున పొంచిపొంచి ప్రయత్ని స్తాడు దాన్ని వేటాడటానికి తన్ను కాటందటానికి ప్రయత్నించిన విషసర్పాన్నిసైతం తప్పించుకుని. ఆ పావురంకోసం నానా యాతనల ననుభవిస్తాడు. చివరకు దాన్ని చంపగలుగుతాడు. చంపి విచారిస్తాడు. దాని మరణయాతన అతనిలో మార్పు తీసుకువస్తుంది.

అలాగే సత్యాన్వేషణ చేసే మానవుడుసైతం అనేక కష్ట నష్టాలకు గురికావలసివుంటుంది. సత్యస్వరూపాన్ని కనుగొన్న తర్వాత యింకా కనుగొనవలసింది. ఏమీలేదుగదా అని చింతిస్తాడు. అంటే, మానవునికి సంతృప్తిలేదు. ఎప్పుడూ ఆవేదన, విచారణే.

రెండవప్రదర్శనం డేగ, వేటగానినృత్యం. ఆకాశంలో నిచ్చలవిడిగా విహరించే డేగ ఒకపక్షిని వేటాడుతుంది. కుతంత్రంచేసి దానిమీదకు దూకుతుంది దావునే పొంచివున్న వేటగాడు విల్లుఎక్కుపెట్టి, ఆ పక్షిని హతమారుస్తాడు. అప్పుడు జీవన్మరణాలమధ్య పోరాటం ఆ పక్షి సూచిస్తుంది - ప్రతివారిలో చైతన్యంకలిగిస్తుంది. బదరీనారాయణకు చెప్పరాని బాధ కలిగింది. అలాగే మిగిలినవారు బాధపడ్డారు. చావు బ్రతుకులమధ్యజరిగే ఆ పోరాటంలో మానవుడు స్ఫురించడు.

అది భయంకరమైన చావు చస్తుంది - నేలమీదపడి విలవిల తన్నుకుని మరణిస్తుంది. అప్పుడు కనులనేసిననృత్యం ఆమెచూపినబాధ వర్ణనాతీతం. ఆ వ్యక్తి సజీవమైన ఒక యువతి అని అందరూ మరచిపోయారు - చనిపోతున్నందుకు వలవలా విలపించారు.

మూడవది శివతాండం - విలయతాండవం. సృష్టించబడ్డ యావత్ప్రపంచం ఎలా రూపరహితమయ్యేదీ తెలియచేస్తుంది. మానవునిలోని కుటిలత్వం, నైచ్యం, మోసం అన్నిటికీ చివరిసోపానం అది - విలయతాండవంలో లోకాన్ని నాశనంచేసి, పునఃసృష్టికి సంకల్పిస్తాడు శివుడు.

తెల్లవారేవరకు అలా జయంతిఉత్సవాలు జరిగినవి. బౌద్ధులు, ప్రజలు అందరూకలసి నదీస్నానాలకు వాఘోరాకు వెళ్ళారు. రాత్రి ప్రదర్శనలో అలసిపోలేదు కానీ, కాల కృత్యాదులవసరంకదా మరి. జయంతిఉత్సవాలనుగురించే ఆలోచిస్తూ, మననంచేసుకుంటో కాలంగడిపారు.

బదరీ ఆలోచనలతో అడుగులో అడుగు వేసుకుంటూ నదిసమీపించాడు. బుద్ధునిజీవితం, కమలనాట్యాలు అతనిలో అపూర్వపరిణామం తెచ్చాయి. ప్రేమసౌందర్యం కాని, కమల కళాభిజ్ఞత కాని, అతనిలోని చైతన్యాన్ని యింక మార్చలేవు.

రాంగుప్త బదరీభుజంమీద చెయ్యివేసేవరకు వాస్తవ జగత్తులో లేడు బదరీ. భావనాప్రపంచంలో విహరిస్తూ కలలు కంటూ, కళ్ళుచెమర్చుతున్నాడు.

"నేను నేనుగాదు. హృతుణ్ణి నేను. నాలో కోరికలన్నీ రాత్రిలో నిద్రిపోయినై. తిరిగి మేల్కొనవు"

"మార్పు మంచికే నాయనా! ఈ మార్పు నీలో రావాలనే అందరం ఆశించేది. నీ వీక నవ్యమానవుడివి. నిన్ను గురించే నా భయంఅంతాను"

"ఎందుకని?"

"నీలోకలిగిన ఈ భావపరిణామం భయంకర పరిణామా లకు దారితీస్తుందని భయపడ్డాను. నిన్నుచూచిన ఆ భయం తీరిపోతుంది. నీవు ఉత్తముడవు!"

"నేను మారిపోతానా?"

"నా కలాగే అనిపిస్తోంది. నీవు మారుతున్నావు. నిజం చెప్పాలంటే నా కెంతో ఆనందంగావుంది నిన్నుచూస్తే"

వర్ష రుతువు ఆరంభమై, అప్పుడప్పుడు వర్షాలు కుంభ పోతగా కురుస్తున్నయ్. పశ్చిమ కనుమలమీద కురిసిన వర్షాల వల్ల వాఘీరా కుప్పలు తెప్పలుగా ప్రవహిస్తోంది. భయంకర మోతలతో, ఉరకలతో, నురగలతో పారుతోంది. - ప్రవాహ పుసుకులు, భయంకరంగా మోతలు పెడుతున్నయ్. జలపాతాల ఘోషలు దూరతీరాలను సైతం కలవర పెడుతున్నాయి.

అజంతాలోని వారు అలాంటివర్షాలలో ఎవరూ బయటకుపోరు. తమతమ నెలవులలో, విహారాలలోనే స్థిమితంగా ఏ చెక్కడాలతోనో, చిత్రాలతోనో కాలక్షేపంచేస్తుంటారు. కొండకొమ్మలనుండి గుహలలోకి చిల్లులుపడి వర్షంపడటం సహజం. అలాంటప్పుడు వాటిని తక్షణం మరమ్మతుచేసుకోవటం, ఎలాగో కాలక్షేపంచేయటం అలవాటు.

అలాంటి దినకృత్యాలతో, కళానిర్మాణంతో అలసిపోయినప్పుడు పూర్వజీవితస్మృతులు జ్ఞప్తికి తెచ్చుకుని, ఏవో మధురగీతాలు ఆలపిస్తూ, తన్మయంచెందేవారు. ఒకరిజీవిత గాథలు మరొకరికి కథలుకథలుగా చెప్పుకునేవారు. ఎవరెవరు ఏయేకారణాలవల్ల అజంతాకుచేరుకున్నదీ, అక్కడ ఎలా జీవితంలో విశ్రాంతితీసుకుంటున్నదీ చెప్పుకునేవారు. ఏదోవిధంగా కాలాన్ని సున్నితంగావెళ్ల బుచ్చుకునేవారు. ఆనందం, సంతృప్తి పొందటానికి యత్నించేవారు. అప్పుడప్పుడు ధ్యానంలో నిమగ్నులై, మరొకప్పుడు జీవి, జీవసంబంధాలను గురించి చర్చలు జరుపుతూ, మరొకప్పుడు నిర్వాణసుఖాన్ని గురించి ముచ్చటించుకుంటూ; వేరొకప్పుడు ఆర్హత్వాన్ని పొందేమార్గాన్ని వెదకుతూ కాలంగడుపుతూండేవారు.

ఇలాంటివిచారాలకు బదరీ అతీతుడా అనిపిస్తుండే వాడు. అతనికి అలాంటి తత్వచింతనలేదు, లేదేమోనని పిస్తుంది అతన్ని చూస్తుంటే ఆతని మనస్సు పదేపదే కమల కుమారిప్రదర్శించిన నృత్యాలవేపు మళ్ళేది. దేవపాలుడు ప్రవచించిన బుద్ధగాధలు తలపుకువచ్చేవి. మాయాజగత్తులో శివుని ప్రచండతాండవం, ఏదో ఆశయాన్ని, పరమార్థాన్ని పొందిన వేటగానినృత్యం, రాంబందుకథనెనుక దాగున్న మానవపుఃయాతన-అన్నీ అనేకరూపాల్లో బదరీస్మృతిపథంలో కదులాడి, మాయమైపోతున్నాయి. బుద్ధజీవితం నిజంగా హృదయాన్ని కదలించి. ద్రవింపచేస్తున్నది. బ్రహ్మాండమైన శాంత మూర్తి, ముల్లోకాలను ముగ్ధమోహనత్వంతో నింపగల సంపూర్ణత్వం ఆ మహామూర్తిలో ప్రస్ఫుటమౌతోంది. బదరీ అలా వ్యూహించినప్పుడు, అతనిముఖం విప్పారినది. శాంతి జ్యోతిర్మయిగా ఆతనిముఖమండలంలో వెలిగింది.

రాత్రిళ్లు విపరీతమైనఆలోచనలు అతన్ని కల్లోలపరుస్తున్నాయి. ప్రేమ మొదటినుండి అతనికనుసన్నలలో మెదిలేది. పగ్గాలుముమ్మరమైనతర్వాత ఆమెతల్లి గారింటికి వెళ్ళిపోయింది. వెడుతూ అతనిహృదయాన్నికూడా తీసుకువెళ్ళింది. ఆమెను చూడాలని మనస్సు పదేపదే ఆరాటపడుతోంది. అయితే, ప్రయోజనం? ఆమె విహారంలో లేదు. తన పిచ్చిభావాలను తనలోనే అణచుకోప్రయత్నిస్తున్నాడు.

ఉద్రేకాలు చాలటంలేదు. మనస్సులో ఆరాటం ఎక్కువైంది. ఎంతోకాలంగా అణగివున్న యౌవనోద్రేకం, ఒక్కొమ్మడిగా పెల్లుబుకుతోంది. చాల చీకాకైపోయాడు బదరీ.

ఎడా తెరిపిలేనివర్షాలు కురుస్తున్నాయ్. ఉండిఉండి కడవలుముంచిపోసినట్లు గాలి, ఉరుములు, మెరుపులతో వర్షం కురుస్తోంది. బదరీనదాలు ఉబికిపోతున్నాయి.

ఒకరోజున అలాంటిచీకాకులోనే ఏవోరంగులుతీసుకుని, పరీక్షించాడు. కలగాపులగంగా అవుపించినై ఏదో మనస్సు వికావికలై అనాగరికదాహం కలిగింది. గోడమీద ఏదో అస్పష్టంగా రంగులు చిలకటం ప్రారంభించాడు.

మొదట్లో అయోమయంగా, అధ్వాన్నంగావున్న గీతలు, రంగులు క్రమేణ ఒకరూపాన్ని పొందాయి. అదే వృషభయుద్ధం. ఒకదాన్నొకటి చంపాలనే భయంకరభావం వాటితీరుతెన్నుల్లో స్పష్టంగా అగుపిస్తోంది. కొమ్ములు మెలి ధిరిగి, కుమ్ములాటకు సిద్ధంగావున్నట్లుంది. చిరకాలశత్రుత్వాన్ని పుంజుకుని, మారణహోమానికి సిద్ధపడ్డాయా అనిపిస్తోంది. చిత్రం పూర్తిఅవుతున్నకొలదీ అతనిలో మృగతృష్ణ ప్రకోపించసాగింది. తానుఒకవృషభమై పోరాటానికి సిద్ధమయినట్లున్నాడు బదరీ.

ఆరాత్రి విపరీతమైన తుపాను. శ్రమణులు ఒకరికొకరు దగ్గరగాజేరి, గొంతెత్తి పాటలుపాడుకుంటూ, తుపాను భీభత్సాన్ని మరచిపోవటానికి యత్నిస్తున్నారు. గాలితీవ్రతకు. ఉరుములకు కొందరుభిక్షువులు భయపడిపోతున్నారుకూడా. చెట్లువిరిగి నేలకూలుతున్నాయి. విలయాన్ని సూచిస్తున్నట్లు నది పొంగి పారుతోంది. భయంకరంగా, ఏదో బ్రహ్మాండమైన ముంపు లోకాన్ని క్రమ్మినట్లుంది. చావుబ్రతుకులసంధ్యారాగం అక్కడివారిబ్రతుకుల్లో వినిపిస్తోంది. ఆ తుపానును ఎదిరించి,

ఎవరైనా అడుగు బయటపెడితే, తిరిగి విహారం చేరుకుంటా రన్ననమ్మకం లేదు.

బదరీనారాయణ మామూలుస్థితిలో వున్నట్లయితే, అప్పుడు—ఆనాటిరాత్రి అతనుచేసినపని జీవితంలో ఎన్నడూ చేసివుండడు; వుండేవాడుకాడు. అత నో అనూహ్యమైనఉన్మా దానికి లోనైనాడు. కనుకనే అలా చేయగలిగాడు. ఆ ఉన్మాదంలోంచి విముక్తుడుకాలేక కాలానికి, పరిస్థితులకు తలవొగ్గ వలసివచ్చింది.

ప్రకృతి భయంకరంగావుంటే, అత నంతకంటే అతి భయంకరంగా తయారయ్యాడు. అనాదిమానవునిలో వుండే మృగత్వం అతనిలో పొడచూపింది. నిర్భయంగా ప్రకృతితో భీక రంగా పోరాడాడు. అడవిమృగాల భీకరారవాలు వినిపించక కాదు. పెద్ద పెద్దచెట్లు విరిగి పడుతున్నాయని తెలియకా గాదు. వాటిని వేటినీ లెక్క చేయక, వాఘిరా ప్రళయఘోష పెడుతోంది. దానిచెంతకు వచ్చి అలా తిలకించాడు.

ప్రశాంతంగా మందంగా పారే వాఘిరానదికీ ఈనాటి నదికీ ఎంతో వ్యత్యాసం. రాక్షసులు అట్టడుగునుండి వికటాట్ట హాసంచేస్తూ నదిని అల్లకల్లోలపరుస్తున్నారా అనిపిస్తోంది. కోపంగా, నిర్దాక్షిణ్యంగా ప్రవహిస్తోంది. మృత్యుముఖంలోంచి అపరాధి నవ్వేనవ్వు ఆ నదీతరంగాలధ్వనుల్లో వినిపిస్తోంది. అది కోపించిన నది. కొండలుసైతం ఆ ఉరవడికి పునాదులతోసహా పెళ్ళగిలిపోతున్నాయి. భూమి కరగి, నీరై కలసిపోతోంది.

*　　*　　*　　*

బదరీ వానలో తడిసి ముద్దయిపోయాడు - జుత్తు లోంచి వర్షపునీరు ముఖంమీద పడి, తడిసిపోయింది. మూర్ఖంగా లంఘించి, నీటిలో దూకాడు. శత్రుమూకలు చుట్టుముట్టినట్లు అలలు అతన్ని చుట్టుముట్టి, వలయాలుగా ఏర్పడి, లోంగతీసుకుంటున్నాయి. ప్రవాహవేగానికి కొట్టుకు పోతున్నాడు జలపాతాల వేపు, సుడిగుండాలలోకి. బదరీ ఏదో దైవికశక్తితో, దీక్షతో నదీప్రవాహాన్ని ఢీకొని, ఎదురీదు తున్నాడు. చివరకు విజయం తనదేనన్న ఉత్సాహం అతనిలో అగుపించింది. అలసిసొలసి ఆవలివొడ్డుకు చేరి, సేదతీర్చు కున్నాడు. బ్రతికిబైటపడ్డందుకు తన్నుతానే అభినందించు కున్నాడు కూడా.

స్థిమితంగా, లోయకేసి నడవడం ప్రారంభించాడు, వర్షాలకుతడిసి, నేలఅంతా మెత్తపడి, కాళ్ళుజారుతున్నాయి. పడుతూలేస్తూ, అలాగే ప్రయాణంసాగిస్తున్నాడు. ఇల్లు సమీపించాడు. గోడఒకటి శాని, పడిపోయింది. అయినా, చలనం లేని కొండగుహలా వుంది. ఆ యిల్లు. తలుపులు తట్టాడు కాని, ఎవరూ తలుపు తెరచినపాపానపోలేదు – మళ్ళీబలంగా తట్టాడు. రాంగుప్త తలుపులు తెరచి ఆశ్చర్యంగా అతనివంక చూచాడు. బదరీ లోపల ప్రవేశించాడు.

"ఇంతవర్షంలోనా! యిలా బయటికెందుకు వచ్చావు బదరీ ?"

"వూరికే వచ్చాను. ఏం తోచలేదు. ఏదో పిచ్చెత్తి నట్లుగావుంది. ఆ గుహల్లో వుండబుద్ధికాలేదు. అందుకే యిలా బయటపడ్డాను"

"తలతుడుచుకో, జలుబుచేస్తుంది" అంటూ ఒక పొడి గుడ్డ అందించాడు. "ఆ తడిబట్టలు విప్పు. వేరేబట్ట లిస్తాను"

రాంగుప్తభార్య బదరీ అప్పుడు అలా హఠాత్తుగా రావటం చూచి ఆశ్చర్యపడ్డది.

"అక్కడినుండేనా రావటం?"

"ఆఁ"

"చికాగ్గా ఉన్నావేం?"

"ఏంలేదు. నిజంగా ఏంలేదండీ"

"నది పొర్లిపోతోందిగదా, ఈదివచ్చావా?"...

"ఆ"

"నువ్వు మానవమాత్రుడివిగా లేవే! ఎలా ఈదగలిగావ్ యిప్పుడు? యిలాంటి తుపానుసమయంలో ప్రాణాల మీాదఆశవున్నవా డెవడూ నదిలో దిగడు"

"నే వచ్చాగదా మరి"

బట్టలుమార్చుకుని కొంచెం స్థిమితపడ్డాడు. ప్రేమ, కమల యిద్దరూ బదరీని పలుకరించారు.

ప్రేమకు సంతోషం ఆశ్చర్యం కలిగాయి.

"బదరీ!" అని పలుకరించింది. ఆమెకళ్ళు అదోలా ఆశ్చర్యాన్ని ప్రకటిస్తున్నాయి.

"ఏం, నన్ను తప్పుపడుతున్నావా ప్రేమ్! అవును, నీకు అలాగే అవుపిస్తుంది!"

"మొత్తానికి అసాధ్యుడివి బదరీ! నీలాంటివాణ్ని ఎవర్నీ చూడలేదు నేను. ఎప్పుడూ నువ్వు యిలాంటిపనులే చేస్తుంటావ్. అన్నీ అఘాయిత్యపు పనులే గదా!"

కమల నవ్వుతూ అన్నది - నువ్వు ఎందుకొచ్చిందీ నాకు తెలుసులెండీ బదరీనారాయణగారూ!"

మందహాసం కళ్ళలోనే దాచుకుని కమలవేపు తృప్తిగా చూచాడు సమాధానపడమన్నట్లు.

"నీ జీవితం నేటితో ధన్యమవుతుంది. కాబోలు!" అన్నది కమల కొంటెగా.

"నాకు అర్థంకావటంలేదు నీమాటలు కమలా!"

తల్లి వేడివేడిజావ తీసుకురావటంతో పిల్లలిద్దరూ కిమన్నాస్తిగా వూరుకొన్నారు. బదరీ ఆ జావ తాగాడు.

"ఏంజరిగింది నారాయణా!" అనడిగాడు రాంగుప్త.

"ఏమిటో అక్కడ చికాకనిపించింది. అక్కడనుంచి బయటపడాలనిపించింది. ఫలానాచోటుకి అని కాదు. మొత్తానికి ఎక్కడికైనా వెళ్ళాలనిపించింది. ఇలా వచ్చాను. ఇక్కడికి రావటం తప్పంటారా?"

"తప్పుకాదోయ్ నాయనా! నీవుచేసినపని ఆశ్చర్యంగావుంది"

"అక్కడ ఎలావున్నారు బదరీ? దేవపాల్, నాగోజీ, ప్రేమదత్తు, విజ్ఞానందులు - అంతా బావున్నారా?"

"వాళ్ళనుగురించి నాకేమీ తెలీదు. తలావొక విహారంలో వుంటారాయెను ఎవరూ బయటకు కదలటంలేదు. ఒకర్నొకరు కలుసుకోరుకూడా. ఏదో ఉబుసుపోకకు కథలు చెప్పుకుంటుంటారు. విసుగెత్తిపోతోంది అవి వినలేక. అందుకే యిలావొచ్చాను."

బదరీకోసం వేరే పక్క ఏర్పాటయింది. బాగా ప్రొద్దు పోయింది. అంతా నిద్రకుపక్రమించారు. బయట తుపాను చెలరేగిపోతోంది – గాలిహోరు భయంకరంగా వినిపిస్తోంది.

*  *  *  *

ఎంతకీ బదరీనారాయణకు నిద్రపట్టిందికాదు. జాగరణ చేస్తున్నాడు. తలక్రింద చేతులుపెట్టుకొని, అలా కప్పుకేసి చూస్తూ పడుకున్నాడు. ఆలోచన పాలోచన లేదు. దేని కోసమో ఎదురుచూస్తున్నాడనిపిస్తోంది.

అందరూ గాఢనిద్రలోవున్నారన్ననమ్మకం కలిగి పక్క మీదనుండి లేచి, గదిలో అటూఇటూ తిరుగనారంభించాడు. రాంగుప్త చదివేగది, దానిప్రక్కది మినహాయించి అన్ని గదులూ తిరిగాడు. హాలుదాటి, చిన్నగదిలో ప్రవేశించాడు. పిల్లలిద్దరూ నిద్రపోతున్నట్లు చీకట్లో మెరుపుల వెలుగులో అస్పష్టంగా అగుపించింది. తలుపుకు జారగిలబడి అలా చాలా సేపు నిలబడ్డాడు. ఆ క్షణంలో అనూహ్యమైనధైర్యం అతన్ని ఆవరించింది. తనను తనే నమ్మలేకపోయాడు. వారికి దగ్గరగా వెళ్ళి, చీకట్లో లేపాడు. ఆమె భయంతో అరవటానికి ప్రయత్నించింది కానీ, పీలువడలేదు. బదరీ ఆమెనోటికి చేయి అడ్డంపెట్టి, ఆపాడు. తనతోరమ్మని సంజ్ఞచేశాడు.

తలుపుదగ్గర ఓ క్షణం నిలబడి, వస్తున్నదో లేదో చూచాడు. హాలులోంచి, తనుపడుకున్నగదిలోకి తీసుకెళ్ళాడు. బుద్ధిమంతురాలుగా ఆమె అతన్ని అనుసరించింది ఆ కటిక చీకటిలో.

నెమ్మదిగా గొణుగుతున్నట్లుగా అన్నాడు ఆమెను తనచేతుల్లో పొదువుకుంటూ "నీ కోసమే వచ్చానని తెలుసుగా. నిన్ను గురించే నా ఆలోచనలన్నీ. ఇక్కడికి, నీకోసం రాకుండావుండలేకపోయాను. నీప్రేమకు దూరంగా వుండలేకపోయాను."

"ఆమె సమాధానం లేదు. అప్రమత్తంగా ఆశ్చర్యంగా వుండిపోయింది. చీకట్లో ఆమెను చూడలేకపోయినా, దగ్గరగా వున్న ఆమెను గుర్తించగలడు. దగ్గరగా, చేతుల్లోవున్న ఆమె అతనిలో మరీ వాంఛలను రెచ్చగొడుతోంది. యవ్వనం రేపే ఉద్రేకాలు అణచినా అణగటంలేదు. నరాలు జిమ్మనిలాగుతున్నాయి. వేడినిట్టూర్పులు, వేటగాని ఆత్రం అతనికళ్ళలో, కదలికలో. ఆమెనుపట్టుకొని బలంగా తనమీదకు లాక్కున్నాడు.

"వొద్దు, వొద్దు బదరీ!" అన్నది.

ఆమాటలు అతనిచెవులకు వినిపించనేలేదు. పెదాలు పెదాలతో సమాధానంచెప్పుకున్నాయి. ఎదురుతిరిగి తప్పించుకోటానికి ప్రయత్నించింది. కానీ, బదరీపట్టు విడిపించుకోలేకపోయింది. పెదాలు విద్యుత్తును ప్రసరింపచేస్తున్నాయి. మొదట్లో ముడిలాగా గట్టిగా బిగుసుకుపోయింది. కాని, క్షణంలోనే లొంగిపోయింది. యిద్దరిహృదయాల్లో భీభత్సం, ఉద్రేకాలు, యవ్వనంకలిగించేవికారం. మనస్సులోరేగినవికారాలు శారీరకసౌఖ్యంతో ఉపశమించాయి. అయినా యింకా ఆవేశం, ఆశ అణగిపోలేదు. ఆవేశంకాకపోయినా, ఆసక్తి యింకా మిగిలివుంది. ఆమె ఏడ్వనారంభించింది.

కొద్దపాటివెలుగు అవతలగదిలోంచి తమగదిలోకి రావటంతో యిద్దరూ నిశ్చేష్టులైనారు. శరీరం యీావత్తూ ఉడికిపోతున్నట్లు ఆమె భయంకరదృక్కులను ప్రసరిస్తో, చేతిలో దీపంతో ప్రత్యక్షమైంది. చూచినవారిహృదయాలు స్పందించటం మానాయి.

బదరీకి దాదాపు శ్వాసఆగినంతపనయింది. ఆశ్చర్యంతో వెర్రివాడై పోయాడు. ఎదురుగా కన్పిస్తున్నమూర్తినుండి దృష్టిమరల్చి ప్రక్కనే చూచాడు. తన కళ్ళు తానే నమ్మలేని స్థితి అప్పుడు. గొంతుక తడియారిపోయి, మాటవెలువడటం లేదు. దీపంవేపు మళ్ళీ తలెత్తి చూచాడు.

"నాకేం తెలీదు. నాదికాదు తప్పు. నిజంగా నువ్వేననుకున్నాను. నీకోసమేవచ్చిందిప్రేమ్. నిజంగా నువ్వేననుకున్నాను. నన్ను క్షమించు ప్రేమ్" ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

ప్రేమకళ్లు చింతనిప్పుల్లా, దీపపువెలుగులో భగభగమండుతున్నాయి. "వెళ్ళు, వెళ్ళిపో బదరీ. మావాళ్ళు నిద్రలేచేల్లోగానే తప్పించుకు వెళ్ళిపో. నాన్నకు తెలిస్తే, నిన్ను చంపేస్తాడు...పో, వెళ్ళిపో బదరీ" అంటూ ప్రళయాట్టహాసం చేసింది.

ప్రక్కనే కన్నీరుమున్నీరుగా ఏడుస్తూ తలవొంచుకుని నిర్విణ్ణురాలై వున్న కమలకుమారిని చూచాడు.

"నువ్వైనా ఎందుకు చెప్పలేదు కమలా!" అన్నాడు నెమ్మదిగా గాఢగా విచారంగా.

"నిన్ను ప్రేమించాను బదరీ! ఎప్పుడో ప్రేమించాను" వెక్కి వెక్కి ఏడుస్తోంది కమల.

"అయితే. నీకు తెలిసే చేశావన్న మాట !"

"అన్రను...నీవంటే నా కెంతో యిష్టం. నీవు లేనిది బ్రతకలేను బదరీ!" అతనికళ్ళల్లోకి చూస్తూ అన్నది కమల.

బదరీ విసురుగా ప్రేమకుమారిదగ్గరకు వెళ్ళాడు. ఆవిడ ముఖంలో ఉద్రేకం లేదు. బిగుసుకుపోయి కోపంగా, భయంకరంగా, కసిగా వున్నది. బదరీ పిచ్చివాడులా, నిరాయుధుడుగా, నిస్సహాయంగా అవుపించాడు. నోరెత్తి పలుకరించాలనుకున్నాడు కానీ, పెదాలు విప్పలేకపోయాడు. మాటలు పెగల్లేదు,

సిగ్గుతో తలవంచుకుని, ఇంటిలోంచి దూసుకుని బయట పడ్డాడు. తిరిగి తుపానుగాడ్పులు అతన్ని చుట్టుముట్టినై.

జోరుగా కురుస్తోన్నవర్షం బదరీని చలింపచేయలేక పోయింది. ఆ అవాంతరాలను వేటినీ లెక్క చేయలేదు. తల దిమ్మగా బాధగా వున్నది. హతాశుడై చుక్కానిలేనిపడవ మీద తుపానులో నట్టనడిసముద్రంలో ప్రయాణంచేస్తున్నవా డయ్యాడు.

వాఘీరావొడ్డుకు వచ్చి, నిలబడి ప్రవాహ - వేగాన్ని తిలకిస్తున్నాడు. చలి ఎముకలనుసైతం కొరికివేస్తోంది. విపరీతమైనగాలి, వాన. నదివొడ్డునే రాతిమీద కూర్చుని, పెద్దగా ఏడ్చాడు. శరీరంయావత్తు శోకంతో కృశించి నీరుకారిపోతోందా అనిపిస్తోంది.

అలాగే రాత్రంతా గడిపాడు. తెలతెలవారుతోంది. విహారానికి వెళ్ళటం మంచిదని తోచింది. మరోమార్గం గుండా విహారానికి త్రోవతీశాడు. కొంతకాలం గడచింది. బారెడు

ప్రొద్దెక్కేసరికి వర్షం తగ్గుముఖంపట్టింది. ఈదురుగాలి వీస్తున్నా వర్ష భయంలేదు. తుపాను శాంతించి, నిర్మలనీలాకాశం అగు పిస్తోంది.

*　　　*　　　*　　　*

విచారంతో తలమున్కలై, ఎవరితోను మాట్లాడలేక పోతున్నాడు బదరీ. తనవిహారంలో రాతిమీద పడుకుని, పైకి ఆకాశంలోకి చూస్తూ, ఆలోచనలో మునిగిపోయాడు. రెండు చేతుల్లో తలగట్టిగా నొక్కిపట్టి, బాధపడుతున్నాడు. యోగ సమాధిలోవున్నట్లు బయటికే రావటం మానివేశాడు.

జబ్బుపడి లేచినవాడిలా డీలాపడిపోయాడు. విచారం గుండెల్ని పీక్కుతింటోంది. విచారంతో అసహ్యాంగా తయారై నాడు. తన పరిస్థితి చూస్తే తనకే రోత కలుగుతోంది.

ఒకరోజు గోపీకుమార్ బదరీని చూడటానికి వచ్చాడు.

"ఓహో బదరీ! ఈమధ్య చాలా మంచిచిత్రాలు వేశాను చూచావో లేదో ! ఆ...అదేమిటి అల్లా వున్నావేం ?"

"కూర్చో గోపీ ! నే నొక పాడుపనిచేశాలే......"

బదరీచెప్పినతీరు అతనిస్థితి గోపీకి అర్థంకాలేదు.

"ఏమిటి !" అన్నాడు కొరడాదెబ్బలుతిన్నవాడిలా.

"ఒక అమ్మాయి జీవితం నాశనంచేశాను"

"ఎప్పుడు ?"

"మొన్న తుపానువచ్చిననాటిరాత్రి......

"ప్రేమానందునా ?"

"కాదు, కమలను"

"అదేమిటి ?"

"అదే నాకూ అర్థంకావటంలేదు. ఎలాజరిగిందో జరిగింది. చాలా దుర్మార్గంచేశాను. చనిపోదామనుకుంటున్నాను గోపీ!"

"నీకు అనేకసార్లు చెప్పాను బదరీ! అలాంటి విషయాన్ని గురించే విచారించవద్దని." అతనికళ్లలో నీళ్లుతిరిగినయ్. "నీకుఒకరిసలహా అవసరంలేదు బదరీ! అవసరంలేదు"

బదరీ సమాధానంచెప్పలేదు. గోపీకుమార్ తిరిగి ప్రారంభించాడు – "పాడుపని అని తెలిసే ఎందుకుచేశావ్ బదరీ? నిన్ను అనేకసార్లు హెచ్చరించాను, జ్ఞాపకంవుందా? అలా ఎందుకుచేశావో అర్థంకావటంలేదు బదరీ!"

బదరీ శూన్యంగా గోపీకళ్ళలోకి చూచాడు. పళ్లుబిగబట్టి విచారంగా చూస్తున్నాడు.

"నువ్వు ఎప్పుడూ యిలాంటి అపాయానికి గురికాలేదా గోపీ?" గోపీలో హఠాత్తుగా మార్పువచ్చింది. అదోలా చూచాడు.

"నీకెలా తెలుసు నేను చేశానని?" అని అడిగాడు.

"నాకు తెలియదు. నీవుచేశావా యిలాంటిపని?"

"ఆ, చేశాను"

"ఎప్పుడు?"

"ఇక్కడికి రాకముందు."

గుహ దాదాపు నిశ్శబ్దంగా వుంది. ఆఇద్దరు మినహా మరో సంచారంలేదు. బయటినుండి తుంపర పడుతోంది. ఇతర విహారాలలో కళాకారుల ఉలిధ్వనులు లయగా వినిపిస్తు

న్నయ్. ఎక్కడినుండో నవ్వులు అస్పష్టంగా వినిపిస్తున్నయ్. ఎవరో వాదించుకుంటున్నారు.

"నాకు చెప్పకూడదా గోపీ ?"

గోపీ నిశ్చలంగా కూర్చున్నాడు. మనస్సు వికావికలైంది. ఆలోచనలుకూడగట్టుకునేయత్నంలోవున్నాడు. మధుర స్మృతులు స్పష్టంగా విస్పష్టంగా మనోఫలకంమీద రూపురేఖలను దిద్దుకుంటున్నాయి. గతానుభవాలను.తిరిగి కళ్ళముందుకు తెచ్చుకోవటం అనవసరం అనుకున్నాడు. కళ్ళుబరువుగా భారంగా వున్నయి.

చేతితో కళ్లుతుడుచుకుని, నెమ్మదిగా, మంద్రస్థాయిలో అన్నాడు—

"అలాగే చెబుతాను. విను బదరీ !"

* * * *

శ్రీశ్రీశ్రీ గౌరీనాథ్ కొండవీటి ఆటవికజాతుల ప్రభువు. కొండవీడు ఆంధ్రరాజులేలినరాజ్యం. దట్టమైన అరణ్యాలు, కొండలు. అక్కడిప్రజలు అడవుల్లో, కొండల్లో నివసిస్తూ, చాలామొరటుగా జీవితాలు గడిపేవారు. అందులో చాలామంది దొంగలు. కొందరు వర్తకులను, యాత్రీకులను, ప్రయాణీకులను అడ్డగించి, దోచుకొని, కొల్లగొట్టి జీవించేవారు. ఎండాకాలంలో దగ్గరపట్టణాలమీద పల్లెలమీద దాడిచేసి, దోచుకువస్తుండేవారు. ప్రజలకు వారంటే తగనిభయం. మైళ్ళదూరంవున్న గ్రామస్తులకుసైతం కొండవీటిదోపిడి ముతాలంటే హడలుపుట్టేది.

శ్రీ గౌరీనాథ్ కొండపేటి కొండజాతులను తనఆధీనం లోకి తీసుకుని, నిర్భయంగా వ్యాపారం సాగిస్తున్నాడు. ఆ ప్రాంతాల్లో ఆయనఅంటే ఉక్కుపిడుగు. న్యాయాన్యాయ విచక్షణలేని ప్రభువు గౌరీనాథ్. తాను కోరినది. తనకు కావల సినది బలవంతాన సంపాదించగలడు. ఆ కొండజాతుల నాయకుడు బలసంపన్నుడు కావటంవల్ల, అతను కోరినది ఏదైనా సరే ఎవరైనా యిచ్చేవారు. లేకుంటే, అతనిదారికి అడ్డు లేకుండా, దూరంగా తొలగివుండేవారు.

అతను చేసేదాడులలో చాలాభాగం యువతులకోసం అయివుండేవి అందంగా, బలంగావుండే యువతులను పట్టి తెచ్చి, తన రాణులుగా చేసుకునేవాడు. ఆతని జనానాలో అనేకమంది సౌందర్యవతులుండేవారు. వారిని తనయిష్టంవచ్చి నట్లు వాడుకునేవాడు. విసుగుపుడితే తనఅనుచరులకు బహూకరించేవాడు ఈ విషయాల్లో గౌరీనాథ్‌ది పెట్టిందిపేరు. అతని సౌందర్యపిపాసను వ్యక్తంచేయటానికి యింతకంటె వేరే నిదర్శనాలు అనవసరం.

అంతటి స్త్రీవ్యామోహి అయినా, జనానాలోనిఒక్క భార్యవల్లకూడా అతనికి పురుషసంతతి కలుగకపోవటం విచారకరం. అనేకనుంది కుమార్తెల్లో ఒక్కకొడుకైనా లేక పోవటం ఆయనవిచారానికి హద్దులులేకుండాచేసింది. ఎన్నో మూలికలు ఔషధాలు సేవించాడు. భార్యలచేత సేవింప జేశాడు. మంత్రతంత్రాలను ప్రయోగించిచూచాడు. పూజా పునస్కారాలు చేయించాడు. కాని, ఫలితంలేకపోయింది. కని పించిన విగ్రహానికల్లా మొక్కాడు. మేకల్ని, గొర్రెల్ని, జంతు

వుల్ని బలిపెట్టాడు. దాడిచేసి జయించిన మనుష్యులను సైతం బలిపీఠం ఎక్కించాడు. తన కోరిక తీరుతుందేమోననే ఆశతో.

అలా ఎంతో రక్తపాతం జరిగాక, చివరకు అతని నోములు ఫలించాయి. ఆ బిడ్డకు అల్లారుముద్దుగా కుమార్ అని నామకరణంచేశాడు. యువరాజుహోదాలో అతన్ని పెంచాడు. కుర్రవాడు సుకుమారంగా, లలితంగా, ఏపుగా పెరిగాడు. శ్రీకృష్ణుడు గౌరీనాథ్ ఆరాధ్యదైవం. తన దైవంపేరిట కొడుకును గోపాల్‌అని పిలిచాడు. గోపాల్ క్రమేణ గోపీకుమార్ అయినాడు.

* * *

అయితే, గోపీకుమార్ పెరుగుతున్నకొద్దీ సుగుణభూషణుడవుతున్నాడేగాని, గౌరీనాథ్‌భావాలకు అనుగుణంగా, తండ్రికితగ్గకొడుకు కావటంలేదు. యువకుడైన గోపీ ఏవో భావలోకాల్లో విహరిస్తూ, మందంగా, శాంతంగా వుండేవాడే కాని, దారిదోపిడిదారుడు కాలేకపోయాడు. అడవుల్లో కొండల్లో తిరుగాడుతూ మూలికలు, ఓషధులు సేకరిస్తూ, వాటిని. యింటికి తీసుకువచ్చి, కషాయాలు, లేపనాలు తయారు చేస్తూ కాలక్షేపంచేసేవాడు. తాంత్రికులకు గోపీఅంటే యిష్టం. అవీయివీ చెబుతూ కుర్రవాణ్ణి మహాతాంత్రికుడుగా తయారు చేశారు. గోపీసైతం, ఆచారవిరుద్ధంగా రోగులకు. సేవ చేయటంలో నిమగ్నుడయ్యేవాడు. అతను వుపయోగించే ఔషధాలు అమోఘంగా పనిచేసేవి.

అనతికాలంలోనే కొండజాతులకు తలలోనినాల్కగా తయారయ్యాడు. వైద్యులు మొదట అతన్ని మెచ్చుకున్నా,

తమకు పోటీగావచ్చాడని అసహ్యించుకోవటం ప్రారంభించారు. కాలక్రమేణ ప్రజలుకూడా యితరభిషక్కులను ఉపేక్షించేసే వారుగారు. ఏ చిన్న ఆపద వచ్చినా గోపీకోసం పరుగెత్తేవారు. అతను మంత్ర - తంత్రాలు అవసరం లేకుండా, డాంబికం, మోసం, కపటం లేకుండా కేవలం ఔషధాల నుపయోగించి వారి బాధల నిట్టే తీసేసేవాడు.

గోపీ చాల వింతస్వభావం కలవాడు. తనకు కావలసిన మూలికలను సేకరించటంకోసం కొండల్లో, కోనల్లో, అడవుల్లో మైళ్ళతరబడి తిరిగేవాడు. ఎక్కడైనా కొత్తరకం చెట్టు కనిపిస్తే దాన్ని శోధించి, ఏదో ఒకవిధంగా ఉపయోగించేవాడు.

ఒకసారి ఆకొండజాతులు నాగార్జునకొండపై దాడిచేసి, చుట్టుపట్ల గ్రామాలను దోచుకున్నాయి. నాగార్జునకొండ ప్రాంతంలో ప్రజలు రంగురంగుల బట్టలను ఉపయోగించే వారు. అందరూ పురుషులే. తల నున్నగా ముండనంచేయించుకుని, ఏవేవో పాటలుపాడుతూ, ప్రార్థనలుచేస్తూ, వింతజీవితం గడిపేవారు. వారిభాషకూడా వింతగా వుండేది.

గౌరీనాథ్‌కు ఆ దండయాత్ర నిష్ఫలమయింది. విలువైనవస్తువు గానీ, నగలుగాని ఏవీ లభ్యంకాలేదు. అతని మనస్సులో పట్టరానికోపం చెలరేగింది. అతనికి దొరికినవి తాళపత్రగ్రంథాలు మాత్రమే. ఆ కసితో పెద్ద చితిపేర్చి, ఆ గ్రంథాలనన్నిటిని దగ్ధంచేశాడు. అలా కాలిపోతున్న గ్రంథాలలో సగం కాలి, ఆరిపోయినగ్రంథం ఒకటి మిగిలింది. దానివిషయం ఎవరికీ పట్టలేదు. అక్కడనుండి గౌరీనాథ్ తనమూకతో అమరావతిపై దండెత్తి, అంతులేనిసంపదను స్వాధీనంచేసుకున్నాడు

గోపీ ఆ సగంకాలిపోయిన గ్రంథాన్ని చూచాడు. దాన్ని తీసుకుని పరీక్షించాడు. అతనికి ఆశ్చర్యం కలిగింది. చదవటం, వ్రాయటం రాదు అతనికి. అయినా ముచ్చటగావున్న ఆ అక్షరసముదాయం అతనిలో ఏదో ఆసక్తిని రేపింది. అతని కళ్లు మెరిసినయ్. ఆ పుస్తకం చదివి, అందులో ఏమున్నదో తెలుసుకోవాలని నిర్ణయించుకున్నాడు.

తర్వాత గోపీ రహస్యంగా నాగార్జునకొండకు వెళ్ళాడు. అదొక చిన్న విశ్వవిజ్ఞాన కేంద్రం. బౌద్ధసన్యాసులు ససేమిఅతన్ని అక్కడవుండనివ్వటానికి అనుమతించలేదు. అతను అనాగరికుడు. కొండజాతివాడు. పైగా తమనుదోచుకుని, తమసర్వస్వాన్ని నాశనంచేసిన దోపిడిదొంగలముఠాకు చెందినవాడు. అతనురావటంలో ఏదో కుతంత్రం వున్నదని వారుశంకించారు. వృద్ధభిక్షువైన ప్రభాకర్ కుర్రవాణ్ణి ఆదరించి, అతని ఆసక్తిని అర్థంచేసుకున్నాడు. తనరెక్కలక్రిందికి తీసుకున్నాడు.

* * *

తర్వాత అనేకసార్లు గోపీ కొండవీడునుండి నాగార్జునకొండకు వెళ్తూ వస్తుండేవాడు. చదవటం, వ్రాయటం నేర్చుకోవటమేగాక, బౌద్ధమతాన్ని స్వీకరించాడు. బౌద్ధసన్యాసి కాలేదు. కాని, మనస్ఫూర్తిగా బౌద్ధధర్మాన్ని నమ్మి ఆచరించాడు

చదవటంనేర్చుకుని గోపీ అనేకగ్రంథాలవల్ల ఓషధులను గురించి, వనమూలికలనుగురించి తెలుసుకున్నాడు. శుశ్రుతసంహిత, నాగార్జునవిరచితగ్రంథాలు అనేకం వల్లెవేశాడు.

సశాస్త్రీయంగా విషయాలు తెలుసుకోవటానికి ప్రయత్నించాడు.

తండ్రి గౌరీనాథ్‌కు వయసుమళ్లుతోంది. గోపీలోవచ్చిన ఈ వింతపరిణామాన్ని తెలుసుకుంటూనేవున్నాడు. గోపీ ప్రవర్తన తండ్రి కేమీా నచ్చలేదు. గోపీ తనఅడుగుజాడల్లో నడిచి, మంచినాయకుడుకావాలని ఆయన ఈప్సితం. కాని, రక్తపాతమన్నా, అన్యాయమన్నా, దోపిడీలన్నా గోపీకి యిష్టంలేకపోగా, ఏవగింపు. అనేకసార్లు గౌరీనాథ్ గోపీని హెచ్చరించాడు. విన్నంతసేపు సావధానంగా విని, తిరిగి తన ఓషధీలోకంలోకి వెళ్ళిపొయ్యేవాడు. తండ్రి అంత కఠినంగా మందలించినా అన్నీ మరచిపోయేవాడు.

గోపీ అందమైనయువకుడే. మంచి స్ఫురద్రూపి. పట్టణం లోనియువతు లనేకమంది ఎంతో ఆసక్తితో, కోర్కెలతో అతన్నిచూచేవారు. కాని, గోపీ అందరిపైన శీతకన్ను వేసే వాడు. అతనికి ఆ యువతులలో ఆకర్షించదగ్గవిలువలేవీ అగుపించేవికావు. అందరూ తానంటే ఎందుకల్లా మమతచెందేవారో అర్థంఅయ్యేదికాదు. అలాంటిసమయంలోనే సౌజన్యను కలుసుకోవటం తటస్థించింది.

సౌజన్య కొండజాతియువతులలో గడుసరి. పురుష పుంగవులకే ఆవిడఅంటే భయం. కారణం సౌజన్యకు నోటి దురుసుతనం వుంది; బలమూా వుంది. తనకు ఎదురుతిరిగినవారిని ఎలాగైనా సాధించగలదు. అందుకే యువకుల్నిసైతం తనదరికి రానిచ్చేదిగాదు. మొండిగా ఎవరైనా వస్తే, పైనపడిపీకి, రక్కి చంపటానికి సిద్ధపడేది. శ్రీశ్రీ గౌరీనాథ్ అనుయాయుల్లో

అంటూ దూసుకుపోయింది. గోపీకుమార్ మనస్సు ముకుళించుకుపోయింది.

*  *  *  *

తర్వాత అనేకసార్లు ప్రయత్నించాడు సౌజన్యనుకలుసుకోవాలని. ఆమె మామూలుగా తిరిగే ప్రదేశాలకు పనిగట్టుకు వెళ్ళి, వేచివుండేవాడు. ఏవేనా ఔషధాలకోసం అడవికి వెడితే ఏ కొండవెనకో, చెట్టుమాటునో అగుపించేది. సౌజన్యకు గోపీ అంటే చిరాకు ముంచుకొచ్చేది.

"అయితే నువ్వు నన్ను వెంటాడుతున్నావన్నమాట!" అన్నది కటువుగా, గుంభనంగా ఒకసారి.

"లేదు, నిన్నటివరకు నీకోసం వెదికాను. కానీ నీవు అగుపించలేదు. నేడు వేరేపనిమీద వచ్చాను. నీవు కనిపించావు నిజంగా ఆశ్చర్యంగాలేదూ!"

"అయితే నువ్వు వొట్టి వెర్రివాడివి!" అన్నది.

"అంతోయింతో అందరం వెర్రివాళ్లమే" అన్నాడు గోపీ.

"నీవు ఏంచేస్తుంటావ్? ఎప్పుడూ ఏవో మొక్కలకోసం వెదకుతూంటావు. మంచి వైద్యుడివని విన్నాన్లే. అయినా, రాచబిడ్డకు ఈ పిచ్చిఏమిటి? పైగా వెర్రివాడివి కానంటావ్?" అంది.

"అయితే, నేను ఫలానా అని నీకు తెలుసునన్నమాట"

"ఎందుకు తెలియదు? మీనాన్నగారికి మానాన్న కుడిభుజమేగా."

ముఖ్యుడు – ఆయనకు కుడిభుజంగా వుంటున్న బలరాంకూతురు కావటంవల్ల ఆభిజాత్యం ఎక్కువ.

వన దేవతలాగా, అడవుల్లో, కొండల్లో విచ్చలవిడిగా విహరించేది. పూర్తిగా స్వేచ్ఛననుభవిస్తూ సుఖంగా కాలం గడుపుతుండేది.

గోపీకుమార్ ఆమెకుతటస్థపడ్డప్పుడు, ఆమెవిముఖత్వం ముఖభావం అతన్ని రెచ్చగొట్టాయి. అతనికి ఆశ్చర్యం వేసింది. స్త్రీలలో అలాంటివారు వుంటారని గోపీకి అంతకుముందు తెలియదు.

అందులో అడవిలో ఒంటరిగా అగుపించిన సౌజన్యని ప్రశ్నించాడు అమాయకంగా "ఎవరమ్మాయివి నువ్వు? ఈ కీకారణ్యంలో ఏంచేస్తున్నావ్?" అని.

"నే నెవరైందీ, నే నిక్కడ ఏంచేస్తున్నదీ నీకు అనవసరం. నీదారిన నీవుపోవచ్చు" అని సమాధానం చెప్పింది.

"పొగ్గ మొండిదానిలా వున్నావే?" అన్నాడు.

"ఫరవాలేదు. నా బ్రతుకు నే బ్రతుకుతున్నా వెర్రి వాళ్ళు నా జోక్యం కల్గించుకోవటం అనవసరం" అన్నది తెగబడి.

"ఒకవేళ ఎవరైనా జోక్యంకల్గించుకుంటే?"

"చంపేస్తాను ఏమనుకున్నారో!"

"నిజంగానా?"

"ఇప్పటికి ముగ్గురైనారు. అదేగతి పట్టాలనుకుంటేనే నాకు అడ్డొస్తారు. దానికి నేనేంచేస్తాను"

"బలరాం?"

"అవును."

"బలరాంకు నీలాంటి అందగత్తెఅయిన కూతురున్నదని నా కింతవరకూ తెలియదే!"

"తెలిస్తే ఏంచేసేవాడివేఁ?"

"నిన్ను నాకిచ్చి పెళ్ళిచేయమని అడిగేవాణ్ని."

సౌజన్య ఆ మాటలకు పకపకా పొట్టచెక్కలయ్యేట్లు నవ్వింది.

"నువ్వు రాకుమారుడివే గాని, ఒఠి వెర్రిబాగులవాడివి. వెన్నెలలా నేను ఎవరిచేతికీ అందనని నీకు తెలీదల్లేవుంది. అసలు పెళ్లంటే నాకు మహాచెడ్డ అసహ్యం. ఎవడైనా నన్ను పెళ్లిచేసుకోవాలనుకున్నాడా, వాడిపని పట్టానన్నమాటే!"

గోపీ ఏమీ సమాధానం చెప్పలేదు. ఏం చెబుతాడు! ఆడదీ, అందగత్తె, కులంగలది అయివుండి, తనలాంటిరాకుమారుడు వలచి, వలపిస్తానంటే అంత కఠినంగా మాట్లాడుతుందంటే? ఆవిడంటే ఒకక్షణం అసహ్యం వేసింది. కాని, ఆ సౌందర్యం అపూర్వమైనది. ఇంకెవరిలోనూ అలాంటి లావణ్యం తాను చూచిఎరుగడు. సౌజన్య తనకోసమే పుట్టిందా అనిపించింది. మరుక్షణంలోనే చకచకా నడిచి వెళ్ళిపోయాడు. సౌజన్య తోణకకుండా అక్కడే నిలబడి గోపీవైపు చూస్తోంది. "ఎలాంటికె వింతవ్యక్తిరా బాబూ!" అనుకున్నది.

* * *

ఆ తర్వాత గోపీకుమార్ సౌజన్యను కలుసుకోవటం ఆలస్యమైంది. ఒకసారి నాగార్జునకొండకు ప్రయాణమై ...

తూండగా త్రోవలో అప్రయత్నంగా తటస్థపడింది. ఒక పెద్ద రాతిపీడను కూర్చుని శూన్యంలోకి చూస్తోంది సౌజన్య. మొహం విచారంగా, బాధతో నిండివుంది. గోపీ ధైర్యంచేసి దగ్గరకు వెళ్ళాడు. సౌజన్య తలయెత్తి కోపంగా అతనికేసి చూచింది.

"ఏం; నా బాధను తీర్చాలని వొచ్చావా? ఆ ఉద్దేశం అయితేమాత్రం, వెంటనే పలాయనంచిత్తగించండి. నాకు తమరిసహాయమేమీ అవసరంలేదు" అన్నది.

"ఏం జరిగింది? నే తెలుసుకోగూడదా?" గోపీ సూటిగా ప్రశ్నించాడు.

"ఏంలేదు, ఏముంది జరగటానికి?"

గోపీ పెదవులపై మందహాసం రేఖామాత్రంగా అవుపించింది ఆ సమాధానానికి. "నిజంగా నీకేమీ జరగలేదు కదూ! అయినా నువ్వు బాధపడుతున్నావన్నమాట నిజం. చెప్పు సౌజన్యా ఏంజరిగిందో!"

"కాలిమీద ఏదో పురుగు పాకింది. విదలించి, చంపేశాను. తర్వాత కొంచెంసేపట్లోనే పోట్లు ప్రారంభించినయ్. నడవలేకపోతున్నాను, అంతే."

ముంగాళ్లమీద కూర్చుని సౌజన్యకాలు పరీక్షించాడు. చిన్నకాటు అందులోంచి రక్తం కారుతోంది. గాయాన్ని చేత్తో గట్టిగా అదిమి పట్టుకున్నాడు. బాధతో కేరుమంది సౌజన్య.

"ఎంతసేపయింది యిది జరిగి ?"

"ఓ గంట కావస్తోంది"

మూటవిప్పి, అందులోంచి ఓ మూలిక తీశాడు. అది చూడడానికి పాముఆకారంలో వుంది. గోధుమరంగుకొచ్చింది. ఒక రాయి తీసుకని, చివర నలగ్గొట్టి, గాయంమీద గట్టిగా రుద్దాడు.

"ఏమిటది?" సౌజన్య అడిగింది.

"సర్పగంధిఅని ఒకవేరు. ఇది నాగార్జునకొండమీద సంపాదించాను. పాముకాటుకి, పురుగుకాటుకి బాగా పని చేస్తుంది. ఎప్పుడూ కూడా వుంచుకుంటాను. ఈ అడవుల్లో, కొండల్లో పాములభయం జాస్తి కదూ!"

"ఇంకా ఎంతసేపట్లో నడవగలుగుతాను?"

"కొంతసేపు ఆగాలి."

"అంతవరకు యిక్కడే వుండాలన్నమాట?"

"నాతో నేరావాలి. లేకుంటే త్రోవలో నేచచ్చిపోతావు"

సౌజన్యకు కోపంమండుకొచ్చింది ఆమాటలకు.

"నువ్వెక్కడికి వెళుతున్నావ్?"

"నాగార్జునకొండకు"

"ఎందుకో?"

"కొంచెం పనివుంది."

అదోలా చూచింది గోపీకుమార్‌వైపు.

"అయితే నన్నిక్కడ ఒంటరిగా వదలిపోతున్నావన్న మాట?"

"నువ్వు వెళ్లనిస్తే అలాగే పోతాను."

"అంత అవసరమైనపనా?"

"అవును."

"అయితే, అభ్యంతరం చెప్పను. తిరిగి రావటం ఎప్పుడో?"

"చీకటిపడే లోపుగానే"

"అంతత్వరగా వస్తారా?"

"ఆఁ"

"ఎలా రాగలరు?"

"తప్పకుండా వస్తాను కొంతదూరంపోయాక కొండగిరి నుండి గుర్రంమీద వెడతా."

"మీరువచ్చేవరకు యిక్కడే వుంటాను."

"అభ్యంతరం లేకపోతే"

"తప్పకుండా వుంటాను."

గోపీ లేచి ప్రయాణానికి సిద్ధమయినాడు. తిరిగి చూడకుండా ముందుకు వెళ్ళిపోయాడు.

సౌజన్య గోపీకోసం ఎదురుచూస్తోంది. ఆకలి, దాహం దహిస్తున్నాయి. నాలుక పిడచకట్టుకుపోతోంది. అయినా, ఆట్టే బాధలేదు. సాయంత్రమయ్యేసరికి నడవగలననేధైర్యం కలిగింది ఆమెకు. నెమ్మదిగా లేచి అడుగుల్లో అడుగులువేసు కుంటూ పోతోంది.

* * * *

మాట తప్పకుండా సాయంత్రానికి గోపీ తిరిగివచ్చాడు. అప్పటికే చీకటిపడుతోంది. తనతో తినటానికి ఆహారం, నీళ్లు పట్టుకొచ్చాడు. గోపీ రాకతో సౌజన్యకు సంతోషం కలిగింది

చంద్రుడు బాగా పైకి వచ్చాడు. పండువెన్నెల కాస్తోంది. మానంగా చాలాసేపు గడచిపోయింది. భోంచేసి, సేదతీర్చుకుంటున్నారు వెన్నెల్లో.

"ఇలా ఎంతసేపు కూర్చుంటావ్?" అనడిగింది సౌజన్య.

"ఇంకొంచెంసేపు. తర్వాత కొండపీటికి బయల్దేరుదాం. నీకు వొంట్లో ఎల్లావుంది?"

"ఫరవాలేదు నడవగలను. కొండ ఎక్కానుగా"

"ఎక్కుతావ్...తిరిగి నొప్పివస్తుంది జాగ్రత్త!"

"అదే మర్చిపోయాను. ఇప్పుడు బాగానే వున్నాగా"

వెన్నెల్లో ఆమెలావణ్యం గోపీకి పిచ్చెత్తిస్తోంది చేతులు దేనికోసమో వెదకుతున్నాయి. హృదయం ఆరాటపడు తోంది.

"నాగార్జునకొండమీద ఏంపని?" సౌజన్య అడిగింది.

"ఓ కొత్తరకంచెట్లు చూచాను అక్కడివిద్యాలయం లోకి తీసుకువెళ్ళాను పరీక్షచేయించటానికి. పరీక్షించి, మరీ తెలియచేస్తామన్నారు."

"అక్కడే వుండి, తెలుసుకోకపోయారా?"

నీ కోసం వచ్చాను. లేకుంటే వుండిపోయేవాణ్ణే."

ఆమెహృదయం ఆనందభారంతో వూగిసలాడింది.

"నిజంగా నాకోసమే వచ్చారా?"

"తప్పకుండాను."

గోపీచూచిన చూపులు, అతని గొంతుకలోంచివచ్చే స్వరం ఆమెను సమ్మోహపరచినయ్! ఎంతోయిదిగా అయి పోయింది. మనస్సు కలవరంచెందింది.

"వెళదాం పదండి" అని లేచింది.

గోపీ ఆమెదగ్గరగా వెళ్లి, చేతుల్లో పొదివిపట్టుకున్నాడు.

"సౌజన్యా!" మృదువుగా అన్నాడు కోరికనులయిస్తూ.

అతనిధైర్యానికి, చనవుకు అచ్చెరువందింది ఆమె. బల మైన అతనిచేతులు తన్నుపెనవేసుకొని, తనని నిజంగా అబలను చేసినయ్.

"వొద్దు. వెడదాం పదండి."

సుడిగాలితాపుకు, అతనిపైకి వాలిపోయింది. అతను బలంగా తనవేపుకిప్పుకుని, హృదయానికిహత్తుకుని, ముద్దుపెట్టు కున్నాడు. చిరుతపులిలా పెనగులాడింది. కానీ, గోపీశక్తి ముందు బలహీనఅయింది. మైకంలో పెదాలుముద్దుపెట్టు కున్నాడు. సౌజన్యపెదాలు నలిగి, రక్తసిక్తమయినయ్. అయినా, పట్టువొదలలేదు. గడ్డిమీదపడి, వెన్నెల్లో దొర్లి' పెనగులాడుకోవటం మానవప్రపంచానికి తెలీదు.

ఆమె గోళ్ళతో రక్కింది. కరచింది. మొహమంతా గీరింది. పాములా ఆమెను చుట్టుకుని వదలలేదు గోపీ, ప్రయ త్నించికూడా అతనికి దూరంకాలేకపోయింది. ప్రేమ బాధగా-బాధ ప్రేమగా, పరవశంగా మారింది. చంద్రుడు సిగ్గుపడ్డాడు పాపం!

తర్వాత అనేకసార్లు తండాలో తిరుగుతూండగా సౌజ న్యను చూచాడు. గోపీనిచూచి ఆమెచలించలేదు. సిగ్గుపడనూ లేదు. ప్రతీకారదృష్టులతో చూచేది అతన్ని. ఆ ప్రతీకార వాంఛలో ఆమెఅందం, లావణ్యం కరగి, కలసిపోతోంది. వెను కటిసౌకుమార్యం, చలాకీతనం లేవు యిప్పుడామెలో. చూపు

లోనే తిరస్కారభావం అగుపిస్తోంది. ఆమెను చూడటం కష్టమవు తోంది. ఒకసారి ప్రయత్నించి ఆమెను కలుసుకున్నాడు.

"మనం పెళ్ళిచేసుకుందాం సౌజన్యా! మీ నాన్నను కలుసుకుని అడుగుదామనుకుంటున్నాను" అన్నాడు.

"అవసరంలేదు. పెళ్ళిచేసుకోవటం నా కిష్టంలేదు. అడిగావా నేను చచ్చిపోతాను" బుసలుకొడుతూ సమాధానం చెప్పింది.

"నిన్ను ప్రేమిస్తున్నాను సౌజన్యా! గడచినదానికి పశ్చాత్తాపపడుతున్నావా?"

"మాట్లాడక వెళ్ళిపో గోపీ! నాకు పిచ్చెక్కుతోంది నిన్ను చూస్తుంటే."

దాంతో గోపీకి మాటపోయినంతపనయింది. ఏంజరిగిందోనని లోకులు కూసీలాగటం ప్రారంభించారు కాని, గౌరీనాథ్‌కు అన్నీ వివరంగా తెలుసు

"నువ్వు యిలాంటివాడివని నాకు తెలియదు. నిన్ను చూస్తే నాకు గర్వంకలుగుతోంది. ఒక్క సౌజన్యమాత్రమే ఏమిటినీకు? లోకంమీద పడు. కనబడ్డవాళ్ళనందర్నీ లోబరచుకుని, ఆనందించు. పెళ్ళెందుకు నీకు?"

గోపీకి నిజంగానే పిచ్చెత్తింది. తండ్రిని, తనను, తండ్రాను అందర్నీ అసహ్యించుకున్నాడు - అందరూ తనకు మహాపచారంచేస్తున్నట్లు భావించాడు.

ఒకరోజున నాగార్జునకొండకు వెళ్లి, చేసినపనికి ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు - ఆ తర్వాత అజంతా చేరుకున్నాడు.

చైత్యంలోని ప్రజలసంక్షేమమే తనపరమావధిగా పెట్టుకుని, కాలక్షేపంచేస్తున్నాడు. తిరిగి ఆనందం అనుభవించలేదు

"అదీ బదరీ! నాకథ" అంటూ ముగించాడు.

బదరీ సిగ్గుతో తలవంచుకున్నాడు. ఆగకుండా దుఃఖం పొర్లుకొచ్చింది. వెక్కి వెక్కి ఏడ్చాడు.

"మహాపాపం గోప్పీ! క్షమించరాని ద్రోహంచేశాను. పశ్చాత్తాపమే శరణ్యం"

గోప్పీ అతన్ని ఓదార్చాడు.

"రోజులు గడచినకొలదీ గాయం నయమవుతుంది, తొందరపడకు విచారించి లాభంలేదు."

* * * *

వర్షరుతువు గడచిపోయింది. ప్రేమ తిరిగి అజంతా చేరుకున్నది. రాగానే మొదటిపనిగా జీవవిహారానికి మకాంమార్చుకున్నది. ఆపని బదరీకి ఏమీ నచ్చలేదు. చాలా బాధపడ్డాడు. రోజులు బరువుగా, భారంగా దొర్లిపోతున్నాయి. తిరిగి ప్రేమ కుమారిని అనునయించాలని అనేకసార్లు ప్రయత్నించాడు. కానీ, ఆమె విముఖత బదరీని మరీ బాధించింది. తిరిగి తన పనిలో నిమగ్నుడైనాడు. వృషభాలను చిత్రించటం పూర్తయింది. తర్వాత ప్రేమికుల్ని చిత్రించటానికుపక్రమించాడు.

కాని, పనిసాగటంలేదు. చేయి నైపుణ్యాన్ని కోల్పోయిందా అనిపిస్తోంది. ఏమీ పనిజరగటంలేదు. ప్రస్తుతానికి దాన్ని వాయిదా వేసుకున్నాడు. ప్రేమ యింకా నిష్క్రమణ చిత్రిస్తోంది. పరిచారకులు, నగరాంతర్భాగాలు, అలంకారాలు

తోటలు చిత్రిస్తోంది. యువరాణి చిత్తరువు యింకా మిగిలే వుంది. బదరీ పలుకరించినా మౌనంగా వుంటోంది.

ఆమె ప్రవర్తన బదరీకి అసహ్యమయింది. చాలా విచారించాడు. అయినా; ప్రేమకుమారి దూరదూరంగా తొలగిపోతోంది.

ఒంటరిబ్రతుకు అలవాటుచేసుకున్నాడు. ఎవర్నీ దగ్గరకు రానీయటంలేదు. మౌనంగా, గంభీరంగా మారిపోయాడు.

మనుష్యులన్నా, పనులన్నా ఆసక్తిలేకుండాపోతోంది. అప్పుడప్పుడు ఒంటరిగా కొండల్లో తిరుగుతాడు. తనను, తన ప్రవర్తనను అసహ్యించుకుంటాడు. ఒకటిరెండుసార్లు ఆత్మహత్యకు ప్రయత్నించాడు. కాని, అందుకు తగినంతధైర్యం లేకపోయింది.

తిరిగి తనచైత్యానికి రాకతప్పలేదు. మనస్సులోదిగులు విచారం, బాధ మిక్కుటమైనాయి. రోజులు దీర్ఘంగా, బరువుగా సాగుతున్నాయి.

* * *

ఒకసారి దృఢనిశ్చయంతో బయల్దేరాడు. భయపడినట్లుగుపిస్తున్నాడుకూడా. ముఖం గంభీరంగా వున్నది కానీ, ఏదో ఆఘాయిత్యం చేయటానికి తలపడ్డట్లునిపిస్తోంది

గుహాలో ఒకవైపునవున్నగోడ, అంతవరకు ఏ చిత్తరువు ఎవరూవేయలేదు దానిమీద. ఒకరోజల్లా మంచెకట్టుకోవటం సరిపోయింది. ఎవరైనా సహాయంచేయటానికి వస్తే, కోపంతో అరచి, కరిచినంతపనిచేశాడు. రాత్రి అందరూ నిద్రపోయేసమయంలో చిన్నదీపంసాయంతో ఆ గోడ నున్నగా

చెక్కుతున్నాడు. అలా రాత్రి అంతా పనిచేస్తూనేవున్నాడు. తెల్లవారినా అలసిపోయినట్లులేదు. అలాగే పనిచేసుకుంటూ వున్నాడు. అతని కళ్లల్లో వెలుగు అలాగేవుంది దేదీప్యమానంగా. అనేకమైనరాళ్ళు, పసరులు తెచ్చి, రంగులు తయారుచేసుకున్నాడు. ఒకలేపనం తయారుచేసి, అపరాహ్ణానికల్లా గోడమీద చిలకటం ప్రారంభించాడు గోడఅంతా నున్నగా, పాలగచ్చులా మెరుస్తోంది. కొద్దినిమిషాల్లో చెమ్మఆరిపోయి, చిత్తరువు వేయటానికి అనువుగావుంది. రంగులుతీసుకుని చిత్రం ప్రారంభించాడు.

రాత్రింబవళ్ళు ఏకదీక్షగా చిత్రిస్తూ కూర్చున్నాడు బదరీ. అతిజాగ్రత్తగా, మెళకువగా, తదేకధ్యానంతో చేస్తున్న కృషికి ఒకరూపం వస్తోంది. రేఖలు స్పష్టంగా చిత్రించబడ్డాయి. ధాతురాగంలో తళతళ మెరసిపోతున్నాయి. అది బుద్ధదేవుని ధ్యానమగ్నమూర్తి. పద్మాసనంలో ఉపవిష్టుడై వున్నట్లు రూపొందించబడుతున్న సృజనాత్మకసృష్టి భూస్పర్శముద్రలో వుండి, కళామయంగా అగుపిస్తున్నాడు గురుదేవుడు. అనేకమంది పురుషులు, స్త్రీలు, మృగజాతులుచుట్టూ ఇంతింతకళ్ళు చేసుకునివున్న ఒక మాంత్రికుడు. గొర్రెతలతో వున్న ఒక రాక్షసుడు. మరొకయోధుడు ఎవరినో చంపనుంకిస్తున్న చిత్తరువు మరొకటి. మానవశరీరం, జంతువుతలగల మరొకమూర్తి ఇలా రకరకాలమూర్తులు బుద్ధదేవునికి నాల్గువైపులా చిత్రించబడ్డాయి. మరొకవైపు సప్తకన్యలు వివిధానుభూతులను వ్యక్తం చేస్తూ అగుపిస్తున్నారు. త్రాగుడు, జూదం, వ్యభిచారంయిత్యాది మానసిక బలహీనతలకు అవి నిదర్శనాలు. అనేకమంది సుంద

రాంగులు. పురుషుల్ని 'లోబరచుకునేటీరులు చిత్రించబడ్డాయి. పురుషుల్ని మృగప్రాయులుగా మార్చగల శృంగార, రసిక కన్యలు వారు. అలాంటి చిత్రాలు నందలకొలది చిత్రించ బడ్డాయి.

మన్మథుడు అనేకరూపాల్లో దర్శనమిస్తున్నదృశ్యాలు కొన్ని. అన్నిరకాలకోరికలకు, వాంఛలకు, ఉద్రేకాలకు అతీతుడుగా బుద్ధదేవుడు చిత్రించబడ్డాడు.

అచంచలవిశ్వాసంతో బదరీ చిత్రం పూర్తి చేస్తున్నాడు అనేకరంగులసమ్మిశ్రమ ఆ చిత్రరాజం. అది ఒక మహాకావ్యం. శిలాఫలకంమీదరంగులతోచిత్రించబడిన విశ్వరూపసందర్శనం. నిద్రాహారాలు మాని, ఒకమహాశిల్పి తయారుచేసిన కళాఖండం అది. బదరీ అది పూర్తిఅయేసరికి శల్యావశిష్టుడై పోయాడు. ప్రాణాల కనుకొలుకుల్లోకి వచ్చాయి.

* * *

ఎవర్నిచూచినా బదరీనిగురించి మాట్లాడుకునేవారు. అందరూ అతన్నిగురించి కథలుగా చెప్పుకోవటం ప్రారంభించారు. ఉపవాసాలుచేస్తూ, అవిరామంగా మహోన్నతమైనబుద్ధదేవునిచిత్రం తయారుచేస్తూ క్షీణించి, మరణావశిష్టంగానూపాందుతున్న బదరీ ఎల్లరి దృష్టిని ఆకర్షించాడు. మొరటుతనం వుండి. ఎవర్నీ దరికిరానీయడు ఎవరితోను మాట్లాడడు. ఎక్కడికీపోడు. ఇతరగొడవ ఏమీలేదు. ఆచార్య విజ్ఞానందులు అతని స్థితినిగురించి విని ఎంతో విచారించారు. అసలే వృద్ధాప్యంతో రోగగ్రస్తుడై కొట్టుమిట్టాడుతున్న ఆచార్య పద్మదత్తు బదరీ స్థితినిచూచి, భయపడ్డాడు. ప్రేమకుమారి జీవితంలో భయం

అంటూ ఎరుగదు. అలాంటి ధీరోదాత్త సైతం అతని స్థితికి ఆశ్చర్యపడ్డది. ప్రతిహారికి బదరీతత్త్వం అర్థంకానిదిగా తయారయింది.

చిత్రం పూర్తయింది. బదరీ ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. ప్రాణాపాయస్థితికి వచ్చాడు. స్వయంకృతమే. జీవితంతో అలసిపోయి, విశ్రాంతితీసుకునేందుకు సిద్ధపడ్డ మహర్షి వేదన అతనిలో. విజ్ఞానందులు స్వయంగా పాలు, పండ్లు యిస్తూ, సేవచేస్తున్నాడు. దాదాపు బుద్ధవిహార్ ఒక యాత్రాస్థలంగా మారిపోయింది–బదరీని పరామర్శించటానికి, చూడటానికి వచ్చేపోయే వారితో. బుద్ధచిత్తరువు ఒక మహోత్తమ కళాఖండం. దాన్ని చూడటానికి వేనవేలుజనం వస్తున్నారు. ఆచార్య పద్మదత్తు నడవలేనిస్థితిలో వుండికూడా దేవపాలునిసాయంతో బుద్ధవిహారం దర్శించారు. ఆ చిత్రం చూస్తూనే అన్నారు "ఏది చూడాలని నా జీవితమంతా తపస్సుచేశానో ఆ చిత్రం నేడు చూడగలిగాను. ఇది మానవమాత్రుడైన చిత్రకారునివల్ల అయినపనిగాదు. బదరీ దైవప్రేరితుడై దీన్ని చిత్రించాడు. అదృష్టం!"

ఆ చిత్రం చూచి, ప్రేమకుమారి విలపించింది. అలాంటి మహోత్తమకళాఖండాన్ని సృష్టించిన తనబదరీకి తాను దూరం అయినానుగదా అన్న విచారం ఆమెను ముంచివేసింది. బదరీ తనతప్పుకు పశ్చాత్తాపపడ్డాడు కాని, తనే మూర్ఖించి, అతనితో మాట్లాడ్డం మానివేసింది. పొరపాటునజరిగినపనికి తాను యింతగా మొండిగావుండటం భావ్యంగాదు. తనకు ప్రతీకారవాంఛ కలిగింది. తను బాధపడింది. బదరీని బాధపెట్టింది.

చిత్రంచూస్తూ, తాను బదరీని ఎంతగా బాధపెట్టిందీ లెక్క వేసుకున్నది. ఆ చిత్రంలో అతని బాధ అర్థమవుతోంది. ఆరాత్రి బదరీపొందిన ఉద్రేకం అలాంటిది. పిచ్చివాడు గుడ్డివాడు అయిపోయినాడు. అతని నిప్పుడు పూర్తిగా క్షమించ దలచుకున్నది. వెంటనే బయలుదేరి బదరీకోసం వెళ్ళింది.

ఒక రాతిమీద కళేబరంలా పడివున్నాడు బదరీ.

"బదరీకి నయమవుతుందికదూ ఆచార్యా?" అని విజ్ఞానందుని అడిగింది.

"అది అతనియిష్టం అమ్మాయీ! అతనికి బ్రతకాలని లేదు. చాలా విచారంగా వున్నాడు. బాగా గాయపడ్డాడు"

బదరీవైపు ఆశగా చూచింది ప్రేమకుమారి.

"బదరీ! నన్ను క్షమించు. నీకు యింత అపకారం చేశాను. అయినా నన్ను క్షమించు బదరీ!

అందుకు సమాధానంగా బదరీ కళ్ళెత్తి పైవైపు చూచాడు. చుట్టూవున్న చిత్తరువులలోని అలంకారాలు అలా కళ్ళకు కనిపించినయ్,

"చాలా పాపంచేశాను. నీకు క్షమించరాని అపరాధం చేశాను. నన్ను క్షమించు బదరీ!"

మాట్లాడాలని ప్రయత్నంచేశాడు బదరీ. అయినా, కాని, ప్రేమవైపు చూడలేక కళ్ళు ప్రక్కకు తిప్పుకున్నాడు.

"నువ్వు ఏంచేసింది, ఎందుకు చేసింది అంతా పద్మ ఒత్తు ఆచార్యులు చెప్పారు. నువ్వు చాలా బాధపడ్డావని చెప్పారు. పురుషుడు స్త్రీఅవసరాన్ని అంతగా కోరుతాడని

నాకు తెలియదు బదరీ. నువ్వు చేసినపని తప్పుగాదు. అది నీతప్పుగాదు. మానవబలహీనత అది."

మళ్ళీ ప్రయత్నించాడు మాట్లాడాలని. పెదాలు విడి పడ్డాయి. కాని, మాటలు రాలేదు.

"ఆక్షణంలో నువ్వు చెయ్యగలిగింది చేశావు బదరీ! కోరికలను చంపుకోలేం. గోపీకుమార్ అన్నీ చెప్పాడు. కోరికలు చంపుకోవాలని ప్రయత్నించటంవల్ల ఆత్మహత్యకు దారి చేసుకోవటం అవుతుందని గోపీకుమార్ చెప్పాడు...

బదరీ నెమ్మదిగా సంతృప్తిగా కళ్ళుమూసుకున్నాడు. గుండెలు ఉచ్ఛ్వాసనిశ్వాసాలనుమాత్రం చూపుతున్నై. నిశ్చింతగా నిద్రపోయాడు ఆతర్వాత.

* * * *

రెండువారాలు గడచినయ్. బదరీకి స్వస్థత చేకూరింది. లేచి నడవగలుగుతున్నాడు. షికారుగా బయటకు వెళ్ళుతున్నాడు. అప్పుడప్పుడు చాలాభాగం నదిఒడ్డునే కూర్చుని అలలకేసి చూస్తూ, నదీతరంగాలుచేసే ధ్వనులు వింటూ కూచుంటాడు. నది వరదలులేనికారణంగా మందంగా, సౌకుమార్యంగా ప్రవహిస్తోంది. ఒకనాటిరాత్రి ప్రళయానిలంలో ఈ నదీ వేగాన్నే అతిక్రమించి, అతిమూర్ఖంగా అవతలివైపుకు ఈదినసంగతినే నమ్మలేకుండావున్నాడు యిప్పుడు. ఇప్పుడు వాహిరా ప్రమాదరహితంగా ప్రవహిస్తోంది.

ఆ తుపానునాటిరాత్రి తనలోను ఒకతుపాను చెలరేగింది. ఆనాటివిషయాలు ఒక్కొక్కటే స్మృతిపథంలో మెరుస్తున్నాయి. మాయాజాలంగా గడచిపోయిన విషయాలు బల

వంతంగా ఆలోచించటం మానుకున్నాడు. మనస్సు నిర్మలంగా వుంది. ఏ ఆలోచనా లేక, చుట్టూ ముూగవేసిన, శాంతి ఆవ రించివున్నాయి.

ఆ గాఢశాంతిలోంచి ఒక వాణి వినిపించింది. ఆ గొంతుక నదీతరంగాలను భేదించుకుని బయటపడిందా అనిపిస్తోంది. శ్రద్ధగా విన్నాడు తలవొగ్గి వినమ్రుడై విన్నాడు. బదరీ ముఖంలో అపూర్వమైన కాంతిరేఖ విచ్చులుకుంది.

* * *

కొంతసేపటికి ప్రేమకుమారి, గోపీకుమార్, నాగోజీ, ప్రభుఘోష్, దేవపాల్ బదరీని వెతుక్కుంటూ వచ్చారు నదీ తీరానికి. అభివాదంచేసి పక్కనే కూర్చున్నారు. ప్రేమకుమారి ప్రేమదృక్కులతో బదరీవైపు చూచింది. బదరీ ప్రశ్నార్థకంగా అవలోకించాడు.

దేవపాల్ నిశ్శబ్దాన్ని భేదిస్తూ అడిగాడు – "ఏంజరిగింది బదరీ ? చాలా ఆనందంగా వున్నావే ?"

బదరీ అనోరకంగా నవ్వి "నదీమతల్లి నాతో మాట్లా డింది దేవ్ !" అన్నాడు.

ఎవరూ ఏమీ సమాధానం చెప్పలేక బదరీవైపు అదో విధంగా చూచారు. చివరకు ప్రేమకుమారి ప్రశ్నించింది "ఏంమాట్లాడిందో తెలుసుకోవచ్చా బదరీ ?"

"ఓ అలాగే చెబుతాను. చెప్పబోయేముందు మీరంద కీ మరోరహస్యం చెప్పాలి. రహస్యం అని ఎందుకంటున్నా నంటే అది గుప్తంగా నాలోనేవుండి, నన్నింతగా క్రుంగదీసింది న్నిరోజులనుండి. ఆనాడు నే నీ స్థితికిరావడానికి కారణం

ఆనాటిసంఘటన. ఆనాడు నాశరీరం యావత్తు ఏదో బలీయమైన వాంఛతో కాలిపోయింది. నిన్ను తలచుకునే అక్కడికి వచ్చాను – నాకు శాంతి, సౌఖ్యం లభిస్తుందని ఆశించి. నువ్వే ననుకుని కమలను లేపాను. వెంట వచ్చేసింది. చీకట్లో పోల్చుకోలేకపోయాను. పిలవగానే వస్తే, నువ్వే ననుకున్నాను. అనుకోకుండా ఎలావుండగలను ? కమల అయినా ప్రతిఘటించలేదే ! అలా దుస్సంఘటన జరిగినందుకు విచారించానుకూడా.”

అందరికీ ఆ విషయాలు తెలుసు. తెలియదని బదరీ అనుకున్నాడు ఒక్కసారి అందరూ నిట్టూర్చారు

‘ఆ దారుణం జరిగాక, ఆచార్య విజ్ఞానందులకు, పద్మదత్తులకు చెప్పాను జరిగినవిషయం” అన్నాడు.

అందరిలోను నిస్సబ్ధత తాండవించింది. నది మందంగా పారుతోంది. ప్రవాహంకేసి చూస్తూ, మానవజీవితాన్ని గురించి ఆటుపోటులనుగురించి ఆలోచించసాగారు. గోపీకుమార్ అడిగాడు “నదీబాల ఏంచెప్పిందో మాకు చెప్పనేలేదు ?”అని.

బదరీ అనంతంలోకి చూస్తున్నట్లు దృష్టిసారించి, రోదసిలోంచి మాట్లాడుతున్నట్లు చెప్పాడు–

“ఇదే చెప్పింది : బాధలుపడందే జీవితం అర్థంకాదట. తప్పుచేయనిదే బాధపడటమూ సాధ్యపడదు. మానవుడు ఎంత సంపూర్ణుడయినా, ఒక్కొక్కసారి తప్పుచేయవలసివస్తుంది. ఏతత్కారణంగా బాధపడి, పశ్చాత్తాపంపొందితేనే తనను తాను పరిష్కారంచేసుకోగలుగుతాడు. ఎందుకు తప్పుచేశానా అని యోచించుకోవటంలోనే ఆత్మదర్శనం కలుగుతుంది.

అలాంటి తప్పులవల్లనే మానవుడు నిజమార్గాన ప్రవేశించ గలుగుతాడు. అదే మానవుని సన్మార్గుణ్ని చేస్తుంది"

"మానవజీవితం సర్వశోభాసమన్వితమైనది. ఇలాంటి బాధల ననుభవించినప్పుడే మానవునికి నిశితదృష్టి అలవడు తుంది, బాధలవల్లనే మానసికయాతన కలుగుతుంది. ఈ మాన సికయాతనఫలితంగా ఆత్మదర్శనం కలుగుతుంది. అనంతరం సంపూర్ణత్వం సిద్ధిస్తుంది. అలాంటి సంపూర్ణత్వం సిద్ధించినప్పుడు జీవితం యాతనారహిత మవుతుంది. అప్పుడు మానవుడు బ్రతక టంకోసం కాదు జీవించటం. బ్రతుకే ఒకభావన అవుతుంది. మానవుడు సంపూర్ణుడు, ఉన్నతుడు కాగలుగుతాడు. నిత్యం మనకు ఎదురయ్యేసమస్యలు అసలు సమస్యలుగానే కనుపిం చవు. అప్పుడు మనబ్రతుకులే భావనలుగా మారుతాయి. సమ దృష్టితో సర్వం తెలుసుకోగలం.

"జీవించటంఅంటే వేరు. ప్రేమలేనిది జీవించటం సాధ్యం కాదు. ప్రేమ మానవుని మతం - అభిమతం కావాలి. ప్రేమ కోసం సర్వస్వాన్ని బలిపెట్టగలిగినప్పుడే ప్రేమించడంఅంటే ఏమిటో తెలుస్తుంది. ప్రేమకోసం తామసం, హత్య, శరీరలంప టత్వం అన్నీ అనుభవించాలి. ఆత్మను ఛిన్నాభిన్నంచేసి శరీ రాన్ని ముక్కలుముక్కలుగా కోసి, ప్రేమకు బలిపెట్టవలసి వుంటుంది.

"ప్రేమించగలిగినవాడే జీవించగలడు. జీవితం ప్రవహించే నదిలాంటిది. నది సాగరాన్ని ప్రేమిస్తుంది. ఆ సాగరంలో లీనంకావటంకోసం కొండల్ని, కోనల్ని దాటి, అనేక బాధలుపడి, చివరకు సాగరంలో కలసిపోతుంది. అలాగే మన మూను.

ఒక ధ్యేయాన్ని ప్రేమిస్తాము. అయితే ఆ ధ్యేయంపొందేలోగా అనేక అవాంతరాలను ఎదుర్కోవలసివస్తుంది. అలాగే. ఒక సౌందర్యరాశిని ప్రేమిస్తాం అనుకోండి. ఆమెను పొందే లోపున, ఆమె ఏకాంతమందిరాన్ని చేరేలోగా అనేక మంది స్త్రీలను తప్పించుకోవాలి. వారిప్రేమదృష్టులను నిరసించాలి. ఈ నదినే తీసుకోండి. ఇది ఎక్కడ పుట్టిందో, ఎక్కడకు పోయిందో మనకు అనవసరం. ఎక్కడో ఒకచోట పుట్టటం, ఒకచోట కలవటం నిజం. అయినా, ఈ నదీజలాలు చూడండి. ఎలా ప్రవహిస్తున్నాయో! ఆ పొంగులు చూడండి దేని కోసమో! ఆ నీళ్లలాగే మనమూను, వాటినుడులవలెనే మన ఉద్రేకాలు కూడాను. మనకోరికలు ఆ తరంగాలవంటివి. ఆలోచనలు ఆ తరంగధ్వనులు. కాలాన్ని అధిగమించి యివన్నీ దాటాలి. ఒక్కక్షణంలో ఈ నదీజలాలు ఉప్పొంగి, అవాంతరాలనన్నింటినీ ఛేదించుకుంటాయి. తమమార్గాన్ని సుగమంచేసుకుంటాయి. అలాగే మనమూ ఒకఉద్రేకం కలిగినప్పుడు, దేన్నీ లెఖ్ఖచేయం. వాటినన్నింటిని ఓర్చుకునేశక్తి వుండాలి. అలాంటిశక్తి వున్నప్పుడే అలాంటి బలమైనకోరికలు పొందాలి."

*  *  *  *

అందరూ ఆశ్చర్యంగా, విగ్రహాల్లా వింటూ కూర్చున్నారు బదరీమాటలు. ప్రేమకుమారి బదరీచేయి పట్టుకుని, "బదరీ! నన్నుచూడు బదరీ!" అన్నది.

నెమ్మదిగా తలత్రిప్పి ఆమెవైపు చూచాడు. ప్రేమకళ్లలోంచి కన్నీటిబొట్లు జారుతున్నాయి.

"ఆత్మదర్శనం నిజంగా చాలగొప్పది. అవునా బదరీ!"

బదరీ తలపంకించాడు.

"నది నీతో మాట్లాడిందని భ్రమపడ్డావు కాని, నిజానికి నీహృదయమే నీకు అలా ప్రబోధించింది. అదే నానమ్మకం. ఆత్మసాక్షాత్కారంపొందితే అలాగే ఆత్మ ప్రేరేపిస్తుంది" అన్నది.

గోపీ అన్నాడు "నువ్వు అప్పుడప్పుడు యిలాంటి విష యాలే చెప్పి, భయపెడుతుంటావ్ నిన్నుచూస్తే నాకు భయ మేస్తోంది. నువ్వు మహోన్నతపథంలో ప్రయాణంచేసి, శాంతి అనుభవించావనిపిస్తోంది.

నాగోజీ నిరుత్తరుడై బదరీవైపు చూస్తుండిపోయాడు. చివరకు అన్నాడు "నువ్వు చాలా గొప్పవాడివి బదరీ! నిన్ను చూస్తే నాకు అసూయకలుగుతోంది. మానవబలహీనతల నన్నింటినీ అతిక్రమించావు"

"లేదు, నాగోజీ, ఏమీఅతిక్రమించలేదు ఇంకా నేర్చు కోవలసింది ఎంతో వున్నది. మనం చేరవలసిన శాంతిసౌధానికి మొదటిసోపానమే నేను ఎక్కగలిగింది. ఇంకా ఎన్నో సోపా నాలు ఎక్కాలి."

"అన్నీ అధిరోహించాలనే నాఉద్దేశం. నీవు చెప్పే శాంతి నేనుపొందినట్లయితే ఈ నక్షత్రాలపని లేకుండా పోయేది నాకు." అన్నాడు ప్రభుఘోష్.

ప్రేమకుమారి బదరీనారాయణవేపు చూచింది. అతని కళ్లు ప్రసన్నంగా మారి, చూపులుమార్చుకున్నయ్. ఆ చూపు లలో నిగూఢతను అర్థంచేసుకోలేకపోయింది ప్రేమ. బదరీ భుజాలమీద వాలిపోయింది,

"బదరీ! క్షమించు బదరీ"
దేవపాల్ శాంతివచనం పలికాడు.

* * * *

ఆచార్య పద్మదత్తు కొద్దిరోజులనుండి అస్వస్థతగా వుండి, ప్రస్తుతం పూర్తిగా ఆరోగ్యం కోల్పోయాడు. చివరి క్షణాలు దగ్గరపడుతున్నకొద్దీ నిర్మలంగా అగుపిస్తున్నాడు. మరణభయం లేదు. సుఖశాంతులకు ఆలవాలమైనదా అనిపిస్తోంది ఆయన వదనబింబం

భిక్షువులు, శిష్యులు అందరూ విహారంలో సమావేశమైనారు. నీరసించి, శల్యావశిష్టంగా అగుపిస్తున్నాడు పద్మదత్తుడు.

"నా అనంతరం మీకు "ఎవరు ఆచార్యులు అవుతారో నాకు తెలియదు కానీ, మీలో ప్రతిఒక్కరు జ్ఞాపకంవుంచుకోనవలసినవిషయం– మీరు చిత్రించే ప్రతిచిత్తరువు, శిల్పము ఓ మహాకావ్యంగా పరిణమించాలి. అదే మీ కళాభిజ్ఞతకు నిదర్శనం." అన్నాడు.

"ప్రతివారికి ఆత్మవున్నది. ఆత్మ సన్మార్గదర్శిని. మీ ఆత్మలను నమ్మి, సక్రమమార్గంలో పయనిస్తే చాలు. అదే మిమ్మల్ని తరింపజేస్తుంది.

"ఇక్కడ, ఈ ఏకాంతం, మనకఠోరతపస్సు ఆ ఆత్మ సందర్శనంకోసమేనని మరచిపోకండి. మనఆత్మలు యిక్కడ స్వాతంత్ర్యాన్ని పొందినై. స్వాతంత్ర్యమంటే జీవితంలోంచి వేరుకావటంలేదు. అదిప్రవాహంవంటిది. ఈప్రవాహం జీవితాన్ని ప్రసాదిస్తుంది. అజంతాలో మీ తత్త్వచింతన కళారూపంలో

లోకానికి ప్రసాదించబడుతుంది. మీరందరూ తత్త్వవేత్తలే. అందరూ కళాకారులుకూడాను. మీతత్త్వదృష్టి మీతో నశించకుండా ముందుయుగాలవారికి కనువిప్పుకావటానికే మీ దృష్టి కళాసృష్టి వేపు మళ్ళించమంటున్నాను.

"ఇదే పరమావధి. ఆ పరమావధిని చేరటానికే ఒక మార్గం అవసరం. అదే సన్మార్గం. అదే మనుగడకు, ప్రవర్తనకు మార్గదర్శి. అదే తథాగతుడు ఎన్నుకున్నమార్గం. ఆ మార్గాన్నే మనమూ పయనించాలి అలా పయనించినప్పుడే మనకూ సంపూర్ణత్వం సిద్ధించగలదు."

ఆచార్య విజ్ఞానందులు పద్మదత్తుతో రాత్రిఅంతా వున్నాడు. ప్రాతఃస్సమయంలో ప్రశాంతంగా కన్నుమూశాడు పద్మదత్తుడు. ఉదయమే అంత్యక్రియలు జరిగినవి. అజంతా యావత్తు విచారసాగరంలో మునిగిపోయింది.

ప్రేమకుమారి కన్నీరు మున్నీరుగా విలపించింది.

"నన్ను ఆదరించినది, అర్థంచేసుకున్నదీ ఆచార్యులు ఒక్కరే. నాకు ఉత్సాహాన్నిచ్చి, యింతకాలం యిక్కడ అవకాశంయిచ్చింది వారే. ఇప్పుడు దిక్కులేనిదాన్నయాను."

బదరీనారాయణ ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించాడు. కాని లాభంలేకపోయింది. ఒకరాత్రి ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయింది – నదిదాటి, లోయలోనియింటికి.

* * *

బదరీ విహారాలు, చైత్యాలు తిరిగాడు, గాలించాడు. ప్రేమ అగుపించలేదు. మరికొన్ని జాతకకథలు చిత్రించాడు. మళ్ళీ బుద్ధునిశిల్పం తయారుచేశాడు. అది పెద్దవిగ్రహం. తథా

గౌతముడు నిశ్చలసమాధిలో వున్నాడు. పురుషోత్తముడు అన్న మాటను సార్థకంచేయగలిగిన శిల్పఖండం అది. అనూహ్యమైన భావనాశక్తి. బలం అందులో గోచరిస్తున్నాయి. ప్రపంచాన్నంతటినీ కరుణమూర్తి తనపవిత్రహృదయంతో, దృష్టులతో పావనంచేస్తున్నట్లుంది ఆ ప్రతిమ.

తథాగతుడు తన భార్య-బిడ్డలవద్ద భిక్షతీసుకుంటున్న చిత్రం మరొకటి చిత్రించాడు. ఒక ఉన్నతవ్యక్తి వారిముందు విచారంగా నిలబడి అర్థిస్తున్నట్లున్న చిత్రం అది. యశోధర వినమ్రతతో పూజ్యపాదుల కెదుట నిలబడివుంది. రాహులుడు ఏమీఅర్థంగాక శూన్యదృష్టితో చూస్తున్నాడు.

బదరీ యింకా అనేక శిల్పఖండాలు తయారుచేశాడు. అన్నింటిలో బుద్ధుడు అనేకభావాలను ప్రకటిస్తున్నట్లు చెక్కాడు. బదరీ హృదయం నిర్మలంగా వుంది. కలలోరూపాలను శిలలపై రూపిస్తున్నట్లు అతి సుళువుగా అన్నింటినీ నిర్మిస్తున్నాడు.

చివరకు ఒకచిత్రం పూర్తి చేశాడు. ఇద్దరు ప్రేమికులు. ఒకరికొకరు దూరమయిపోవటం అందులోని ఇతివృత్తం. అది ప్రేమకుమారిని దృష్టిలోవుంచుకుని చిత్రించిన చిత్రం. అదే ఆమె తిరస్కారానికి అతనికానుక. యువకునిచూపులో అనేక కోర్కెలు, ఉద్దేశాలు వున్నాయి. అయితే అవి ఒకరికి హాని చేయవు. ఒకరికి అపకారంచేయవు. ఆ యువతికళ్ళల్లో ప్రేమ వుంది. అది అమాయకపుప్రేమ. ఆ ప్రేమఫలంగానే ఆమెకు సంపూర్ణత్వం సిద్ధించింది.

*　　*　　*　　*

ఒకరోజునఅనుకోకుండా ప్రేమకుమారి వచ్చింది. బదరీకి నమస్కారం చేసింది. బదరీ సంతోషించాడు. ప్రేమ ఎంతో మారిపోయింది. ఆమెలో స్త్రీత్వం పూవులా వికసించింది. వెనుకటిచనవు యింకా పోలేదు.

"నీ కో శుభవార్త తెచ్చాను బదరీ! కమలకు మగ పిల్లవాడు కలిగాడు" అన్నది.

బదరీచేతిలోంచి రంగులు జారిపోయినై. ఆనందంతో ఆమెభుజాలుపట్టుకునివ్వాపి, ముద్దుపెట్టుకున్నాడు.

"పద వెడదాం. తల్లీ, బిడ్డ క్షేమంగావున్నారుగదూ?" అన్నాడు.

"వద్దు బదరీ! నువ్వు రావద్దు. నాన్న నున్వంటే మండి పోతున్నాడు. కోపంకన్న బాధ ఎక్కువగావుంది ఆయనలో. ఏదేదో మాట్లాడుతున్నాడు. చాలా విచారంగావున్నాడు.

బదరీ నిశ్చలంగా ముందుకు నడిచాడు. కొండరాయి నానుకుని ప్రవహించే వాఘోరాను అవలోకించాడు. ప్రేమ దగ్గ రగా వచ్చి, మీాద చేయి వేసింది.

"మీానాన్న ఏమంటున్నాడు ప్రేమ్!"

"నమ్మినవాళ్ళే మోసంచేస్తారుట. నిన్ను కన్నకొడు కులా ప్రేమించాడు. నువ్వు కుటుంబగౌరవాన్ని మంటగలిపావు నీమీాదవుండే సదభిప్రాయం పోయింది ఆయనకు. తాను వాస్తు పుస్తకంమీాద నమ్మకంకూడా పోతోంది."

అలాగే నిలబడి చూస్తున్నాడు బదరీ. హృదయం ఆరా టంతో కొట్టుకుంటోంది. నదీజలాలుచేసే ధ్వనులు చిత్రంగా

వినిపిస్తున్నాయి.. చాలాసేపు అలా మౌనంగా వుండిపోయాడు. చివరకు ప్రేమవేపు తిరిగి అన్నాడు–

"వెడదాం పద ప్రేమ్. మీ నాన్నకు నేను సమాధానం చెప్పుకుంటాను"

ప్రేమ అభ్యంతరం చెప్పలేకపోయింది. కొండదిగి, వాఘీరా ప్రాంతాలకు నడిచారు. వాఘీరా దాటి, లోయలో ప్రవేశించారు.

* * * *

రాంగుప్త ఆలోచనానిమగ్నుడై, పఠనమందిరంలో నిశ్చింతగా కూర్చున్నాడు. బదరీని చూచి కొంచెం ఆశ్చర్య పడ్డాడు. మోచేతులు పొడుగుపైనఆన్చి, తలచేతుల్లో పెట్టుకుని విచారిస్తున్నాడు. బదరీవైపు తీక్షణంగా, సాలోచనగా చూచి తలవొంచుకున్నాడు.

రాంగుప్తలో విచారం నెల్లువలై, ప్రవహించబోతోంది. అది గ్రహించాడు బదరీనారాయణ. మరుక్షణంలోనో, అర క్షణంలోనో రాంగుప్తగుండెలు బ్రద్దలయ్యేట్లు ఏడ్వనూవచ్చు మండిపోనూవచ్చు. పరిస్థితి అలాంటిది. అందువల్లనే ధైర్యం చేసి, ముందుకు అడుగువేశాడు. నెమ్మదిగా దగ్గరగా జరిగి విన యంగా విధేయతగా అన్నాడు – "వాలికిపోయిన పాలకోసం విచారించటం దేనికి స్వామీ?"

రాంగుప్త తలపైకెత్తి చూచాడు. అపూర్వవేదన బద రీలో వ్యక్తంఅవుతోంది.

"లాభంలేదు! ఎందువల్ల?" కఠినంగా ప్రశ్నించాడు.

"అవును ఎందుకు? నేను క్షమించరాని తప్పిదం చేశాను. మహాపాపం చేశాను. మీ జీవితాలకు కళంకం ఆపాదించాను. చేసినపాపానికి పశ్చాత్తాపం అనుభవిస్తున్నాను. నా తప్పిదం క్షమార్హం అయేట్లయితే, నాజీవితాన్నైనా అర్పిస్తాను. ఆరాత్రి......ఆరాత్రి......చెప్పలేను రాంగుప్త గారు" అంటూ కాళ్ళమీదపడి వెక్కివెక్కి ఏడ్వనారంభించాడు "నన్ను క్షమించండి. నన్ను ఏమైనా చెయ్యండి కానీ, నాతప్పు మాత్రం క్షమించండి."

రాంగుప్త బరువుగా నిట్టూర్చాడు. "క్షమించక, శిక్షించటంవల్ల కలిగే ప్రయోజనమూ లేదు...."మనస్సు స్థిమితపరచుకుని, అన్నాడు.

"తల్లిని, బిడ్డని చూడ్డానికి వచ్చావనుకుంటాను...... ...అలాగే వెళ్ళి చూడు."

ఆనందంతో బదరీ శరీరం పులకరించింది. తన్మయత్వంతో బయల్దేరాడు కమలవున్న గదిలోకి. బదరీ వచ్చేసరికి కమల నిద్రపోతోంది.

"కమలా! కమలా!" నిద్రలేపాడు. కళ్ళు తెరచి చూచేసరికి ఎదురుగా బదరీనారాయణ. ఆమెకు భయం వేసింది. కళ్లు భీతిని వెలిబుచ్చినవి. పరిస్థితులను అర్థంచేసుకొని స్థిమితపడింది.

"ఎలావుంది వొంట్లో?" అనడిగాడు ప్రక్కమీద కూర్చుంటూ.

"నీవు చాలా చిక్కిపోయావు బదరీ!"

"అవును, నాఆరోగ్యం బాగుండటంలేదులే"

"అనే విన్నాను. నీవుచిత్రించిన ధ్యానబుద్ధుణ్ని గురించి విన్నాం. బహుశా అది బాగా దెబ్బతీసివుంటుంది.

"అలాగే. అనుకో. ఇంతకీ అబ్బాయి ఎక్కడ?"

"అమ్మ స్నానంచేయిస్తోంది."

తిరిగి సమాధానంచెప్పలేదు బదరీ.

'నీవుచాలాచిక్కిపోయావు. కొంచెంశ్రద్ధతీసుకో బదరీ!'

"నువ్వుకూడాను. నువ్వూ ఆరోగ్యంగా లేవుగా!" నవ్వుతూ అన్నాడు.

"నాకేం, నేను బాగానేవున్నాను. ఇలాంటప్పుడు నీరసంగానే వుంటుందిలే. కొద్దిరోజుల్లో మామూలుగా అయిపోతాను."

అంతలో కమలతల్లి బిడ్డనుతీసుకుని లోపలికివచ్చింది.

"చూడు కమలా! వీడుమొత్తానికి అసాధ్యుడే...... మాంచి బలవంతుడౌతాడు." అని బదరనిచూచి, నాలుక కరచుకుంది.

"ఇక్కడ ఏంచేస్తున్నావ్ నువ్వు?"

"నేనే తీసుకొచ్చానమ్మా" అన్నది ప్రేమ తలుపు చాటునుంచి.

"త్వరగా వెళ్ళిపోవటం మంచిది"

ఆమాటలు లెఖ్ఖచేయకుండా, బిడ్డను చేతుల్లోకి తీసుకున్నాడు.

"ఓ, అంతా మీనాన్నపోలికే చూశావ్!" అన్నాడు సంతోషంతో.

త్వరగావెళ్ళిపో" అంటోంది కమలతల్లి.

బదరీ బిడ్డను ఆమెకందించి, గ్రుస్న వెనుతిరిగాడు. కమల నుద్దేశించి అన్నాడు.

"నాతో అవసరంవస్తే కబురుపంపు వస్తాను. అన్నట్లు నీఆరోగ్యం జాగ్రత్తసుమా!" బదరీ కమలను ప్రేమించలేదు అని ఆమెకూ తెలుసు. అయితే, ఆమాత్రం దయగావుండటం అన్యాయంకాదుగదా!

*  *  *

సరాసరి రాంగుప్త ఏకాంతమందిరంలోకి దారితీశాడు. ఆయనంటే కలిగిన భయం ప్రేమకలిగించినధైర్యంతో తొలగి పోయింది. ఆయనను మంచిచేసుకోవాలనీ, తనమీద ఆయన కున్న అపోహను పోగొట్టాలనీ ప్రయత్నించేశాడు.

"మీరు నాతో అజంతావరకు రాగలరా?"

"ఎందుకు?"

"మీరుచూడదగ్గ చిత్రపువులు, శిల్పఖండాలు కొత్తవి కొన్ని తయారయినై. దయచేసి......"

"చూచినందువల్ల నాకుకలిగే ప్రయోజనం?"

"దయచేసి రండి. వచ్చి చూచి, అప్పుడు నిర్ణయించు దురుగాని."

కొన్న క్షణాలు, నిమిషాలు యోచించాడు. చివరకు ఒక నిశ్చయానికివచ్చి అన్నాడు.

"సరే, పద, వెడదాం"

బదరీనారాయణ, రాంగుప్తకు విహారం తర్వాత విహారం, చైత్యం తర్వాత చైత్యం అన్నీచూపించాడు. రాంగుప్త అనేక కొత్త చిత్రాలను పరిశీలించాడు. వాటివెనుక

దాగివున్న కథలను తెలుసుకున్నాడు. బుద్ధుని చిత్రపువు చూచి స్థభించిపోయాడు. బుద్ధమూర్తి ఆతని మానసిక భావాలను రేపి కల్లోలం చేస్తోంది.

"ఇది నీవు చిత్రించినదే కదూ? దీన్ని గురించి విన్నాను. చాలా కష్టపడివుంటావు. బహుశా, ఈ చిత్రపువు నిన్ను పునీతుణ్ని చేసివుంటుంది."

"అవును. నిజం చెప్పారు. అంతకుముందె అణగారిపోయి, మానసికంగా యమయాతననుభవించాను. చిత్రం తాలూకు భావాలు నాలో కలిగినప్పుడు మనస్సు శాంతిపొందినట్లు భ్రమకల్గింది. తరుణోపాయంకోసం వెదికాను. చిత్రం పూర్తిచేశాను. మనశ్శాంతి కల్గింది. నిజంగానే మీరన్నట్లు పునీతుణ్ని కాగలిగాను."

రాంగుప్త బదరీకళ్లల్లోకి ప్రశ్నార్థకంగా చూచాడు.

"అయినా, నీవుచేసినపని క్షమార్హంకాదు"

"అవును. అయినా, దాన్నిగురించి ఎంతో పశ్చాత్తాపం పొందాను. చనిపోయేవరకు బ్రతకాలిగదా! మరణంకన్న యిప్పుడు నేను కోరుతున్నది ఏమీలేదు."

రాంగుప్తకు బుద్ధప్రతిమ చూపించాడు. ఆయన నిట్టూర్చాడు.

"నీవు నిజంగా ఎంతగా బాధపడింది తెలుస్తోంది నాకు. ఇందులో ఎంతటిరామణీయకత, సౌందర్యం ప్రతిపాదించావు! నీవు నిజంగా మారిపోయావు బదరీ!"

తర్వాత మరో జాతకకథాచిత్రం చూచాడు. అనేక బుద్ధవిగ్రహాలు చుట్టూమలచబడ్డాయి. మధ్య గౌతమబుద్ధుడు

భార్యాపుత్రులనుండి భిక్ష స్వీకరిస్తున్నట్లు రమణీయంగా, భావ స్ఫోరకంగా నిర్మించబడ్డది.

"దీన్ని మలచుటలో నీఅభిప్రాయం ఏమిటో నా కర్థం కావటంలేదు" అన్నాడు బదరీ నుద్దేశించి క్రీగంటచూస్తో.

"క్షమాభిక్ష వేడుకుంటున్నాను. కాని, అందుకునాకు యోగ్యత లేదనిపిస్తోంది. అదీకాక, యిందులో ఆ తల్లి కుమారుణ్ని అడుగుతోంది - తండ్రినుండి ఆశీర్వాదం పొందమని. నా కొడుకేగనుక నన్నుయిలా అర్థిస్తే, నేను ఏమియివ్వగలను నే చేసిన మహాపాపం గాక."

"కాదు బదరీ! నీ పశ్చాత్తాపంలో భాగంపంచు. నీ తప్పిదం గొప్పదే కాని, నీపశ్చాత్తాపం అంతకన్న బలమైంది. మరి నీ కన్నకొడుకు నీపాపం పంచుకుని, పాపి కాకూడదు గదా!"

"ప్రేమవల్ల జన్మించలేదు...ఉద్రేకం వాని నీ లోకం లోకి తీసుకువచ్చింది."

"కావచ్చు బదరీ! ఆదృష్టితో అతన్ని పెంచగూడదు కదా! నీప్రేమాభిమానాలను పొందితే నీ కొడుకు ఉత్తమ పురుషుడు కాగలుగుతాడు."

"నన్ను పెంచుకోనిస్తారా మీరు రాంగుప్తా?"

"ఇప్పుడే కాదు. ఇంకా కొన్నిరోజులు పోనివ్వు. అప్పుడూ నీ బాధ్యత, తండ్రిబాధ్యత పెరిగి పెద్దవాడైన తర్వాతగదా! అప్పుడు నీయిష్టంవచ్చినట్లు పెంచుకో."

రాంగుప్త తిరిగి వెళ్ళిపోబోతున్నప్పుడు అతనిముఖం ఆనందంతో విప్పారింది. ఇంటికివెళ్ళి, ఆనందంతో వ్రాసుకోవ

టం ప్రారంభించాడు. ఎన్నో రోజులనుండి మూలబడివున్న తాళపత్రాలు, ఘంటాలు బయటకొచ్చినయ్. అలా ఎంతో సేపు వ్రాసుకున్నాడు. ప్రేమ, భార్య వచ్చినప్పుడు అన్నాడు.

"ప్రమీలా, పాపంచేసినవాడే పుణ్యానికి అర్హుడు. ఎంత పాపంచేస్తే, అంత ప్రాయశ్చిత్తం. తర్వాత పుణ్యం లభిస్తుంది. అది మానవధర్మం – లోకంపోకడ. బదరీని నేను క్షమించాను. అతను చాల మంచివాడు. చాల గొప్ప వాడు ప్రమీలా.బదరీ...సంతోషంగా వుంది కదూ!"

ప్రేమకుగాని, తల్లికిగాని ఏం సమాధానం చెప్పాలో తోచలేదు.

*　　*　　*　　*

ఉత్తరదేశంలో హూణదండయాత్రలు ప్రారంభమ య్యాయి. అనేకదేశాలనుండి ప్రజలు తండోపతండాలుగా అజంతాసానువుల నాశ్రయించుతున్నారు. ప్రాణభీతితో పారి పోయి దక్షిణదేశాలకు వలసవస్తున్నారు. ఎక్కడ చూచినా హూణదండయాత్రల కథలే చెప్పుకుంటున్నారు. ఎవరినోట విన్నా రక్తపాతాన్నిగురించినగాథలే. పసిపిల్లాదిగా హూణ క్రౌర్యం తలచుకుని, భయపడుతున్నారు.

"హూణులంటే సామాన్యమానవులు కారు నరరూప రాక్షసులు. లావాప్రవాహంలో ఎదురీదివచ్చినవాళ్లు. కనబడ్డ వారందర్నీ చిత్రహింసచేయటం తప్ప వారికేమీ తెలీదు. ఇప్ప టికే అనేకరాజ్యాలు వశంచేసుకున్నారు. ఇంకా చేసుకుంటు న్నారు. వాళ్లు ఎక్కడ కాలుపెట్టినా హత్యలు, దోపిళ్ళు, మరణాలే.

హూణదండయాత్రలకు భయపడి, ప్రాణాలు అరచేత పట్టుకునివచ్చిన కాందిశీకముఠాలు చాలా నీరసించిపోయాయి. సరియైన తిండితిప్పలులేక, ఏదో అంచినంతవరకు ఆకులు, కాయలు తింటూ, ఏ గుంటలో నీళ్లో త్రాగి, ఆరోగ్యం పాడు చేసుకున్నారు. బౌద్ధభిక్షువులు అలాంటివారికి చేతనైనసేవ చేస్తూనేవున్నారు. కాని, వారివ్యాధి చివరకు కలరాగా పరిణమించింది. వ్యాధి భయంకరరూపం దాల్చింది. లెక్కలేనన్ని మరణాలు. ప్రతిరోజూగుట్టలుగుట్టలుగా పడి చనిపోతున్నారు. అన్నిరకాల వనమూలికలుఔషధాలు నిష్ప్రయోజనాలైనాయి. భిషక్‌భిక్షువులు కంటికికునుకులేకుండా సేవచేస్తూనేవున్నారు. అయినా రక్షించలేకపోతున్నారు. దురదృష్టవశాత్తు అజంతాలోకూడా వ్యాధిసోకింది. అనేకమంది యతులు భిక్షువులు, రోగగ్రస్తులైనారు. అందులో ప్రేమకూడా ఒకతె.

బదరీ ప్రేమకు శుశ్రూషచేశాడు. కొన్నిగంటలలోనే ప్రేమ స్పృహతప్పిపోయింది. మాటలురావటంలేదు. పిచ్చి చూపులు చూస్తోంది.

బదరీ ఆమెకోసం మృత్యువుతో పోరాటం సాగించాడు. ఆమెవుండేగుహాను పరిశుభ్రంచేశాడు. చేతుల్లోకి తీసుకుని సేవ చేశాడు.

గోపీతోకలసి మూలికలు వెతకి పట్టుకొచ్చాడు. అయితేనేం ?

"అబ్బ! రాకరాక ఈ పాపిష్టిజబ్బే ఎందుకురావాలి ప్రేమ్! నీకుకాక నాకైనా వస్తే ఎంత బావుండేది! నీవు బ్రతికివుండేదానివిగదా!" అంటూ విలపించాడు.

అనేకమందిలాగానే ప్రేమకూడా నీరసించిపోయింది.
ఒకరోజుమధ్యాహ్నం బదరీ ఆమెను వొళ్ళోకితీసుకుని, కళ్ళ లోకిచూస్తూ విచారిస్తున్నాడు. "బదరీ, నిన్నువొదిలి పోలేను బదరీ! నిన్ను ప్రేమిస్తున్నాను. నేను చచ్చిపోను. నీకోసం అయినా బ్రతికివుంటాను. నా మరణించేరాకుమారి యింకా అలానేవుంది. దాన్ని పూర్తిచేయలేదు. పద బదరీ, వెడదాం" అంటూ లేవబోయి కూలబడిపోయింది.

"బదరీ! నన్ను దగ్గరగాతీసుకో. యింకా యింకా దగ్గరగా తీసుకో...అబ్బ!...నా బదరీ......

బదరీ పిచ్చివాడైపోయాడు ఆమెప్రేమవిహ్వాలత చూచి. అలాగే మృత్యుముఖంలో ఒకవారంరోజులు తచ్చాడి చివరకు బదరీకి, లోకానికి కాకుండా వెళ్ళిపోయింది ప్రేమ కుమారి. మృతకళేబరాన్ని వాఘిరావొడ్డుకు తీసుకువెళ్ళాడు... తనే...చితిపేర్చాడు...

రాంగుప్తయింటికి వెళ్ళి, ఈ ప్రళయవార్త చెప్పాలనుకున్నాడు. లోయలోకి - నదిదాటి...ఆ ఒంటరిగృహానికి దారి తీశాడు. దాదాపు అందరూ మృత్యుముఖంలోవున్నట్లు భయపడ్డాడు.

"బదరీ!...నీరసంగా రాంగుప్తగొంతుక వినిపించింది. "బదరీ! యిడుగో నీకొడుకు. రక్షించుకో. వాణ్ని బ్రతికించుకోగలిగితే మేమంతా వాడిలోజీవిస్తాం నాయనా!...తీసుకెళ్లు"

కమల నిర్జీవస్థితిలోవుండి మాట్లాడలేకపోయింది. జాలిగా దయగా అతనివేపు చూచింది. ఆమెతల్లి మూల్గిమూల్గి స్పృహతప్పిపోయింది. బదరీకి దుఃఖంఆగలేదు. అందరూమృత్యు

గహ్వారంలో వున్నారు. ఎవరిని రక్షించగలడు? ప్రేమించిన ప్రేమనే రక్షించుకోలేకపోయాడు, వీరందర్నీ రక్షించగలడా? కొడుకుని? ఏమో!

కొడుకుని తీసుకుని బయలుదేరాడు. వాఘీరాలో స్నానంచేయించి, చితిదగ్గరకువచ్చాడు. చితికి నిప్పంటించాడు. ఖణఖణమండుతున్నాయి. తనఆత్మ ఆ చితిలో కాలిపోతోంది. తనప్రేమ బూడిదై పోతోంది. ఏడ్వాలనిపించింది. కళ్లలో అశ్రువులు లేవు. చితిమంటలవేడికి ఎప్పుడో ఆవిరై పోయింది కన్నీరు. మనస్సు, ఆత్మ, హృదయం – అన్నీ ఎండి, మాడి కాలిపోయినై.

నిస్సహాయంగా కన్నకొడుకును చేతుల్లో పెట్టుకొని అజంతాకు తిరిగివచ్చాడు. లోకమంతా చీకటైపోయింది. కావలసినవాళ్ళు, ప్రేమించినవాళ్లు, ప్రేమింపబడ్డవారు అందరూ నాశనమైపోయారు.

"గోపీ! నా కొడుకునైనా బ్రతికిస్తావా?"

గోపీకి జాలివేసింది. లోకం తలక్రిందులుగా అవుపించింది. ఓషధులు వెదకివెదకి వేసారిపోయివున్నాడు పాపం!

"ఏమైనాచేయి గోపీ! నా కొడుకునుమాత్రం రక్షించు వీని నెలాగైనా బ్రతికించుకోవాలి గోపీ!"

"అలాగే ప్రయత్నంచేద్దాం!"

అనేకమంది ప్రయత్నించారు. లెక్కలేనన్ని ఔషధాలు ప్రయోగించారు.

చివరకు ఒకమూలిక లభించింది. వింతవాసన. ప్రయోగించబడింది. పనిజరిగింది. కలరా ఆగిపోయింది. ఇంకా అనేకులు రక్షించబడ్డారు.

వచ్చినదారినే వెళ్ళిపోయింది మహామారి. అనేకమందిని తనతో తీసుకువెళ్ళింది. రాంగుప్త జీవించాడు. భార్య, కూతుళ్ళు వెళ్ళిపోయారు. ఇప్పుడు రాంగుప్త అజంతాలోనే. వుండటం. ఎవరితోను మాట్లాడడు. ఏదో వ్రాసుకుంటూంటాడు.

* * *

చైత్యం ఒక్కసారిగా తూళితంఅయిందా అనిపిస్తోంది. పోయినవారు పోగా, మిగిలినవారు రక్షింపబడ్డారు. బదరీ ప్రేమకడసారికోర్కె తీర్చదలచాడు. మరణించేరాకుమారి చిత్రం పూర్తిచేయాలి. ప్రేమకుమారి కళ్ళలోకనిపిస్తోంది. రాజకుమారికిబదులు ప్రేమకుమారిని చిత్రించాడు. ప్రేమలో తపించి, పలవరించి మరణించిన మధురమూర్తి ప్రేమ.

బదరీ బ్రతికేవున్నా, మృతజీవిలా బ్రతుకుతున్నాడు. పేరూ పెంపూ లేని బ్రతుకు. విలువలేని జీవితం. ఆచార్య విజ్ఞానందులు బదరీని అర్థంచేసుకుని చైత్యాచార్య పదవినిచ్చారు. పద్మదత్తువలె తనుకూడా శిష్యులకు శిల్ప, చిత్రకళలను నేర్పనారంభించాడు.

నూతనకళారాధకులు ఆతనిశిష్యులైనారు. చిత్రకారులు, శిల్పులు అనేకమంది అజంతాను, బదరీని ఆశ్రయిస్తున్నారు. ఎక్కువచైత్యాలకు అవకాశంకలిగింది.

కొత్తవిహారాలు నిర్మించవలసివచ్చింది. కొత్తచైత్యాలను చెక్కవలసివచ్చింది. కొండకు మరోవైపున నూతనంగా గుహాలు నిర్మింపబడుతున్నాయి.

శిల్పాలు, లెక్కలు వేసుకొని పని ప్రారంభించారు. పరిసర రాజ్యాలనుండి అనేకమంది కూలీలు వచ్చి, పనిచేస్తున్నారు.

మరొకమారు శిలలకు చైతన్యం కలిగింది. ఎక్కడవిన్నా ఉలిధ్వనులే. అసంఖ్యాకంగా జనం వచ్చి పనిచేయటం ప్రారంభించారు. కొండలను తొలిచి, గుహాలను మలచి, నివాసయోగ్యంచేసుకుంటున్నారు. గోడలు కళాఖండాలుగా మారిపోతున్నాయి, కొన్నిసంవత్సరాలు మళ్ళీ సజీవంగా కృషిసాగిపోతోంది. అవిరామకృషిఫలితంగా కొత్తగుహాలు తయారవుతున్నాయి.

గుహాలనిర్మాణం పూర్తయింది. చిత్రకారులు రంగులు చిలుకనారంభించారు. శిల్పులు బౌద్ధశిల్పాలు, బోధిసత్వుని విగ్రహాలు మలచనారంభించారు. గుహాలు కళకళలాడుతూ నవ్యశోభలతో అలరారుతున్నాయి.

ఆచార్య విజ్ఞానందులు, బదరీనారాయణ ఈ కళాఖండాలను పరిశీలిస్తూ పచారుచేస్తున్నారు. అది సౌందర్య నిలయం. ఆచార్య విజ్ఞానందులు వయోవృద్ధులైపోయారు. ఒణికిపోతున్నారు. బదరీనికూడా వృద్ధాప్యం ఆవరించింది. పలితకేశాలు మనిషికి సంపూర్ణత్వాన్ని ప్రసాదించినయ్. ముఖంముడతలుపడిపోయింది. దేవపాల్, గోపీకూడా వయసును బట్టి మారిపోయారు. నాగోజీ, ప్రభుఘోష్. ఆంజనేయులు ఏనాడో మహామారికి ఆహుతైపోయారు. మిగిలినవారంధరూ

శతవృద్ధులు, పూర్వస్నేహితులు. ఈలోకంలో కష్టసుఖాలు పంచుకుని అనుభవించి మరోలోకం వేపు ఎదురుచూస్తున్నారు. ఎప్పుడు బుద్ధదేవునికృప తమపై ప్రసరిస్తుందాఅని నిరీక్షిస్తున్నారు.

* * * *

బదరీనారాయణకుమారుడు కమలానంద్ పెద్దవాడవుతున్నాడు. చిన్నతనంనుండే కళాభ్యాసంచేయటంవల్ల అనతి కాలంలోనే పరిపూర్ణకళాయోగి కాగలిగాడు. అనేకచిత్రాలు, శిల్పాలు అతనికళాభిజ్ఞతకు నిదర్శనాలుగా తయారయినాయి. అటు చిత్రకళలో, రంగురంగుల చిత్రాలు వేయటంలో యిటు శిల్పప్రతిమలను మలచటంలో సిద్ధహస్తుడనిపించుకున్నాడు.

యక్ష, యక్షిణి, కిన్నెర, కింపురుషులంటే కమలానంద్‌కి యిష్టం. జాతకచిత్రాలను వారితో నింపివేశాడు. తండ్రి బోధలతో కమాలానంద్ సంపూర్ణుడైనాడు.

విజ్ఞానంద్ తర్వాత బదరీనారాయణ ఆచార్యపీఠం అలంకరించాడు. ప్రఖ్యాత చిత్రకారుడు, శిల్పికావటంతో అందరికీ ఆయనంటే ఆదరాభిమానాలు, ప్రేమ, గౌరవం. శిష్యులు ఎందరు వచ్చినా, వారివారి అనుమానాలను యిట్టే పరిష్కరించేవాడు. తా నొకనాడు వూహించుకున్న నదీతత్వం ఈనాడు అందరిమీాద అద్భుతంగా పనిచేస్తోంది. మానవుల జీవితాలు సుఖవంతంచేయటమే ఆయనధ్యేయం. చాలమంది బదరీనే బోధిసత్వునిగా భావించి తమచిత్రాలలో శిల్పాలలో

రూపొందించేవాడు. బుద్ధుడుకూడా యింతటి సౌమ్యుడా అన్న అనుమానంకలిగేది వారికి.

తరచు నదీతీరాన విశ్రాంతితీసుకోవడం బదరీకి అలవాటై పోయింది. అక్కడ ఆ వాఘీరానదీతీరాన వున్నప్పుడు అతని మనస్సు నిర్మలంగా వుండేది. ఏదో అపూర్వశాంతి అక్కడ లభించినట్లుండేది. గతించినగాథలన్నీ అక్కడ మరచిపోయే వాడు. నిర్వాణాన్ని అభిలషిస్తూ, శూన్యంలోకి చూస్తూ ఈ బాధామయజీవితంనుండి విముక్తిపొందటానికి ఇంకా ఎన్ని రోజులు ఈ మానముద్రవహించాలా అని విచారించేవాడు.

అలాంటి సమయంలో కమలానంద్ బదరీని కలుసు కునేవాడు. తండ్రికొడుకులు ఆ తీరాన అనేక జీవితరహస్యాలు మాట్లాడుకునేవారు. అప్పుడప్పుడు రాంగుప్తకూడా ఆ సమా వేశాల్లో పాల్గొనేవాడు.

* * *

తాపసికిసైతం ఒక్కొక్కప్పుడు ఉద్రేకం కలగడం సహజం. అలాగే బౌద్ధాచార్య బదరీనారాయణకు ఆరోజు తలవనితలంపుగా ఉద్రేకం కలిగింది. అనూహ్యఆవేదనకు గురి అయ్యాడు. మనస్సు పరిపరివిధాల పరితపించింది. అలాంటి ఆవేదన కలిగినప్పుడల్లా ఒక మహోన్నత కళాఖండాన్ని సృష్టిం చటంలో నిమగ్నుడయ్యేవాడు పూర్వం బదరీ. యిప్పుడూ అలాగే ఓ అపూర్వసృష్టికి పూనుకున్నాడు. అంతకుముందు ఎవరూ ఎన్నడూ చిత్రించని రూపశిల్పం అది. నిద్రాహారాలు మాని, అవిరామంగా కృషిచేసి పూర్తిచేశాడు.

ఇది చాలా పెద్దచిత్రం. నిండైన రూపురేఖలతో తొణికిసలాడే సంపూర్ణ మానవుడు. నఖశిఖపర్యంతం తపోనిష్టాగరిష్టుడైన మహామహునికి వుండే లక్షణాలు ఆ మూర్తిలో ప్రస్ఫుటంగా గోచరమవుతున్నాయి. పవిత్రచిహ్నమైన పద్మం ఒకచేతిలో మెరుస్తోంది. అది పరిపూర్ణ మూర్తి.

మానవుని మహోన్నత లక్షణాలు అన్నీ ఆ మూర్తిలో మూర్తీభవించినయ్. శాంతి, సౌభ్రాతృత్వం, మానసికోల్లాసం, ఆనందం, పవిత్రత—ఎన్నో సుగుణ లఖని అది.

ఆ పవిత్రమూర్తి కిరువైపుల రాజులు, రారాజులు, వందలాది పురుషులు, స్త్రీలు భక్తి ప్రపత్తులతో ప్రణమిల్లి వినయవిధేయతలను చూపెడుతున్నారు...చుట్టూ నందనోద్యానం. అశోకవృక్షచ్ఛాయలో ఉపవిష్టుడైన గౌ ముని చిత్తరువు అది.

చిత్రరచన పూర్తి అవగానే బదరీనారాయణ ఆచార్య విజ్ఞానందుని దర్శించాడు రాంగుప్త, దేవపాల్, గోపీకుమార్ అందరూ వచ్చారు ఆ మూర్తి దర్శించటానికి.

విజ్ఞానందులు నడవలేనిస్థితిలో వుండికూడా బదరీ సాయంతో అలాగే వచ్చాడు.

"ఇదే నా చివరిరచన ఆచార్యా!"

అందరికళ్ళు ఆనందంతో మెరిసినయ్. నిశ్చలంగా ఆ మూర్తిని దర్శిస్తూ పరవశంచెందారు. విజ్ఞానందులు అన్నారు "నీవు యింకేమీ చిత్రించనవసరంలేదు. ఇది నీ చిత్రాలలో మకుటం. మేము మామూలుగా బుద్ధునిఉపదేశాలు విని, ప్రచారంచేసితరిస్తాము. నీవు బుద్ధుని సజీవుణ్ని చేశావు నీ చిత్రా

లలో. మేము పూరికే నమ్మి తరించాలని ప్రయత్నించాం. నీవో, హృదయాన్ని అర్థంచేసుకుని, ప్రతిరూపకల్పనచేసి, బుద్ధునిమూర్తికి, వారిపవిత్రాత్మకు శాశ్వతత్వం కల్పించావు. నీవు నిజంగా అదృష్టవంతుడివి బదరీ! బుద్ధుడు నీకు ఆదర్శమే కాదు, సహచరుడు కూడాను. ఆయనమూర్తి నీలో ప్రతిరూపం దాల్చింది. నీవు మహాతపస్వివి. నీకు ప్రణామంచేస్తున్నాను బదరీ!''

రాంగుప్తకూడా ఆసమయంలో కొంచెం మాట్లాడాడు. కొన్నిసంవత్సరాలకుగాను యిదే తిరిగి ఆయన భాషించటం.

"చిత్రరచనలో ఒక క్రొత్తయుగం కనుగొన్న గౌరవం నీకుదక్కింది బదరీ! ఇందులో సంగీతం, సాహిత్యం, తత్త్వం, జీవితరహస్యం ఎన్నో అగుపిస్తున్నాయి నాకు. అందులో శిల్పరహస్యా లున్నాయి. అందులో నే నాట్యభారతిదరహాసం వున్నది. అది మహోన్నత కళాసృష్టి.''

"మీరు నన్ను పొగడుతున్నారు. అన్యాయం'' అన్నాడు బదరీ.

గోపీకుమార్‌కి మాటలుదొరకలేదు. ఎలా బదరీని అభినందించాలో తెలీక, భుజంమీద చెయ్యివేసి, తనమనస్సులోని భావాల్ని స్పర్శతోనే వ్యక్తంచేశాడు.

కొన్నిక్షణాలు మౌనంగా గడచిపోయినవ్.

"దీన్ని ఏమని పిలవాలి?'' అనిఅడిగాడు ఆచార్య విజ్ఞానందులు.

"పద్మపాణి - అవలోకితేశ్వరుడు''

"అవును. అదే బావుంటుంది. ఈ విహారాన్ని పద్మ

పాణివిహారం అందాం. అజంతాను దర్శించే ప్రతివ్యక్తిని ఉద్రేక పరుస్తుంది. అజంతాకళాతీర్థానికి మరింత పవిత్రత చేకూరుస్తుంది.

*　　*　　*　　*

క్రింద వాఘోరా ప్రవహిస్తోంది మందంగా. వొడ్డున నిల బడి, బదరీ ఆలోచిస్తున్నాడు. ఎన్నో స్మృతులు మనోఫలకం మీద చిత్తరువుల్లాగా మెరిసి, మాయమైపోతున్నాయి. ఏవీ అతనినిశ్చయాన్ని మార్చలేవు అన్ని ఉద్రేకాలకు, ఉద్వేగా లకు అతీతుడు యిప్పుడు. అతనితండ్రి, ఆయనభావవాదం, లక్ష్మీదత్తు, ఆయనదగ్గర శిష్యరికం, ఉజ్జయినీకాంతల ప్రేమకలా పాలు, తన ఆటవికజీవితం, దేశదేశాలుతిరగటం, అజంతాకు చేరటం, ప్రేమకుమారిని ప్రేమానంద్‌గా కలుసుకోవటం, కమల, ఆమెనాట్యాలు, తనకుకలిగిన యవ్వనోద్రేకాలు, ఆచార్య పద్మదత్తులుచేసినజ్ఞానబోధ, రాంగుప్త విరచితగ్రంథం, మహామారి, తనప్రేమ నశించిన సాయంత్రం, తొలిచిత్రరచన, ఆనందుని పరిత్యాగం, బుద్ధచిత్రం, పద్మపాణి, తనకుమారుడు కమాలానంద్...అన్నీ చిత్రాలుగా ఒక్కసారి కళ్ళలో మెరిసినయ్.

అన్నీ జ్ఞాపకాలు, స్మృతులుగా అగుపించి, మాయమై నయ్. అలాగే నిలబడి ప్రవాహంవైపు చూస్తున్నాడు. దూరాన సప్తగుండాలమోతలు వినిపిస్తున్నయ్. ఆకాశం నిర్మలంగా వుంది. పర్వతసానువులు సంధ్యచీకట్లలో ఛాయాచిత్రాల్లాగా అగుపిస్తున్నాయి. మరోప్రపంచం కళ్లకుకట్టినట్లు అగుపిస్తోంది. సుఖశాంతులకు ఆలవాలమైన మరోప్రపంచపు స్వాగతగీతాలు చెవుల్లో రింగుమంటున్నాయి. సూర్యాస్తమయం అయింది.

చీకటి పడింది. అలాగే నదివొడ్డుననిలబడి యోచిస్తున్నాడు శాంతిగీతాలువినిపిస్తున్నాయి. స్నేహితులరూపాలు, ప్రపంచం- అన్నీ...చీకట్లో కరగిపోతున్నాయి. చుట్టూ చీకటి అలము కొంటోంది. అఖండజ్యోతి అగుపించి, ఒక్కసారి చుట్టూ పెన వేసి, తనలో లీనంచేసుకున్నది.

---

# ఉత్తమ నవలలు

| | | | |
|---|---|---|---|
| యుగసంధి | భాస్కరభట్ల | రు. | 4-00 |
| మిగిలిందేమిటి ? | లత | | 1-75 |
| తారుమారు | కొసరాజు | | 2-50 |
| చీకటి వెలుగు | ముద్దంశెట్టి | | 1-50 |
| పాడులోకం | ,, | | 1-50 |
| గుడిగంటలు | ఎల్లోరా | | 1.00 |
| గృహలక్ష్మి | కె. చంద్రమతి | | 2-00 |
| చివరకు మిగిలేది | బుచ్చిబాబు | | 2-75 |
| గుడ్డివాడు | ధనికొండ | | 0-50 |
| మనోరమ | ప్రేమచంద్ | | 3-00 |
| నిరంజన్ | రవీంద్రనాథ్ మైత్ర | | 2-00 |
| యాత్రికుడు | ప్రబోధకుమార్ సన్యాల్ | | 3-50 |
| అన్నా కెరినినా | టాల్‌స్టాయ్ | | 7-00 |
| అనుమానం | ,, | | 3-00 |
| అమ్మ | మాక్సిం గోర్కీ | | 5-00 |
| భయస్థుడు | ,, | | 5-00 |
| ముగ్గురు మిత్రులు | ,, | | 5-00 |
| పేకమేడలు | టర్గినీవ్ | | 2-25 |
| యమకూపం | కుప్రిన్ | | 4-00 |
| బడిపిల్లలు | నొసోవ్ | | 2-00 |
| కొడుకులు - కూతుళ్ళు | | | 6-00 |
| అహం - అసూయ | జేన్ ఆస్టిన్ | | 2-50 |
| ఇనపపాదాలు | జాక్ లండన్ | | 4-00 |
| నానా | ఎమిలిజోలా | | 2-50 |
| థెరెసా | ,, | | 2-50 |
| డోరియన్ గ్రే | ఆస్కార్ వైల్డ్ | | 3-50 |
| మానవహృదయాలు | మపాసా | | 3-00 |
| కోకోరో | సొసెకి నట్సుమే | | 1-00 |

# ఉత్తమ కథాసంపుటములు

| | | | |
|---|---|---|---|
| ఆశాప్రియ | బుచ్చిబాబు | రు. | 1-00 |
| ఆమెనీడ | ,, | | 1-00 |
| దేశం నాకిచ్చిన సందేశం | ,, | | 1-00 |
| లోకంకోసం | భరద్వాజ | | 1-00 |
| కల్పన | ,, | | 1-00 |
| నర(క)లోకం | ,, | | 1-00 |
| త్రినేత్రుడు | ,, | | 1-00 |
| జాలిగుండె | ,, | | 1-00 |
| దావానలం | ,, | | 1-00 |
| ఉన్నది వూహించేది | ,, | | 1-00 |
| పాపం | ,, | | 1-00 |
| మమకారం | ,, | | 1-00 |
| జయంతి | ,, | | 1-00 |
| అర్థాంగి | ,, | | 1-00 |
| భాగేశ్వరి | ,, | | 1-00 |
| అనూరాధ | ,, | | 1-00 |
| పద్మవ్యూహము | ,, | | 1-00 |
| అపశ్రుతులు | ,, | | 1-00 |
| చిత్రగృహం | ,, | | 1-00 |
| పగటికలలు | దాసు | | 0-75 |
| గోపోప్పిళ్ల న్యాయం | లింగరాజు | | 1-00 |

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ-2